ప్రచురణ :
1979

ప్రతులు :
2000

వెల :
రూ. 12-00

హక్కులు :
రచయితవి

ప్రాప్తిస్థానం :
జి. వెంకటరామారావు,
ఇం. నెం. 18-7-739/2
అవుట్ సైడ్ గౌలీపుర,
హైదరాబాద్-500263

ముద్రణ :
దక్షిణభారత ప్రెస్
హైదరాబాద్-500 004

'ఆంధ్రభూమి' దినపత్రిక నుంచి పునర్ముద్రణ

సంక్షిప్త ప్రచురణ
1. 'ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు'
2. 'ప్రసారిత', జులై-సెప్టెంబరు 1978

# ఒక మాట

బస్తీ ఉజడ్‌నా సహల్ సహీ
బస్నా సహల్ నహీఁ జాలీమ్
బస్తీ బస్నా ఖేల్ నహీఁ
బస్తే బస్తే బస్తీ హై.

"పేటను నాశనం చేయడం సులభం; నిర్మించడం సులభం కాదు. ఓ క్రూరుడా! ఒక్కొక్క ఇల్లు కట్టుకుంటూ పోతుంటేనే పేట అవుతుంద"ని అన్నాడు ఫానీ కవి. అది తెలుగువారికి ఎక్కువ వర్తించినట్లు మన చరిత్ర తెలుపుతోంది.

హైదరాబాద్‌పై పోలీసుచర్య జరగడం, నిజాంనవాబు తొలగడంతో తెలుగు ప్రజలు రాజకీయంగా ఒకటి కావడానికి గల అడ్డుగోడలు కూలిపోయా యని మనం భావించాం. కానీ చరిత్ర మహా టక్కరిది. అది ఎందరెందరో మేధా వులను బోల్తా కొట్టించింది. మన రాష్ట్రంలో రెండుసార్లు జరిగిన ప్రత్యేకరాష్ట్ర ఆందోళనలలో ఫాసిస్టుశక్తుల ప్రమేయంలేదు. అంతఃకలహాలను పెంచే విదేశ దొరల పాలన లేదు. వీటిని ప్రజాందోళనలుగానే ప్రచారాలు చేసుకొన్నాం. మనలో చారిత్రక దృక్పథం చాలా తక్కువ, క్షణికోద్రేకాలు ఎక్కువ. అట్లా సాగుతున్నది మన చరిత్ర.

మన భాషలో చరిత్ర, రాజకీయాలు తెలిపే గ్రంథాల సంఖ్య చాలాల్లో పరి మితం. ప్రామాణికమైన ఆంధ్రప్రదేశ్ చరిత్ర రచనపై ఎంతో కృషి జరుగ వలసి ఉన్నది. మన నాయకుల జీవితచరిత్రలు, ఆత్మకథలు, అభినందన సంచికలు, ప్రత్యేక సంచికలే మన చరిత్రకు ముఖ్యమైన ఆధారాలు. రాజకీయ పార్టీల చరిత్రలు కొన్ని లేకపోలేదు. కానీ వాటి దృష్టి పూర్తిగా రాజకీయం వాటిలోని కొన్ని భాగాలు చరిత్ర రచనకు కొంతవరకు ఉపకరిస్తాయి. అయితే వాటి పరిశీలనలో సునిశిత దృష్టి చాలా అవసరం.

ప్రఖ్యాత విద్వాంసులు, ప్రముఖ జర్నలిస్టులు శ్రీ తిరుమల రామచంద్ర గారు ఇటీవల జరిగిన ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఎన్నికల సమయంలో 'ఆంధ్ర భూమి' దినపత్రికలో ప్రచురణ కొరకు ఈ ఇతిహాసాన్ని నాచేత వ్రాయించారు.

'ఆంధ్రభూమి'లో ఇది సీరియల్‌గా ఆదివారం సంచికల్లో ప్రచురిత మౌతున్నప్పుడే కొందరు మిత్రులు గ్రంథరూపంలో దీన్ని తేవలసిన అవసరం గురించి చెప్పారు. ఇది ఇంకా ఒక ఆలోచనకు రాకముందే శ్రీ పి. సత్యనారా యణగారు (డిప్యూటీ డైరెక్టరు, భారత సమాజ విజ్ఞాన పరిశోధన మండలి, దక్షిణ ప్రాంతీయ కేంద్రం) 'ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు' అనే గ్రంథంలోను, 'ప్రసారిత (త్రైమాసిక, జులై-సెప్టెంబరు 1978)లోను సంక్షిప్తరూపంలో ప్రచురించి నాకు మరికొంత ఉత్సాహం కలిగించారు. సమయ ప్రాధాన్యతను బట్టి మూడవ ప్రకరణాన్ని 'ఆంధ్రప్రదేశ్' (నవంబరు 1978) పత్రికనుంచి గ్రహించాను. పత్రికల్లో ప్రచురిస్తున్నప్పుడు గ్రంథ విస్తరణ భీతిచే వదలి పెట్టిన అంశాలను ఇప్పుడు ఫుట్‌నోట్‌లలో చూపించాను. హైదరాబాద్ చరిత్రపై కుతూహలం గలవారికి ఈ గ్రంథం చివరిలో చూపిన పుస్తకాలు కొంతవరకు ఉపయోగపడతాయి. నా రచనకు ఈ పట్టికలో చూపిన పుస్తకాలు, ఆంధ్ర ప్రభ, హిందూ, సియాసత్ పత్రికలు మిక్కిలి తోడ్పడ్డాయి.

ఆంధ్రప్రదేశ్ చరిత్ర రచనా కృషిలో ఇది నా రెండవపుస్తకం. ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఉద్యమ సందర్భంలో ప్రచురించిన "మన చరిత్ర, సంస్కృతి, రాజకీయాల"ను తెలుగుప్రజలు ఆదరించారు. ఆ ఉత్సాహంతో ఈ చరిత్రను విడుదల చేస్తున్నాను తెలుగు పాఠకలోకం నుంచి మరొకసారి ఆదరణకోరుతూ. ముద్రణాదోషాలు తప్పవు. ప్రాజ్ఞులు మన్నించాలి.

## కృతజ్ఞతలు

ఈ చరిత్రను మొదటిసారి ప్రచురించిన 'ఆంధ్రభూమి' దినపత్రిక సంపాదకులకు,

ముఖ్యంగా శ్రీ తిరుమల రామచంద్రగారికి

సంక్షిప్తరూపంలో ప్రచురించిన శ్రీ పి. సత్యనారాయణగారికి,

"భారతీయ లౌకిక విధానం - హైదరాబాదు ప్రముఖులు" అనే ప్రకరణాన్ని ప్రచురించిన "ఆంధ్రప్రదేశ్" సంపాదకులు, రాష్ట్రప్రభుత్వ సమాచార-పౌరసంబంధాలశాఖ డైరెక్టర్‌గారికి,

అడిగిన వెంటనే ఈ గ్రంథంపై తమ అమూల్యాభిప్రాయం వ్రాసి ఇచ్చిన శ్రీ జి. కృష్ణ (ఆంధ్రప్రభ - ప్రత్యేక విలేఖరి) గారికి,

కవరు డిజైను వేసిన మిత్రులు శ్రీ ఏ. పండరినాథ్‌గారికి,

ముద్రాపకులు దక్షిణభారత ప్రెస్ వారికి,

టైటిల్ ప్రచురించిన రామా ప్రెస్ వారికి,

నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

రచయిత

# మరొక మాట

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రజలు ఆంధ్రప్రదేశీయులు అని తార్కికుల భావన; ఆంధ్రులేనని ఈ గడ్డపట్ల నెనరున్న వారి నమ్మిక. ఆంధ్రులు వేరు, తెలంగాణా వారు వేరు అని కొందరు రాజకీయవాదుల నిత్యప్రబోధం. వారి ప్రబోధాను సారమే పరిపాలనలో పనిచేసే చిన్నా పెద్దా ఉద్యోగులలో పలువురు సంభా విస్తున్నారు. ఇతిహాసం తెలిసిన వారికి ఈ వ్యత్యాసం హాస్యాస్పదం. ఆంధ్ర, తెలంగాణా అనేవి పర్యాయ పదాలు.

ఏనాడో పూనా పరిపాలనకూ, నాగ్‌పూర్ పరిపాలనకూ నెలకొన్న వైమనస్యాలు ఆధారంగా ఈనాడు మహారాష్ట్రలో మహారాష్ట్రులు, నాగ వైదర్భులు తాము విడిపడవలసిన వారంటున్నారే! ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాల అంతఃశైత్యాలకు ఉదాహరణ బలం ఉందిగదా అనేవారుండరా ఏమి ?

యావదాంధ్రాన్ని పరిపాలించిన వారు మనకు చరిత్ర ద్వారా తెలిసి నంతలో శాతవాహనులు, విష్ణుకుండినులు, కాకతీయులు, కుతుబ్‌షాహీలు. ఈస్ట్ ఇండియా కంపెనీ ధర్మమా అని ఆంధ్రులు వివిధ పరిపాలనా ప్రాంతాలలో ఉండిపోవలసి వచ్చినది. మనలో పలువురికి ఈస్ట్ ఇండియా కంపెనీపట్ల మోజు శేషించే ఉన్నదిగదా. అందువలన ప్రాంతీయ విభేదాలు కొనసాగడం సహజమే.

ఇతిహాసం తెలియనివారు విభేదాలతో తాము సతతమై ఇతరులను సతమతం చేస్తూ ఉంటారు. అటువంటి బెడదను నివారించడానికి ఈ ఇతిహాసం రచించారు శ్రీ జి. వెంకటరామారావు. కానీ మనదేశంలో నిరక్షరాస్యులే అధిక సంఖ్యాకులు వీరివలన ద్వేషాలు ప్రచారాలు కావు. అక్షరాస్యులు చేసినంతగా నిరక్షరాస్యులు విద్వేషాలు ప్రచారం చేయరు. అక్షరాస్యులలో పలువురు చదువరు. వీరి ప్రయోజకత్వం సంపాదనకు పరిమితం. ఇటువంటి ప్రయోజకులతో బాధపడు తున్నది మనదేశం. రాజకీయ వాదులకు ఇటువంటి వారి బలమే ప్రధానం. అటు వంటి వారు పదవులకు ఎక్కవచ్చు, అధికారం నెరపవచ్చు, విద్యాలయాలలో పాఠాలు బోధిస్తూ ఉండవచ్చు. నిషేధం ఎట్లా సాధ్యం!

శ్రీ జి. వెంకటరామారావు ఈ పుస్తకంలో పేర్కొన్న టాటెన్‌హాం పద్ధతి పరిపాలన, ఇటువంటి రాజకీయ వాదులకు ఆలంబనం అయిన ఒక ఊత కర్ర. ఇంకా అనేక ఊత కర్రలున్నాయి. ఈ టాటెన్‌హాం పద్ధతి వలన వాటిల్లిన ఆలస్యాలు, అస్పష్ట విధానాలు, రాష్ట్రంలో వేర్పాటు ఉద్యమానికి కొంతవరకు కారణాలు. వేరే ముఠా రాజకీయాల ప్రభావం లేదనికాదు. ముఠా రాజకీయాలు విశ్వవిద్యాలయ వ్యవహారాలలోకి శాశ్వతంగా చొచ్చుకుపోయినాయని శ్రీ వెంకటరామారావు నిజమే వ్రాశారు. మరి- మనదేశంలో ఎప్పట్లో నాయకుల స్వార్థంకై రూపొందిన ముఠా రాజకీయాలు కూడా సర్వజన హిత రాజకీయాలని నమ్మేవారు ఉన్నారు కదా.

కేవలం ఉద్యోగుల ప్రవర్తన వలననే ప్రాంతీయ విభేదాలు వాటిల్లుతున్నవని ప్రచారం చేసే అవ్యక్తులూ లేకపోలేదు. ఉద్యోగులచేత అవకతవక పనులు చేయించే రాజకీయవాదులు బాగానే ఉంటున్నారు.

ఇటువంటి మానసికస్థితితో ఈ ఆంధ్రప్రదేశ్ ఇప్పటివరకు బతికి ఉంటున్నది. ఇప్పటికి యావదాంధ్ర ప్రదేశ్‌కు వర్తించని, ప్రాంతీయ చట్టాలు అమలులో ఉన్నాయి. ముఖ్యంగా భూముల పరిపాలనకు సంబంధించినవి. ఎందుకో?

శ్రీ వెంకట రామారావు ఈ ఆవేదనలను గుప్తంగా ఉంచుకొని వ్రాస్తున్నారు. ద్వేషావేశం కానరాకుండా వ్రాస్తున్నారు. అది ఒకనాడు నిజాం రాష్ట్రంలో దేశసేవా నిరతులు అవలంబించిన సంయమన పద్ధతి.

ఈ ఇతిహాసం చదవదగినది. మరచిపోరానిది. తగు దృక్పథాన్ని కలిగించడానికి ప్రేరకం అవుతుంది. రచయిత ఈ ప్రయత్నం అభినందనీయం.

హైదరాబాదు
ఫిబ్రవరి 7, 1979

జి. కృష్ణ

# ఇందులో

# సైనిక, సివిల్ ప్రభుత్వాలు

"నా తెలంగాణ కోటి రత్నాల వీణ"

—దాశరథి.

1712 లో చిన్ ఖిలిచ్ ఖాన్ స్థాపించిన నిజాం రాజ్యం 1948 సెప్టెంబరు 17వ తేదీన హైదరాబాద్‌పై పోలీసుచర్య సమాప్తంతో అంతరించింది. ఆరోజు సాయంకాలం ఏడున్నర గంటలకు హిజ్ ఎగ్జాల్టెడ్ హైనెస్, రుస్తుమె దౌరాన్, అరస్తు-ఎ-జమాన్, లెఫ్టినెంటు జనరల్ ముజఫర్-ఉల్-ముల్క్, వాల్ ముమాలిక్, నవాబ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహదూర్, ఫతేజంగ్, సిపే సాలార్, బ్రిటిషు ప్రభుత్వానికి వినయ విధేయుడైన మిత్రుడు, నిజాముద్దౌలా, నిజాముల్ ముల్క్ ఏడవ ఆసఫ్‌జా దక్కను రేడియోలో చేసిన ప్రసంగంలో 286 సంవత్సరాల ఆసఫ్‌జాహీ వంశ పరిపాలనకు వీడ్కోలు పలికాడు.

## నిజాం రేడియో ప్రసంగం

"నా ప్రభుత్వం రాజీనామా చేసి రాష్ట్ర పరిపాలనను నేను స్వయంగా, నడిపించాలని సిఫారసు చేసింది. ఈ పని కొంచెం ముందు జరిగితే రాష్ట్రానికి కొంత మేలు చేకూరేదనే భావనతో నేను మంత్రివర్గం సమర్పించిన రాజీనామా ఆమోదించాను. యుద్ధాన్ని ఆపివేస్తున్నట్లు గౌరవనీయులైన భారత గవర్నర్ జనరల్‌కు కబురంపాను. కొత్త మంత్రివర్గం ఏర్పడేవరకు పరిపాలనలో నాకు సహాయకులుగా ఉండటానికి కొంతమంది సభ్యులతో ఒక కమిటీ నియమించాను. సభ్యుల పేర్లు :- 1. మహాఘనత వహించిన బిరారు రాకుమారుడు (సర్వ సేనాధ్యక్షుడు), 2. మేజర్-జనరల్ ఎల్ ద్రూసూ (కమాండర్), 3. నవాబ్ దీన్‌యార్ జంగ్ (పోలీసు కమీషనర్) 4. జి. రామాచారి (మాజీ మంత్రి), 5. శ్రీ అబుల్ హసన్ సయ్యద్ అలీ (రజ్వీకి పూర్వం ఇత్తెహాద్ అధ్యక్షుడు) 6. శ్రీ పన్నాలాల్ పిట్టీ.

"ప్రస్తుతం బొంబాయికి మొకాం మార్చుకున్న సర్ మిర్జా యిస్మాయిల్,

నవాబ్ జైన్ యార్ జంగ్, దివాన్ బహాదుర్ అరామముదు అయ్యంగార్లకు రాష్ట్రం విచ్ఛేయవలసిందిగా ఆహ్వానాలు పంపించాను, లాయకలీ ప్రభుత్వం రాజీనామాతో తలెత్తిన సమస్యలపై వారు నాకు సలహాలివ్వగలరని ఆశిస్తున్నాను. స్టేటుకాంగ్రెస్ అధ్యక్షుడైన స్వామీ రామానంద తీర్థ విడుదలకై ఆజ్ఞాపించాను. ఈ తరుణంలో స్వామీజీ సేవలు రాష్ట్ర ప్రజలకు లాభదాయకంగా ఉంటాయని భావిస్తున్నాను. కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులపై గల నిషేధాజ్ఞలను తొలగించాను. నా మిత్రుడైన భారత ఏజెంట్-జనరల్ శ్రీ కె. ఎం. మున్షీతో సంప్రదింపులు ప్రారంభించాను. ఆయన చేసిన కొన్ని సూచనలు సమయోచితమైనవి. నా ప్రియమైన ప్రజానీకమంతా కుల మత విద్వేషాలను విస్మరించి సోదర భారత ప్రజలతో కలిసి ఒక నూతన జీవితాన్ని ప్రారంభించుకుంటారని ఆశిస్తున్నాను.

"నా మాజీ ప్రభుత్వం ఐక్యరాజ్యసమితిలో పెట్టిన కేసుపై వొత్తిడి తీసుకురావద్దని ఆజ్ఞాపించాను. భారత ప్రభుత్వంతో స్నేహసంబంధాల నూతన శకంలో మనం కాలు పెట్టబోతున్నామని మీకు మళ్ళీ ఒకసారి జ్ఞప్తికి తెస్తున్నాను. ప్రజల యోగక్షేమాలకై మా వంశం ఎంతగా పాటుపడుతు వచ్చిందో నేను కొత్తగా చెప్పవలసిందేమీ లేదు."

## సివిల్ పద్ధతిన నడిచిన మిలిటరీ పరిపాలన

నిజాం నవాబు ప్రకటించిన కమెటీకి అధికార బాధ్యతలు మోయవలసిన అవసరం కలగకుండానే భారతసైన్యం హైదరాబాద్‌లో ప్రవేశించిన వెంటనే భారత ప్రభుత్వం అధికారం హస్తగతం చేసుకొంది. రాష్ట్రంలో పోలీసుచర్య జరుగుతున్నప్పుడు లాయకలీ ప్రభుత్వంలోని ఫజల్ నవాజ్ జంగ్, అబ్దుల్ హమీద్‌లు తప్ప అంతా పాకిస్తాన్‌కు పారిపోయారు. గృహనిర్బంధంలో ఉంచిన లాయకలీ 1950 మార్చి 6వ తేదీన పాకిస్తాన్‌కు పరారీ అయినాడు.

విజేతగా హైదరాబాద్‌లో ప్రవేశించిన మేజర్ - జనరల్ జయంత్‌నాథ్ చౌధరీ 1948 సెప్టెంబర్ 18వ తేదీన రాష్ట్ర పరిపాలనా బాధ్యతలను స్వీకరించాడు. హోదాను బట్టి మిలటరీ గవర్నరే అయినా ఆయన పరిపాలన సివిల్ పద్ధతి లోనే నడిచింది. మేజర్ జనరల్ చౌధరీ ప్రభుత్వం మేజర్-జనరల్ చౌధరీ (మిలిటరీ గవర్నర్) 2. శ్రీ పి. ఎస్. భక్లే (సివిల్ అడ్మినిస్ట్రేటర్) 3. నవాబ్ జైన్‌యార్ జంగ్ బహదూర్ 4. రాజా ధోండేరాజ్ బహదూర్,

6. పి. వి. ఎస్. రావు, 7. డి. వి. హెచ్. కృష్ణారావు. (సభ్యులు)

## సంస్కరణలు

చౌధరీ ప్రభుత్వం రాష్ట్రంలో అనేక సంస్కరణలను ప్రవేశపెట్టింది. 1948 లోనే రాష్ట్రంలో భూసంస్కరణల యుగం ప్రారంభమైంది. 1948 ఆగస్టు 15న మొదలుపెట్టిన జాగీర్దారీ రద్దు కృషి తొమ్మిది నెలల స్వల్ప కాలంలోనే పూర్తి అయింది. 1949 ఫిబ్రవరిలో నిజాం స్వంత ఆస్తి సర్ఫెకాస్ దివానీ (ప్రభుత్వం) లో కలసిపోయింది. జాగీర్దార్ల* నష్టపరిహారం కింద రాష్ట్రప్రభుత్వం 332 లక్షల రూపాయలను భరించింది. అనర్హులైన 8207 మంది జాగీరు ఉద్యోగులను రిటైర్ చేసో, కొంత నగదును ముట్టజెప్పో ఉద్యోగ విరమణ చేయించారు. సర్ఫెఖాసు సర్వీసులో 23,044 మంది ఉద్యోగులు పని చేసేవారు. సర్ఫెఖాన్ రద్దుతో దాని ఉద్యోగులకు ఎలాంటి నష్టం సంభవించ కుండ ప్రభుత్వం ఎన్నో జాగ్రత్త చర్యలు తీసుకొని ప్రతి ఒక్కరికి ప్రభుత్వ శాఖల్లో స్థానం కల్పించింది.

పోలీసు చర్య జరిగిన తర్వాత రజాకార్లపైన, లాయకలీ ప్రభుత్వ మద్దతుదార్లపైన భారత ప్రభుత్వం ప్రతీకార దృష్టితో ప్రవర్తించదలచలేదని సర్దార్ పటేల్ పార్లమెంటు కిచ్చిన హామీని మిలిటరీ గవర్నర్ పూర్తిగా పాటించాడు. రాష్ట్రంలో మత విద్వేషాలు తలెత్తకుండా ఆయన పటిష్టమైన పరిపాలన కొనసాగించాడు. మిలటరీ ప్రభుత్వంలో స్టేటు కాంగ్రెస్ నాయకులకు స్థానం లభించలేదు. తాము పోరాడింది రాష్ట్రాన్ని మిలటరీ ప్రభుత్వ వశం చేయటానికి కాదని స్వామీజీ మున్నగు స్టేటు కాంగ్రెస్ నాయకులు కేంద్ర ప్రభుత్వంపై వొత్తిడి తేగా మిలటరీ ప్రభుత్వం స్థానంలో 1949 డిసెంబరు 1వ తేదీన ఎం.కె. వెల్లోడీ సారధ్యంలో తాత్కాలిక ప్రభుత్వం (కేర్ టేకర్) ఏర్పడింది.

## వెల్లోడీ పరిపాలన

మిలటరీ ప్రభుత్వం సభ్యులతోనే వెల్లోడీ ప్రభుత్వం కొంతకాలం పని చేసింది. స్టేటు కాంగ్రెసుకు మంత్రివర్గంలో స్థానం కల్పించడానికై 1950 జూన్ 6వ తేదీన మంత్రివర్గ పునర్నిర్మాణం జరిగి శ్రీ బూర్గుల రామకృష్ణారావు,

శ్రీ వి.బి. రాజు, శ్రీ వినాయక్‌రావు విద్యాలంకార్, శ్రీ ఫూల్చంద్ గాంధీలకు స్థానం కల్పించడానికై శ్రీ డి. యస్. భక్లే, రాజా దోండే రాజ్, శ్రీ సి. హెచ్. కృష్ణారావులను తొలగించారు.

భారత రాజ్యాంగ సభకు 15 మంది సభ్యుల్ని నామినేట్ చేసారు. వారి పేర్లు:– 1. కుమారి పద్మజా నాయుడు, 2. కాశీనాథరావు వైద్యా, 3. కొండా వెంకటరంగారెడ్డి, 4. డా॥ ఎం. చెన్నారెడ్డి, 5. పులి రామస్వామి, 6. జె. హెచ్. సుబ్బయ్య, 7. జములాపురం కేశవరావు, 8. అరిగె రామస్వామి, 9. అన్నారావు, 10. మానిక్‌లాల్ గుప్తా, 11. పన్నాలాల్ పిట్టీ, 12. ఎం.వి. నాయక్, 13. అబుల్ హసన్ సయ్యద్ అలీ, 14. బాకర్ అలీ మిర్జా, 15. హరిశ్చంద్ర హెడా.

## తెలంగాణా సాయుధపోరాటం

తెలంగాణాలో కమ్యూనిష్టులు జరిపిన సాయుధ పోరాటం హైదరాబాద్ రాష్ట్ర స్వాతంత్రోద్యమ చరిత్రలో ఒక వీరఘట్టం. నిజాం నవాబు పరిపాలనను తుద ముట్టించడమేగాక, జాగీర్దార్లు ఇతర భూస్వామ్య వర్గాల బాధలనుండి ప్రజలకు విముక్తి కలిగించటం ఈ పోరాట ధ్యేయం. లాయకలీ ప్రభుత్వం యొక్క 'రజాకారానా' పద్ధతులపై ప్రజలకు విపరీతమైన ద్వేషం ఏర్పడిన తరుణంలో కమ్యూనిష్టులు ప్రజారంగంలోకి దిగి దాన్ని సమయోచితంగా వినియోగించుకొన్నారు. రజాకర్ల వద్ద పోలీసుల వద్ద ఆయుధాలను వశపరచుకొని కమ్యూనిష్టులు అనతికాలంలోనే తెలంగాణా అంతటా స్వైరవిహారం సల్పారు. ఒక్కొక్క గ్రామమే వారి వశమౌతుపోయింది. తెలంగాణామనే కొలనులో చేపపిల్లల్లా సునాయాసంగా కమ్యూనిష్టులు ఈదులాడటం ప్రారంభించారు. ఈ ఉద్యమకాలంలో నిజాంకు తొత్తులుగా నిలిచిన జాగీర్దార్లు జమీందార్లు, దేశ్‌ముఖ్‌లు, దేశ్‌పాండ్యాలు, వతన్‌దార్లు బాగా దెబ్బతినిపోయారు. అతి క్రూరంగా ప్రవర్తించిన జమీందార్లను కమ్యూనిష్టులు నిర్దాక్షిణ్యంగా హత్య చేసారు. కొందరిని తరిమి కొట్టారు. నల్గొండ, వరంగల్, ఖమ్మం జిల్లాలలో విస్తారంగాను అదిలాబాద్, కరీంనగర్, మెదక్ జిల్లాలలో కొన్ని ప్రాంతాలు కమ్యూనిష్టుల ఆక్రమణ కిందికొచ్చాయి. దాదాపు 4000 గ్రామాలకు ఫ్యూడల్ దోపిడీ వర్గాల నుంచి విముక్తి కలిగించారు. 10 లక్షల ఎకరాల భూమిని

పేదలకు పంచిపెట్టారు. పోలీసు చర్య జరిగేవరకు కమ్యూనిష్టుల పోరాటం ఒక అద్భుత జైత్రయాత్రగానే సాగింది. నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా ధ్వజమెత్తిన కమ్యూనిష్టులకు మద్దతు ఇవ్వడం ప్రజలు కర్తవ్యంగా ఆ రోజుల్లో భావించారు. పోలీసు చర్య తర్వాత కూడా సాగిన వారి పోరాటం చరిత్రలో పెద్ద వివాదానికి కారణమైంది.

## "రాత్ కీ సర్కార్; దిన్ కీ సర్కార్"

1948 ఫిబ్రవరిలో కలకత్తాలో ఆగ్నేయాసియా యువజన మహాసభ ప్రపంచ కమ్యూనిష్టు యువజన సంస్థల ఆధ్వర్యంలో జరిగింది. పైకి నిరపాయంగా కనపించే యీ మహాసభలలో కొన్ని ముఖ్యమైన తీర్మానాలు జరిగినవి. ఈ తీర్మానాల వెనుక వివిధ దేశాల కమ్యూనిష్టుల ప్రభావమున్నది. చీనా, బర్మా, మలయా, ఇండోనేషియా దేశాల కమ్యూనిష్టు పార్టీలు యీ సభలో ఒక ఉమ్మడి కార్యక్రమం నిర్ణయించుకున్నవి. తత్కారణంగా భారత కమ్యూనిష్టు విధానంలో మార్పువచ్చి పి.సి. జోషిని విప్లవ వ్యతిరేకిగా పేర్కొని అతని స్థానంలో బి. డి. రణదివేను పార్టీ కార్యదర్శిగా నియమించుకున్నారు.

ఈ మహాసభ చేసిన తీర్మానం ప్రకారం హైదరాబాద్ కమ్యూనిస్టు పార్టీ విధానంలో మార్పు వచ్చింది. మొట్టమొదట తెలంగాణాను సోవియట్ విధానంలోకి మార్పు చేయాలి. ఇక్కణ్ణించి తక్కిన భారతదేశానికి వ్యాప్తి చేయాలి. హైదరాబాద్ భారతదేశానికి నడిబొడ్డున ఉన్నది. హైదరాబాద్ పోతే అంత పోయినట్లే అని 1857 లో జరిగిన భారత ప్రథమ స్వాతంత్ర్య పోరాట సమయంలోనే బొంబాయి గవర్నర్ హైదరాబాద్‌లోని తన రెసిడెంట్‌ని హెచ్చరించాడు.

అంతవరకు నిజాం దుశ్చర్యలను ప్రతిఘటించటానికి స్టేట్ కాంగ్రెస్‌తో కలిసి పనిచేసిన కమ్యూనిస్టులకు స్టేటు కాంగ్రెస్, నెహ్రూ ప్రభుత్వం ప్రజా వ్యతిరేకంగా కనిపించాయి. యాధాతథ ఒడంబడిక నిజాం, సర్దార్ పటేల్‌లు పన్నిన కుట్రగా చిత్రించారు. ఈ సందర్భంలో రజాకార్లకు కమ్యూనిస్టులకు ఉమ్మడి శత్రువుగా నెహ్రూ ప్రభుత్వం గోచరించింది. 1946 ఆగస్టు 15 మొదలుకొని 1949 సెప్టెంబర్ 13 వరకు కమ్యూనిస్టులు 2000 మందిని ఖూనీ చేసినట్లు 22 పోలీసు స్టేషన్‌లమీద దాడి సల్పినట్లు కేంద్ర ప్రభుత్వానికి

రిపోర్టులందాయి. 1948 మే 4న నిజాం ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీపై నిషేధాజ్ఞలను తొలగించింది.

కమ్యూనిస్టులతో లాయకలీ ప్రభుత్వం పద్ధ లాలూచీని, కేంద్ర ప్రభుత్వం తీవ్ర చర్యగా పరిగణించి భారత గవర్నర్ జనరల్ లార్డ్ మౌంట్ బ్యాటెన్ తన ప్రత్యేక దూత క్యాంప్‌బెల్ జాన్సన్ ద్వారా తన ప్రభుత్వ నిరసనను తెలియబరిచాడు.

పోలీసుచర్య తర్వాత భారత ప్రభుత్వం కమ్యూనిస్టులపై తీవ్రమైన గాలింపు చర్య తీసుకొన్నది. తద్వారా తెలంగాణా సాయుధ పోరాటంపై కమ్యూనిస్టుపార్టీలో భిన్నాభిప్రాయాలు ఏర్పడ్డాయి. ఈ సందర్భంలో సోవియట్ నియంత స్టాలిన్ భారత కమ్యూనిస్టు నాయకులైన ఎస్. ఏ. డాంగే, అజయ్‌ఘోష్, రాజేశ్వరరావు, బసవపున్నయ్యలను మాస్కో రప్పించి తెలంగాణా పటం ఎదుట పెట్టుకొని. ఎటూ కమ్యూనిస్టు భూమిలేని తెలంగాణాలో వారి పోరాటం ఎలా జయప్రదమౌతుందని ప్రశ్నించాడు. "కాంగ్రెస్‌లో కమ్యూనిస్టులు—కుమార మంగళం సిద్ధాంతం" అనే గ్రంథంలో సతీంద్రసింగ్ దీన్ని పేర్కొన్నారు. ఇంతటి అల్లకల్లోలాలికి కారకుడైన రణదివే తెలంగాణాలో ఎన్నడూ పర్యటించనేలేదు. కమ్యూనిస్టుల దౌర్జన్య పద్ధతులను అరికట్టడానికై పోలీసు, సైనిక ప్రత్యేక దళాలను సర్దార్ పటేల్ నియమించినాడు. ఇవి సివిల్ సర్వీసులో పనిచేసే నంజప్ప ఆధ్వర్యంలో పనిచేసినవి. కమ్యూనిస్టులు చేసే దౌర్జన్యానికి ప్రతి దౌర్జన్యం చేసినారు. కమ్యూనిస్టులాక్రమించిన తావులన్నింటినీ పోలీసు బలగం ఆక్రమించుకుంది. కమ్యూనిస్టుల ఆచూకీ తెలియజేయ వలసిందని మిలిటరీ, పోలీసు దళాలు ప్రజలను నానా హింసలు పెట్టాయి. పగలంతా మిలిటరీ వాళ్ళు, రాజ్యం చేస్తే అడవుల్లో తలదాచుకున్న కమ్యూనిస్టులు అర్ధరాత్రి హటాత్తుగా వచ్చిపడి గ్రామ ప్రజలపై మెరుపుదాడులు జరిపేవారు. ఈ విధంగా దాదాపు ఏణ్నర్ధం తెలంగాణాలో పగలు పోలీసుల రాజ్యం, రాత్రులు కమ్యూనిస్టుల రాజ్యంతో ప్రజలు అరిచేతుల్లో ప్రాణాలు పెట్టుకొని జీవించారు. 'రాత్‌కీ సర్కార్', 'దిన్‌కీ సర్కార్' అంటే అధికార, అనధికార దౌర్జన్యాలనే నన్న మాట.

సర్దార్ పటేల్ 1950 అక్టోబరులో రెండవసారి హైదరాబాదు పర్యటన కొచ్చినపుడు ఫతేమైదానంలో బ్రహ్మాండమైన సభలో ప్రసంగిస్తూ ఈ విషయం

గుర్తుకు తెచ్చాడు. "తెలంగాణాలో కమ్యూనిస్టుల తుంటరి పనులు ప్రపంచ ప్రసిద్ధములై పోయినై. దీన్ని వారు ప్రజావిముక్తి పోరాటమంటున్నారు. చైనా పద్ధతిలో జరుపుకుంటున్న వారి పోరాట పద్ధతులు మహా సిగ్గుచేటుగా ఉన్నాయి. తమ గడ్డమీద స్వాతంత్ర పోరాటాలు జరుపుకుంటున్నప్పుడు చైనీయులు యిలా తమ స్త్రీలను పిల్లల్ని చంపుకున్నారా? వీరంతా ఒక్క నల్గొండ లోనే దాక్కున్నారా? జంటనగరాలలో ఎంతమంది కమ్యూనిస్టులు దాక్కొని ఉన్నారో మాకు తెలుసు. మీలో కొందరు వారికి రక్షణ కల్పిస్తున్నారు. వారి రహస్య తావులకు ఆహార పదార్థాలను చేరవేస్తున్నారు. అయుధ సామాగ్రిని సరఫరా చేస్తున్నారు. వీరి అల్లరులను అణచి వేయటానికై సమర్థుడైన ఒక అధికారిని నేను మీకిచ్చాను. అతడు తన విద్యుక్తధర్మాన్ని ఎంతో కష్టతరంగా నెరవేరుస్తు శాంతి భద్రతలను పరి రక్షిస్తున్నాడు." తెలంగాణా గడ్డమీద ఒక్క కమ్యూనిస్టును కూడా మిగుల నివ్వనని సర్దార్ శపథం చేసాడు. అన్నంత పనిచేసి చూపించాడాయన. "కనీసం రెండు దశాబ్దాల వరకైనా కమ్యూనిస్టులు హింసా చర్యలకు పూనుకొనటానికి సాహసించనంత తీవ్రంగా అణచివేత విధానం కొనసాగింది. తెలంగాణా సాయుధ పోరాటం–నక్సలైటు ఉద్యమం మధ్య 20 సంవత్సరాల విరామ ముండటం యాధృచ్ఛికమైన విషయం కాదు.

ఈ పోరాటంలో ఇరుపక్షాలు బాగానే నష్టపడ్డాయి. దాదాపు 50,000 మంది కమ్యూనిస్టులు వారి అభిమానులు జైళ్ళ పాలైనారు. 4000 మంది అశువులు బాసారు. 1947–48లో పాకిస్తాన్‌తో యుద్ధం చేయటానికైన, ఖర్చుతో సమానంగా, ఈ పోరాటాన్ని అదుపులో తేవటానికి ప్రభుత్వానికి ఖర్చు పెట్టవలసి వచ్చింది. 1951 ఆఖరువరకు ఈ సాయుధపోరాటం కొనసాగింది. ఎన్నికల తరుణంలో ఉపసంహరించుకున్నారు.

## ఫలితాలు

తెలంగాణా సాయుధపోరాటం కొన్ని సత్ఫలితాల నిచ్చింది. రాష్ట్రంలో 1949లోనే భూసంస్కరణలు ప్రారంభించబడ్డాయి. భూకమతాల గరిష్ఠశాసనం వచ్చింది. స్వంతసేద్యం చేసుకొనే భూస్వాములు 250 ఎకరాల మెట్టనైనా, లేదా 50 ఎకరాల మాగాణమైనా తమ స్వాధీనంలో ఉంచుకొనవచ్చని ఈ గరిష్ఠ శాసనం ఒక పరిమితిని విధించింది. అది ఆనాటికి విప్లవాత్మకమైనది.

పోరాటం ముగిసిన తర్వాత వేలాది ఎకరాలున్న భూస్వాములు తమ పొలాలను అతి తక్కువ ధరలకు రైతులకు అమ్ముకొన్నారు.

దేశంలో భూదానోద్యమాన్ని ఆచార్య వినోబాభావే తెలంగాణాలోనే ప్రారంభించారు.

భాషాప్రయుక్త రాష్ట్రాల ఉద్యమానికి బలం చేకూర్చింది.

హైదరాబాద్‌లో ప్రజా ప్రభుత్వం ఏర్పడినప్పుడు ఒక తెలంగాణా నాయకునికి ముఖ్యమంత్రి పదవి లభించింది.

## సాయుధపోరాటం సబబైనదేనా ?

భూ ఆకలి నివారణకు సాయుధపోరాటం ఒక్కటే పరిష్కారమార్గం కాజాలదని తర్వాత సంఘటనలు స్పష్టపరిచాయి. భారతదేశంలోని అమెరికా మాజీ రాయబారి చెస్టర్ బౌల్స్ తన పర్యటనానుభవాలను యిలా పేర్కొన్నాడు.

"1955 ఫిబ్రవరి నెలలో ములుగు కమ్యూనిటీ డెవలప్‌మెంట్ బ్లాక్‌ని నేను సందర్శించాను. ఈ ప్రాజెక్టు కింద ఉన్న 75 గ్రామాలలో 68000 ప్రజలు నివసిస్తున్నారు. ఇది హైదరాబాద్ స్టేటులో తూర్పుదిక్కున ఉంది. ఇక్కడ 1948లో కమ్యూనిస్టులు రక్తపాతంతో కూడిన విప్లవం లేవదీసారు. ఆ రోజుల్లో భూమి ఏ కొద్దిమంది భూస్వాముల చేతుల్లోనో ఉండేది. గ్రామాలలో నివసించే పెక్కురు నామమాత్రపు భూవసతి గలవారో, లేక వ్యవసాయ కూలీలైనవారు మాత్రమే. కమ్యూనిస్టు పార్టీ భూస్వాములను తొలగించటానికి వేలాదిమందిని హత్యచేసింది. ఈ దౌర్జన్యాన్ని అదుపులో తేవటానికి భారత ప్రభుత్వం 2 డివిజన్ల సైన్యాన్ని 30 వేలమంది పోలీసు బలగాన్ని వినియోగించ వలసి వచ్చింది. 1952లో నేనొకసారిక్కడి కొచ్చినప్పుడు భద్రితాదళం లేనిది ప్రయాణం చేయడం ప్రమాదకరంగా తోచింది.

"ఈ దహనకాండ జ్ఞాపకచిహ్నాలు ఎక్కడ చూసినా ఇంకా కనిపిస్తూనే ఉన్నాయి. రోడ్డుకు ఇరుప్రక్కల 500 గజాలవరకు నరికివేసిన అడవులు ఆ భయానక దృశ్యాలను జ్ఞాపకం తెస్తున్నాయి. ప్రాజెక్టు డైరెక్టర్ కొన్ని వివరాలు నాకు తెలియపరిచాడు.

'ఇదిగో, ఈ గ్రామాన్ని కమ్యూనిస్టులు పూర్తిగా నాశనం చేసివేసారు."

"ఇక్కడ ఫలానా భూస్వామి, అతని కుటుంబం మొత్తం అగ్నికి ఆహుతి అయింది."

"రెండేళ్ళ కింద మా నౌఖర్లు ఇక్కడ పనిచేయటానికొస్తే తక్షణమే వెళ్ళి పొమ్మన్నారు. లేకపోతే చంపేస్తామని బెదిరించారు".

"ఈ జిల్లాలో ఏ ఇంటిపైన చూచినా ఎర్రజెండాలు రెపరెపలాడుతు కనిపించేవి."

"ఈ 72 గ్రామాల ప్రజలిప్పుడు ఆనాటి దౌర్జన్య పద్ధతులకు స్వస్తిచెప్పి కొత్త జీవితాన్ని ప్రారంభించుకొన్న తర్వాత తృప్తితో జీవితం గడుపుతున్నట్లు నాకు కనిపించింది. వారి ముఖాలలో సుఖసంతోషాలు వెల్లివిరిసాయి. నూటికి 80 వంతుల భూమి ప్రజల చేతుల్లోకి మారింది. 60 శాతం వరకు వ్యాపించిన మలేరియా 2 శాతం వరకు మాత్రమే మిగిలింది. 6-11 వయస్సు మధ్యగల బాలబాలికలు సగానికంటే ఎక్కువ స్కూళ్ళల్లో చదువుకుంటున్నారు. గ్రామ వీధులు పరిశుభ్రంగా ఉండి వాటి ఇరుప్రక్కల మురికి కాలువలు నిర్మించబడి ఉన్నాయి. పూర్తిగా శిథిలమై పోయిన మూడు గ్రామాలను కొత్తగా నిర్మించు కుంటున్నారు. ఈ గ్రామస్థులు తమ అభివృద్ధికోసరం చైతన్యవంతంగా ఉల్లాసంగా కృషి సల్పుతున్నారు."

విప్లవం విజయవంతమౌతే అది స్వతంత్ర సమరమౌతుంది—
అపజయం పొందితే పితూరీ అనబడుతుంది.

తెలంగాణా సాయుధపోరాటం రోడ్డుప్రమాదం వలె హటాత్తుగా సంభవించిన సంఘటన కాదు.

## గోసాయి, దేసాయి పార్టీలు

స్వాతంత్ర సమరంలో స్వామీజీ సారథ్యంలో పోరాడిన ప్రజాపక్షాలన్నీ సమరఫలితం అనుభవించే సమయం రాగానే దేని దారి అది చూచుకొన్నవి. స్టేటుకాంగ్రెస్‌లో అతివాద మితవాద వర్గాలు మొదటినించీ ఉన్నవే. అతివాద పక్షానికి స్వామీజీనాయకుడు. శ్రీ వి.బి. రాజు, సర్దార్ జములాపురం కేశవరావు, మాడపాటి రామచంద్రరావు యీ గ్రూపులోని సీనియరు నాయకుల కింద లెఖ్ఖ. శ్రీ పి. వి. నరసింహారావు, శ్రీ జలగం వెంగళరావు యీ గ్రూపులోని వారే.

మితవాద వర్గానికి శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీ కొండా వెంకటరంగారెడ్డి నాయకులు. డా॥ ఎం. చెన్నారెడ్డి యీ గ్రూపులోని వారే. కేంద్రంలో నెహ్రూ పటేల్ ముఠాలుగా కాంగ్రెసు తయారైనప్పుడు స్వామీజీ నెహ్రూ ముఠాను, రంగారెడ్డి పటేల్ ముఠాను బలపరిచారు. మితవాదులకు తెలంగాణా, కర్నాటకలో మంచిబలం ఉండేది. నిజాం సూచనలపై కేంద్ర ప్రభుత్వంతో సంధిమంతనాలు జరిపినట్లు నేరం పెట్టి బూర్గుల, రంగారెడ్డి, రామాచారి వైద్యాలను కాంగ్రెస్ ప్రాథమిక సభ్యత్వం నుండి సస్పెండ్ చేసాడు స్వామీజీ. దానిపై వ్యతిరేకవర్గం పోటీ కాంగ్రెస్‌ను పెట్టి శ్రీ జనార్ధన్‌రావు దేసాయిని అధ్యక్షునిగా, శ్రీ బూర్గుల రామకృష్ణారావును కార్యదర్శిగా చేసుకొని "గోసాయి", "దేసాయి" పార్టీలుగా విడిపోయాయి. 1948 లో పండిత నెహ్రూ హైదరాబాద్ కొచ్చినపుడు యీ రెండు గ్రూపుల తగాదాలతో విసుగుచెందినా పరిష్కరించలేక పోయాడు. ఈ బాధ్యత సర్దార్ పటేల్ పైన బడింది. 1949 లో సర్దార్ మొదటిసారి హైదరాబాద్ కొచ్చినప్పుడు జనవరి 10వ తేదీన ఇరువర్గాలను సమావేశపరిచి, వర్కింగు కమటీలో ఉభయ గ్రూపులకు సమాన ప్రాతినిధ్యమిచ్చి స్వామీజీ అధ్యక్షతన నూతన వర్కింంగ్‌కమిటీ ఏర్పాటుచేసాడు. అంతటితో పోటీకాంగ్రెసు ఒక్కటేగాక హైదరాబాద్ స్టేటుకాంగ్రెస్‌కుగల స్వతంత్రప్రతిపత్తి అంతరించిపోయి, అఖిలభారత కాంగ్రెసు కమిటీకి అనుబంధసంస్థగా మారిపోయింది. హైదరాబాద్ స్టేటుకాంగ్రెసుకు స్వామీజీ తర్వాత బిందూ, రంగారెడ్డి, మల్లప్పకొల్లూరు, జె. వి. నరసింగరావు వరుసగా అధ్యక్షులైనారు.

## ముఠా తగాదాలవల్ల నష్టపడ్డ కాంగ్రెస్

ఈ విభేధాలవల్ల స్టేటుకాంగ్రెస్ బాగానే నష్టపోయింది. పోలీసుచర్య జరిగిన రెండేళ్ళకు గానీ రాష్ట్రమంత్రివర్గంలో స్టేటుకాంగ్రెసుకు స్థానం లభించలేదు. అదికూడా పాక్షికమే. స్వాతంత్ర భారతదేశంలోని రాష్ట్రాలలో రాష్ట్రేతర వారితో మంత్రివర్గం ఏర్పడటం ఒక్క హైదరాబాద్ రాష్ట్ర చరిత్రలోనే జరిగింది. వీరి తగాదాలవలన ముఖ్యంగా అల్పసంఖ్యాక వర్గంలో స్టేటుకాంగ్రెసు నాయకుల పట్ల విశ్వాసం కుదరలేదు. "మేధావి, విశాలహృదయుడు, రాష్ట్ర నాయకత్వానికి సహజమైన అభ్యర్థి శ్రీ బి. రామకృష్ణారావు కూడా అప్పట్లో అల్పసంఖ్యాక వర్గాల పూర్తి విశ్వాసం పొందలేక పోయార"ని సర్దార్‌పటేల్

చరిత్రలో ఆయన కార్యదర్శి శ్రీ వి. శంకర్ పేర్కొన్నారు. స్వరాష్ట్రం, స్వభాషపై ఎక్కువ మక్కువ జూపే హైదరాబాద్ ప్రజలను పాలించిన ముఖ్య మంత్రులంతా గైర్‌ముల్కీలే. సర్ అలీ ఇమామ్, సర్ అక్బర్ హైదరీ, నవాబ్ ఛతారీ, మీర్జా ఇస్మాయిల్, జనరల్ చౌధరీ, ఎం. కె. వెల్లోడీ హైదరాబాద్ వారు కారు. వీరంతా ముల్కీ ఉద్యమాన్ని పోషించిన నిజాం ఉస్మాన్ అలీఖాన్ బహాదుర్ హయాంనాటి ముఖ్యమంత్రులే.

—— ——

* తెలంగాణాలో గ్రామాల వివరాలు (పోలీసు చర్యకు పూర్వం)

| వరుస సంఖ్య | జిల్లా పేరు | దివానీ | సర్ఫేఖాస్ | జాగీరు | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. | అత్రాఫ్ బల్దా | 3 | 573 | 303 | 876 |
| 2. | నిజామాబాద్ | 521 | 1 | 229 | 751 |
| 3. | మెదక్ | 551 | 13 | 364 | 928 |
| 4. | మహబూబ్‌నగర్ | 698 | 15 | 718 | 1431 |
| 5. | నల్గొండ | 1002 | 15 | 239 | 1256 |
| 6. | వరంగల్ | 1177 | 4 | 291 | 1472 |
| 7. | కరీంనగర్ | 978 | 25 | 234 | 1227 |
| 8. | ఆదిలాబాద్ | 1881 | — | 262 | 2143 |

దివానీ = ప్రభుత్వ ఇలాకా.
అత్రాఫ్ బల్దా = కె.వి. రంగారెడ్డి జిల్లా.

* * *

హైదరాబాద్ రాష్ట్ర విస్తీర్ణం : 82,698 చదరపు మైళ్లు

1) సర్ఫేఖాస్ 8,100 చ.మై.
2) పాయిగా 3,262 ,,
3) జాగీర్లు 11,000 ,,

(1–3) 40.79%

మిగతా దివానీ — 59.21%

## జాగీర్ల వివరాలు

| | సాలీనా ఆదాయం | హిందువులు | ముస్లింలు | మొత్తం |
|---|---|---|---|---|
| 1. | 1 లక్ష రూ.లకు పైబడిన | 9 | 8 | 17 |
| 2. | రూ. 50,000 – 1 లక్ష | 4 | 13 | 17 |
| 3. | రూ. 25,000 | 17 | 24 | 41 |
| 4. | రూ. 12,000 – 25,000 | 18 | 55 | 73 |
| 5. | రూ. 8,000 - 12,000 | 20 | 56 | 76 |
| 6. | రూ. 4,000 – 8,000 | 62 | 96 | 158 |
| 7. | రూ. 1,000 – 4,000 | 262 | 213 | 475 |
| 8. | రూ. 500 – 1,000 | 110 | 42 | 152 |
| 9. | రూ. 500 కు తక్కువ | 102 | 43 | 145 |

లక్ష రూపాయలకు మించిన ఆదాయంగల జాగీర్లలో హిందువుల సంఖ్యను ముస్లింలతో సమానంగా చూపబడినా యీ వరుసలో ముగ్గురు మాత్రమే హిందువులు. 1. శివరాజ్ బహాదుర్, 2. మహారాజా కిషన్ ప్రసాద్, 3. రాజా రాయాన్ : మిగిలావి సంస్థానాలు. సంస్థానాలు జాగీర్లు కావు. మొదటి ఆసఫ్‌జా యీ రాష్ట్రాన్ని స్థాపించకముందునుండే అవి ఏర్పడి ఉన్నవి, నిజాంవారి స్వాతంత్ర్యాన్ని మన్నించి తమ రాష్ట్రంలో ఉండిపొమ్మన్నాడు. ఒక నిర్ణీత 'పేష్‌కష్' డబ్బు చెల్లించేంత వరకే వారు నిజాంకు బాధ్యులని గద్వాల సంస్థానాధీశునితో జేసుకొన్న ఐటిబిసన్స్ ఒడంబడిక వల్ల తెలుస్తున్నది.

నిజాం రాజ్యంలో సంస్థానాలు 14 – గద్వాల, వనపర్తి, జటప్రోలు, అమరచింత, పాల్వంచ, దోమకొండ, గోపాలపేట, ఆనగొండ, రాజాపేట, దుబ్బాక, నారాయణపేట, పాపన్నపేట, సిర్నాపల్లి, గురుగుంట, ఒక్కగురుగుంట తప్ప మిగిలా సంస్థానాలన్ని తెలంగాణా ప్రాంతంలోనివే. ఇందులో వనపర్తి, గద్వాల అమరచింత, జటప్రోలు. దోమకొండ, నారాయణపేట ఒక లక్షకు మించిన ఆదాయం కలవి.

# బూర్గుల మంత్రి వర్గం

"రెండు వందల యేడుల నుండి చిమ్మ
చీకటుల గ్రమ్మి, వెలుతురు రేక గనని
మాకు, ప్రథమ ప్రజా ముఖ్యమంత్రి వీవు,
కీర్తినీయ! బూర్గుల రామకృష్ణరాయ!"

— దాశరథి.

*హైదరాబాదు రాష్ట్ర శాసనసభకు జరిగిన తొలితుది ఎన్నికల ఫలితాలు: కాంగ్రెస్ 93, పీపుల్స్ డెమోక్రెటిక్ ఫ్రంట్ 42, సోషలిస్టు 1, ఇండిపెండెంట్లు 29 మొత్తం సీట్ల సంఖ్య 175. ఎన్నికల నాటికి కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగనందున ఇతర ప్రజాస్వామ్య వామపక్షాలతో కలసి యీ పార్టీ పీపుల్స డెమోక్రాటిక్ ఫ్రంట్ పేర పోటీ చేయవలసి వచ్చింది. నల్లగొండ, ఖమ్మం, వరంగల్, కరీంనగర్ జిల్లాలలో 4 సీట్లు తప్పితే అన్ని సీట్లను కమ్యూనిస్టులే గెల్చుకున్నారు. వారి నాయకుడైన శ్రీ రావి నారాయణ రెడ్డి నల్లగొండ పార్లమెంటు సీటుకు పోటీ చేసి పండిత నెహ్రూ కంటె ఎక్కువ ఓట్లు సంపాదించారు. ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు, సర్దార్ జములాపురం కేశవరావు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డి వంటి అగ్రనాయకులు సామాన్య కమ్యూనిస్టు అభ్యర్థుల చేతుల్లో ఓడిపోయారు.

## బూర్గుల మంత్రి వర్గం

ఎన్నికల్లో మెజారిటీ సంపాదించుకొన్న కాంగ్రెస్ పార్టీకి నాయకుని ఎన్నిక సమస్య ఎదురైనపుడు స్వామీజీ బిందూ పేరును ప్రతిపాదించగా, రాష్ట్రంలోని సగం జనాభాకు ప్రాతినిధ్యం వహిస్తున్న ఆంధ్రులకే నాయకత్వం లభించాలని రంగారెడ్డిగారు వాదించారు. అధిష్ఠాన వర్గం పిలుపుపై ఇరుపక్షాల నాయకులు ఢిల్లీకి వెళ్ళారు. పెద్దల జోక్యం లేకుండానే నాయకుని నిర్ణయించుకొచ్చారు. శ్రీ బూర్గుల రామకృష్ణారావుకు ముఖ్యమంత్రి పదవి లభించగా ఆయనతో పోటీ చేసిన బిందూకు హోంమంత్రి పదవి లభించాయి.

బూర్గుల మంత్రివర్గం:— డా॥ బూర్గుల రామకృష్ణారావు (ముఖ్యమంత్రి) దిగంబర్ రావు బిందూ, కె. వి. రంగారెడ్డి, వినాయక్‌రావు విద్యాలంకార్, డా॥ ఎం. చెన్నారెడ్డి, డా॥ జి. ఎస్. మేల్కోటే, నవాబ్ మెహదీ నవాజ్ జంగ్, ఫూల్చంద్ గాంధీ, వి. బి. రాజు, అన్నారావు గణముఖీ, జగన్నాథరావు చంద్రగీ, దేవీసింగ్ చౌహాన్ మంత్రులు. ఈ మంత్రులతో కొన్ని రోజులు గడవగానే ముఖ్యమంత్రితో సరిపడక శ్రీయుతులు ఫూల్చంద్ గాంధీ, వి. బి. రాజు, జగన్నాథరావు చంద్రగి, దేవీసింగ్ చౌహాన్‌లు రాజీనామా చేయగా ఒక్క చౌహాన్ మాత్రమే ముఖ్యమంత్రి కోరికపై రాజీనామా ఉపసంహరించుకొన్నారు. తరువాత ఎనిమిది మందిని అదనంగా మంత్రివర్గంలో చేర్చుకొన్నారు ముఖ్యమంత్రి. గోపాల్‌రావు ఎక్బోటే (కేబినేట్ హోదా) శ్రీయుతులు అరిగే రామస్వామి, శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మ. శ్రీనివాసరావు ఎక్కేకర్, భగవంతరావు ఘూచే ఎం. ఎస్. రాజలింగం, పల్లెర్ల హనుమంతరావు, విరూపాక్షప్ప (ఉపమంత్రులు) లకు మంత్రి పదవులు లభించాయి.

## తెలుగు భాషాభిమానం

కత్తినీ కలాన్నీ సరి సమానంగా ప్రయోగించ గల నేర్పరి బూర్గుల. సాహితీ సమరాంగణంలో సవ్యసాచి, ఆయన కొచ్చినన్ని భాషలు మనదేశ రాజనీతిజ్ఞులలో మరెవరికి రాలేదన్నా అతిశయోక్తి కాదు. బూర్గుల మంత్రివర్గం రాష్ట్రంలో అనేక అభ్యుదయ కరమైన సంస్కరణలను ప్రవేశ పెట్టింది. ఉర్దూ స్థానంలో సెకండరీ దశ వరకు ప్రాంతీయ భాషలు, ఉన్నత స్థాయిలో ఇంగ్లీషు బోధనా భాషలైనవి ఏ ఆందోళన అవసరం లేకుండానే పరిపాలనా వ్యవహారం ఇంగ్లీషులోనికి దిగింది. ఆనాడే తెలుగును అధికార భాషగా వర్తింప చేయటానికి విధిగా ఉద్యోగులలో ప్రతివానికి తెలుగు రావాలనీ, తెలుగులోనే ఉత్తర ప్రత్యుత్తరాలు జరగాలని ముఖ్య మంత్రి చరిత్రాత్మకమైన ఉత్తరువు జారీచేసారు. ఈ ఉత్తరువులు తెలంగాణా తెలుగు భాషా చరిత్రలో సువర్ణాక్షరాలుగా మిగిలి పోయాయి. తెలంగాణాలో తెలుగు భాషాభిమానం అట్టిది.

బూర్గుల హయాంలో భూసంస్కరణలకు తుది రూపం లభించింది. 1955 లో కొత్త రికార్డు ఆఫ్ రైట్స్‌ను తయారు చేయించారు. దీని వల్ల ఎంతో మంది సన్నకారు రైతులకు లాభం చేకూరింది. ఎన్నో సమస్యలకు ఆలవాలమైన

హైదరాబాద్ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉండటం మాటలు కాదు. మహారాష్ట్రులను, కర్ణాటులను, ఆంధ్రులను, మహమ్మదీయ వర్గంవారిని - పూర్వపు జాగీర్దారీ తెగ వారిని విశ్వాశంలో ఉంచుకుంటు పరిపాలన సాగించటం ఏ ముఖ్య మంత్రికైనా కష్టమైన పనే. ఆ పని బూర్గుల చేయగలిగారు.

## గండం తప్పింది

రామకృష్ణారావు గారికి ముఖ్య మంత్రి పదవి నల్లేరుపై బండి నడక కాలేదు. ఆయనకు వ్యతిరేకంగా కొన్ని విమర్శల నెహ్రూ వరకు పోయాయి. వాటి విచారణకు ప్రధాని నెహ్రూ హైదరాబాద్ కొచ్చారు. బూర్గుల వారికి అసెంబ్లీలో బలం ఉందో లేదో నిరూపించుకొనటానికి అవకాశ మిస్తూ నెహ్రూ శాసన సభ్యులతో రహస్య ఓటింగు పెట్టించారు. 200 మంది సభ్యులు పాల్గొన్న యీ ఓటింగులో కేవలం ముగ్గురు మాత్రమే ముఖ్య మంత్రికి వ్యతిరేకంగా ఓటు చేసారు. ఒక గండం తప్పింది. వకాలతు చేసుకొనే కాలం నాటి నుంచి ప్రాణ స్నేహితులుగా ఉంటున్న బూర్గుల, రంగారెడ్డి గార్ల మధ్య మంత్రి వర్గ నిర్మాణం నుంచే వైరాలు మొదలై అవి లోలోన తీవ్రమౌతూ రావు - రెడ్డి గ్రూపులుగా బైట కొచ్చాయి.

## అందరికి విశ్వాశ పాత్రుడు

రాజకీయాలలో స్నేహాలు, శత్రుత్వాలు శాశ్వతంగా ఉండవు. గర్భ శత్రువులు, గాఢస్నేహితులు అనే వారు యీ రంగంలో చాలా అరుదు. పొత్తులు కుదుర్చు కోవటం, అంతలోనే దూరమవటం రాజకీయాలలో సర్వ సామాన్యం. స్వామీజీ - బూర్గుల వారి సఖ్యత, రంగారెడ్డి- బూర్గుల వారి విభేదం అలాంటిది. ఖాళీ అయిన ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవికి వెనుక బడ్డ తరగతుల అభ్యర్థి పేర స్వామీజీ బూర్గుల వారి వర్గాలు మల్లప్ప కొల్లూరును తిరిగి పోటీకి నుంచుండ పెట్టగా రంగారెడ్డిగారి వర్గం జె. వి. నరసింగరావుని నిలపెట్టింది. ఇరు పక్షాల వారు మహా తీవ్రంగా ప్రచారాలు చేసుకొన్నారు. అధికార అభ్యర్థికే ఓటు చేయ వలసిందని ప్రధాని నెహ్రూనుండి తాఖీదుకూడా వచ్చింది. ఇంతచేసినా అధికార అభ్యర్థి ఓడిపోయి జె. వి. నరసింగరావు తొమ్మిది ఓట్ల మెజారటీతో గెలిచారు. ఈ చర్యతో రాష్ట్ర రాజకీయాలలో బూర్గుల వార పట్టు తప్పుతున్నట్లు కనిపించి

నడి. కేంద్రంలో నెహ్రూ, పటేల్ మధ్య విభేధాలున్నప్పుడు స్వామీ జీ వర్గం నెహ్రూను బలపరచగా రంగారెడ్డిగారి వర్గం సర్దార్ పటేల్‌ని బలపరచింది. ఇరు వర్గాల రాజీ వ్యక్తిగా బూర్గులవారు ముఖ్య మంత్రిగా ఎన్నికైనారు. ఆంధ్రుల సంగతి ఎలా ఉన్నా రాష్ట్రంలో మహారాష్ట్రుల కన్నడిగుల, అల్ప సంఖ్యాక వర్గాల వారికి విశ్వాశ పాత్రుడైన ఆంధ్రుడు అప్పట్లో రామకృష్ణారావు గారు ఒక్కరే.

## స్వామీజీ వర్గంతో పోటీ

హైదరాబాద్ రాష్ట్ర రాజకీయాలలో తెలంగాణా, మహరాష్ట్ర, కర్నాటక ప్రాంతీయ విబేధాలు మొదటినుంచి ఉన్నవే. ఈ బేధాలు ఆయా జిల్లాల స్థాయిలో పెద్దగా కన్పించక పోయినా రాష్ట్ర స్థాయిన జరిగే ప్రతి ఎన్నికలో దీని ప్రభావం కనిపించేది. తెలంగాణా పేరుతో బూర్గుల, రంగారెడ్డి; మరట్వాడ కర్నాటక పేరుతో స్వామీజీ బిందూ అగ్రశ్రేణి అభ్యర్థులుగా పోటాపోటీలు పడేవారు. మరొక వంక విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర ఐక్య కర్నాటక పేరుతో భాషా ప్రయుక్త రాష్ట్ర ఆందోళనలు నిరంతరం కొనసాగుతుండినవి. దీనికి స్వామీజీ నిరంతరం సుముఖుడే. రంగారెడ్డి గారితో తేడాలు వచ్చిన తరువాత బూర్గుల స్వామీజీ వర్గాన్ని మంచి చేసుకొనవలసి వచ్చినా ఆంధ్ర మహారాష్ట్రుల కన్నడిగుల మధ్య అంతర్గత వైరాలు సమసిపోలేదు. దీనికి తోడు ఆ రోజుల్లో శాసనసభలో పి. డి. ఎఫ్. అనే బలమైన ప్రతిపక్షం ఉండేది. అసెంబ్లీలో దీని నాయకుడు దేశపాండే.

## పి. డి. ఎఫ్. లో విభేదాలు

రాష్ట్రంలోని పి. డి. ఎఫ్. ప్రతిపక్షంలో కూడా ఐక్యతాస్వభావం పెద్దగా కన్పించలేదు. డాక్టర్ జయసూర్య ధగే లాంటి మేధావులకు పార్టీ నాయకులైన బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మి నరసింహరెడ్డి, సర్వదేవరభట్ల రామనాథం మున్నగు వారి మధ్య సమన్వయం కుదరలేదు. ప్రధాని నెహ్రూ ప్రత్యేక దూత ద్వారకా నాథ కచ్రూ హైదరాబాద్ కొచ్చినప్పుడు నెహ్రూ సర్దార్ మధ్యన గల వైరాన్ని పార్టీ తన ప్రయోగాలకు వినియోగించుకోలేక పోయింది. ఈ చర్చలకు సహాయ పడటానికి ముందు కొచ్చిన జయసూర్య కృషి ఫలించ లేదు. పి. డి. ఎఫ్.

సభ్యుల మధ్య దిన దినానికి విభేదా లెక్కువై అది నామ మాత్రపు వేదికగానే మిగిలింది. వీరి పిడి వాదానికి విసుగు చెందిన డాక్టరు జయసూర్యా పార్టీ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చివేసాడు.

ఇకపోతే తెలంగాణాలో ఎస్. బి. గిరి, మహాదేవ్ సింగ్ లాంటి కార్మిక నాయకులు సోషలిష్టు పార్టీ స్థాపనకు కొంత ప్రయత్నించారు. వీరి కార్యరంగం కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలకే పరిమిత మైనది. సాధారణంగా గ్రామీణ ప్రాంతాల రాజకీయాలు ఎన్నికల్లో గెలిచిన శాసన సభ్యుల అధీనమై ఉంటాయి. అందు వలన గ్రామీణ ప్రాంతాలలో యీ పార్టీ పెరుగలేక పోయింది. ఎన్నికల్లో పోటీ చేయటానికి సోషలిష్టు పార్టీకి ఎప్పుడూ డబ్బు సమస్య ఎదురౌతూ వచ్చేది. ఆ తాకిడికి తట్టుకోలేక ఈ పార్టీ శాసన సభలో తన సంఖ్యను పెంచుకొన లేక పోయింది.

## భాషా ప్రయుక్త రాష్ట్రాల చరిత్ర

భాషా ప్రయుక్త రాష్ట్రాల అవసరం గురించి 'కాంగ్రెసు చరిత్ర'లో డా॥ పట్టాభి సీతారామయ్య గారు యిలా వ్రాసారు. ... "సంయుక్త రాష్ట్రాల వంటి రాజధానులు ఒకే ఆచార వ్యవహారాలు గల జన సమూహంతో కూడి ఉన్నవి. బొంబాయి, మద్రాసు రాష్ట్రాల వంటి రాజధానులు వివిధ భాషలతో కూడిన జన సమూహం కలిగి ఉన్నవి. దక్షిణాదిన మద్రాసు రాష్ట్ర శాసన సభలో నూరు మందికి మించి ఆంధ్రులకు తమిళంగానీ, మలయాలీ భాషలుగానీ రావు. మరి నూరుమంది తమిళులకు తెలుగు, కన్నడ, మలయాలీ భాషలు రావు. మరి నూరు మంది కన్నడులకు వారి భాషలు తప్ప తక్కిన భాషలురావు. నూరు మంది సభ్యులకు పైగా అంటే దాదాపు సగం మందికి ఇంగ్లీషు రాదు. ఇటువంటి పరిస్థితి పరిష్కరించటానికి మద్రాసు నుండి ఆంధ్ర రాష్ట్రాన్ని విడదీసి, బొంబాయి మద్రాసు రాష్ట్రాలలోని కర్నాటకులకు ప్రత్యేక రాష్ట్రాన్ని నిర్మించి, మలయాలీ రాష్ట్రాన్ని వేరు చేయడమే సరి అయిన మార్గం."

బహు భాషలతో ఏర్పడిన రాష్ట్రం కృత్రిమంగా తయారవుతుందని బ్రిటిషు పాలకు లెరుగని సంగతి కాదు. 1911 లో వైస్రాయ్ లార్డ్ హార్డింజ్ బ్రిటిషు ప్రభుత్వానికి పంపిన నివేదికలో దేశాన్ని భాషా రాష్ట్రాలుగా విభజించాలని

సిఫారసు చేసాడు. భాషా ప్రయుక్తరాష్ట్ర విభజనకు కాంగ్రెసు ఆదిలోనే అంగీకరించింది. బెంగాల్ రాష్ట్ర విభజనకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం, బంగ్లాదేశ్ అవతరణ భాషా బంధం గొప్పదని నిరూపించాయి.

## హైదరాబాద్ రాష్ట్ర పరిస్థితులు

స్వదేశీ సంస్థానాలలో అతి పెద్దదై, మూడు ప్రాంతీయ భాషా విభాగాలుగా ఏర్పడిన హైదరాబాద్ రాష్ట్ర పరిస్థితులు ఇందుకు భిన్నమైనవి కావు. ఇది ఒక రాష్ట్రంగా ఉండిపోయినప్పుడు అక్కడ తెలుగు మాట్లాడే ప్రజలసంఖ్య 47.8 శాతం, మరాఠీ మాట్లాడేవారి సంఖ్య 24.3 శాతం, ఉర్దూ మాతృభాషైనవారి సంఖ్య 11.6 శాతం, కన్నడిగుల సంఖ్య 10.5 శాతం, ఇవిగాక ఇతరభాషలు మాట్లాడేవారి సంఖ్య 5.8 శాతంగా ఉండేది. తెలుగు మాట్లాడే ప్రాంతాన్ని తెలంగాణాగాను, మరాఠీ మాట్లాడే ప్రాంతాన్ని మరట్వాడాగాను, కన్నడం మాట్లాడే ప్రాంతాన్ని కర్నాటక్ అని వ్యవహరిస్తు వచ్చారు. వివిధ భాషలు మాట్లాడే యీ రాష్ట్రంలో భాషా సమైక్యత కనిపించకపోయినా భావసమైక్యత కూడా మృగ్యమే. ఏ సమావేశంలో చూచినా యీ విభేధాలు కొట్టవచ్చినట్లుగా కనిపించేవి ఈ మూడు భాషా విభాగాలను నిజాం కబంధహస్తం ఒక పరిపాలనా యూనిట్‌గా ఉంచగలిగింది. ఇది అతుకులబొంత వంటిదని ఆనాడే కొందరు మేధావులు గ్రహించకపోలేదు. ఈ సంగతిని తన తండ్రీ, ఆనాటి హైదరాబాద్ ప్రధాని సర్ అక్బర్ హైదరీకి ఎలా చెప్పేవాడో అస్సాం గవర్నరు సర్ అక్బర్ హైదరీ నాటి భారత గవర్నరు జనరలు రాజాజీకి 1948 సెప్టెంబర్ 30వ తేదీన వ్రాసిన లేఖలో పేర్కొన్నాడు. సుస్థిరమైన పరిపాలన ఇవ్వలేని హైదరాబాద్ సంస్థానాన్ని వెంటనే విభజించి, తెలంగాణా మరట్వాడా కర్నాటక ప్రాంతాలను వాటి సరిహద్దు రాష్ట్రాలలో చేర్చవలసిందని, అది సంభవం కాకపోతే నిజాం నవాబును బర్తరఫ్ చేసి హైదరాబాదును గవర్నరు పాలిత రాష్ట్రంగా చేయాలని తాను సూచించినప్పుడల్లా తన తండ్రికి మనస్తాపం కలుగుతుండేదని ఆయన ఆ లేఖలో స్పష్టపరిచాడు.

కల్లోలితమైన హైదరాబాద్ రాష్ట్ర రాజకీయాలు దాని విభజనదారిని సుగమం జేసాయి. "హైదరాబాద్ రాష్ట్ర భవిష్యత్ దాని విభజనపై ఆధారపడి ఉన్నది. నిజామాబాద్‌లో జరిగిన స్టేటు కాంగ్రెసు సమావేశంలోనే రాష్ట్ర

విభజనకు ఏకగ్రీవంగా ఆమోద ముద్ర లభించింది. దేశంలో భాషారాష్ట్ర నిర్మాణం పనికి కొంత ఆలస్యమైనా హైదరాబాద్‌ను తక్షణంగా విడగొట్టి తెలంగాణా జిల్లాలను మద్రాసుతోను, మిగితా జిల్లాలను బొంబాయి రాష్ట్రంలో కలిపివేయాలి. రాష్ట్ర విభజనకు వ్యతిరేకంగా కొన్ని ఫ్యూడల్ శక్తులు పని జేస్తున్నా అది ప్రజావాణి కాదు. విభజనకు ప్రజలు ఆందోళనలు లేవదీయాలి" అని స్వామీజీ పోలీసుచర్యకు పూర్వమే ప్రజలను మేల్కొల్పారు.

## కర్నాటక చరిత్ర

ఇక కర్నాటక చరిత్ర చూస్తే సువిశాలమైన కర్నాటక రాజ్యం 1564లో తళ్ళికోట యుద్ధంలోనే ముక్క చెక్కలైంది. ఎంతో కాలానికి కన్నడిగులనంతా హైదరాలీ ఒక చోట చేర్చ గలగాడు నాల్గవ మైసూరు యుద్ధంలో టిప్పు సుల్తాన్ మరణంతో ఐక్య కర్నాటక విచ్ఛిన్నమైంది. కొంత భాగాన్ని మద్రాసు ప్రెసిడెన్సీలోను, మరికొంత బొంబాయి ప్రెసిడెన్సీలోను కలిపివేసారు. బీదరు, రాయచూరు, గుల్బర్గా జిల్లాలను నిజాంలో చేర్చారు. మిగిలిన భాగాలతో మైసూరు సంస్థానం ఏర్పరచి వొడియార రాజులకు తిరిగి ఇచ్చివేసారు. 1954లో హైదరాబాద్‌లో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సమావేశంలో నాటి మైసూరు ముఖ్యమంత్రి శ్రీ కె. హనుమంతయ్య ఐక్య కర్నాటక ఏర్పడాలని సూచించారు.

1956లో ఐక్య కర్నాటక రాష్ట్రం ఏర్పడింది. రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ రిపోర్టు సిఫారసుల పైన మద్రాసు నుండి కూర్గు, బళ్ళారి, దక్షిణ కెనరా, బొంబాయి నుండి ఉత్తర కెనరా, బెల్గాం, బీజాపూర్, ధార్వాడ్ జిల్లాలు హైదరాబాద్ రాష్ట్రం నుండి బీదర్, గుల్బర్గా, రాయచూరు జిల్లాలు పూర్వపు మైసూరు రాష్ట్రంలో కలసి పోయాయి. 1973 నవంబర్, 1వ తేదిన మైసూరు రాష్ట్రం కర్నాటక రాష్ట్రంగా పేరు మార్చుకుంది.

## మహారాష్ట్ర చరిత్ర

మధ్య పరిగణాలలో (ఈనాటి మధ్య ప్రదేశ్) మరాటీ భాష మాట్లాడే ప్రజలు రాష్ట్రంలో హిందీ మాట్లాడే ప్రజల పెత్తందారీ కింద తా ముండజాలమని, 1905 నుండే తమ కొక ప్రత్యేకరాష్ట్రం కావాలని కోరడం మొదలు పెట్టారు. రాజకీయాలలోనే గాక ఉద్యోగాలలోను అభివృద్ధి పథకాల కేటాయింపు

లోను తమ ప్రాంతానికి న్యాయం జరగడం లేదని అడపాదడపా ఆందోళనలు లేవదీస్తుండేవారు. ప్రత్తి ఉత్పత్తి చేసే తమ సౌభాగ్యవంతమైన ప్రాంతానికి జరుగుతున్న అన్యాయాల గురించి కేంద్ర ప్రభుత్వ దృష్టికి కూడా చాలా సార్లు తెచ్చారు. మధ్య పరగణాలలోని మరాటీ మాట్లాడే జిల్లాలను విడదీసి వాటిని బీరారుతో కలిపి ఒక ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు చేయాలని మాంటెగ్- చెమ్స్ - ఫర్డు నివేదికలో పేర్కొనబడింది. వీటి ఆధారంగా 1921 లోనే అఖిల భారత కాంగ్రెసు కమిటీ యీ ప్రాంతాన్ని ఒక ప్రత్యేక యూనిట్‌గా పేర్కొని, ప్రత్యేక ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ నేర్పరచింది.

మరాటీభాష మాట్లాడే అన్ని ప్రాంతాలను ఒకచోట కలిపి వాటి కొక ప్రత్యేక రాష్ట్రం ఏర్పడాలన్న అభిప్రాయం 1940లో పూనాలో జరిగిన ఐక్య మహారాష్ట్ర నాయకుల సమావేశంలో వెల్లడైంది. ఇది జరిగిన ఆరుమాసాలకు అఖిలభారత కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శి శ్రీ శంకర్‌రావ్‌దేవ్ దీన్ని ఒక ప్రజా ఉద్యమంగా నడిపారు. కానీ విదర్భ ప్రాంతంనుండి దీనికి స్థిర వ్యతిరేకత ఉంది. బహుశా పూనా, నాగ్‌పూర్‌ల మధ్యగల చారిత్రక వైరాలు దీనికి ప్రముఖ పాత్ర వహించాలి. మహారాష్ట్ర, మహా విదర్భ నాయకులమధ్య 1947 ఆగష్టు ఒకటిన ఆకోలాలో ఒక సామరస్య ఒడంబడిక కుదిరి మహావిదర్భకు ఉపరాష్ట్ర ప్రతిపత్తి ఇవ్వటానికి అంగీకారం కుదిరింది. భాషారాష్ట్రాల నిర్మాణానికి భారత ప్రభుత్వం వెంటనే అంగీకరించక పోవటం వలన యీ ఉద్యమం కొంతకాలం చల్లపడిపోయింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడగానే 1953 సెప్టెంబరు 28న వివిధ ప్రాంతాల మహారాష్ట్ర నాయకులతో నాగ్‌పూర్‌లో మరొక సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ప్రత్యేక మహారాష్ట్ర తక్షణం ఏర్పడాలని తీర్మానించబడింది. ఈ ఒడంబడిక ప్రకారం సంయుక్త మహారాష్ట్రలో మహారాష్ట్ర, మహావిదర్భ, మరట్వాడా అనబడే మూడు విభాగాలుంటాయి. ఇది ఇలా ఉండగా రాష్ట్ర పునర్ వ్యవస్థీకరణ సంఘం బొంబాయి రాజధానీగా గుజరాతీ, మరాటీ మాట్లాడే అన్ని ప్రాంతాలతో ద్విభాషారాష్ట్రం ఏర్పరచి, మహావిదర్భకు మాత్రం ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తి ఇవ్వాలని సిఫారసు చేసింది. ఈ సంఘం సమర్పించిన నివేదికను చర్చించిన అఖిలభారత కాంగ్రెసు కమిటీ 1955 నవంబరు 1న మహా రాష్ట్ర మూడు రాష్ట్రాలుగా ఏర్పడాలని సూచించింది.

1. బొంబాయి రాష్ట్రంలోని మరాటీ మాట్లాడే జిల్లాలు, హైదరాబాద్ రాష్ట్రంలోని మరట్వాడా ప్రాంతం, మధ్యప్రదేశ్‌లోని విదర్భ విభాగంతో సంయుక్త మహారాష్ట్ర ఏర్పడుతుంది. బొంబాయి నగరం యీ రాష్ట్రపరిధిలో ఉండదు.

2. బొంబాయి రాష్ట్రంలోని గుజరాతీ మాట్లాడే జిల్లాలు, సౌరాష్ట్ర మరియు కచ్ విభాగాలతో గుజరాత్ రాష్ట్రం ఏర్పడుతుంది. బొంబాయి నగరం గుజరాత్‌కు కూడా లభించదు.

3. బొంబాయి ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ పరిధిలో ప్రత్యేక బొంబాయి రాష్ట్రం ఏర్పడుతుంది.

కానీ సంయుక్త మహారాష్ట్ర ప్రజలు తమకు బొంబాయి నగరం లభించాలని పట్టుబట్టారు. 190 మంది పార్లమెంటు సభ్యులు ప్రధాని నెహ్రూపై వొత్తిడి తెచ్చారు. చివరకు బొంబాయి రాజధానిగా మహారాష్ట్ర గుజరాత్‌లతో 1956 నవంబరు 1న బొంబాయి ద్విభాషా రాష్ట్రం ఏర్పడింది. కానీ ఈ ద్విభాషారాష్ట్రం ముణ్ణాళ్ళ ముచ్చటే అయింది. 1960 లో ఇది విడిపోయి గుజరాత్, మహారాష్ట్ర రెండు ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పడ్డాయి. బొంబాయి నగరాన్ని మహారాష్ట్ర దక్కించుకుంది.

## ఫజల్ అలీ కమీషన్

అనేక ప్రజావొత్తిడులకు లోనైన కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు ఫజల్ అలీ కమీషన్ నియమించింది. ఈ సంఘం 1954లో హైదరాబాద్ రాష్ట్ర పర్యటన కొచ్చింది. వివిధ రాజకీయపార్టీలు, ప్రముఖులు యీ సంఘం ఎదుట తమ వాఙ్మూలాలిచ్చారు. హైదరాబాద్ రాష్ట్ర విభజనకు వ్యతిరేకించిన వారి సంఖ్య చాలా స్వల్పమని యీ సంఘం వెల్లడించింది. జంటనగరాల జనాభాలో 45 శాతం వరకున్న ముస్లింలు హైదరాబాద్ విశాలాంధ్రకు గానీ ప్రత్యేక తెలంగాణా రాష్ట్రానికి గానీ రాజధానీ నగరమైతే తమ కులం ఆర్థిక, సాంఘిక రంగాలలో దెబ్బతినిపోతుందని వాదించారు. హైదరాబాద్ రాష్ట్ర విభజన అనివార్యమని యీ సంఘం ప్రకటించిన నివేదిక గమనార్హమైనది.

"అత్యధిక సంఖ్యలో ప్రజలు రాష్ట్రవిభజన కోరుతున్నారు. తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంగా ఉండాలని, విశాలాంధ్ర కావాలని కోరుతున్న కాంగ్రెసులోని

రెండువర్గాలు కూడా రాష్ట్ర విభజనకు సుముఖంగానే ఉన్నవి. హైదరాబాద్ రాష్ట్రాన్ని యథాతథంగా ఉంచితే ప్రజాభిప్రాయాన్ని తృణీకరించినట్లే అవుతుంది. తెలంగాణా గురించి భిన్నాభిప్రాయాలను వ్యక్తం చేసిన రాజకీయ పార్టీలన్నీ రాష్ట్ర విభజన విషయం వస్తే ఏకీభవించి ఉన్నాయి. మరట్వాడాలో ఒక్కరైనా దీనికి వ్యతిరేకులు కారు. బహుశా చారిత్రక కారణాలు మహారాష్ట్రల ఏకీకరణను కోరుతున్నవి. ప్రజాభిప్రాయం రాష్ట్రాన్ని విభజించటానికే అనుకూలంగా ఉంది. హైదరాబాద్ రాష్ట్రాన్ని యథాతథంగా ఉంచాలని వాదించిన వారి సంఖ్య లెక్కకు తీసుకొనవలసినది కాదు."

ప్రత్యేక తెలంగాణా పోరాట చరిత్ర తెలిపే తెలంగాణా పోరాటం అనే పుస్తకంలో యిలా పేర్కొనబడింది. "కన్నడ, మహారాష్ట్ర, తెలుగు భాషల ప్రాంతంతో కలిసి ఉన్న హైదరాబాద్ రాష్ట్రం విభజించబడి, మహారాష్ట్ర ప్రాంతం బొంబాయిలోను, కన్నడ ప్రాంతం మైసూరులోను కలవాలని రాష్ట్ర కాంగ్రెసులో ఉన్న రెండువర్గాలు ఆనాడు అంగీకరించాయి. అయితే తెలంగాణా గురించి వీరిలో మతాల ప్రాతిపదికపై అభిప్రాయ భేధాలేర్పడ్డాయి. ఆనాడు ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగ ఉన్న స్వామీ రామానందతీర్థ, వినాయకరావు విద్యాలంకార్ అనే మరొకరిని వెంట వేసుకొని తెలంగాణా ఆంధ్రరాష్ట్రంలో కలవాలని ఆంధ్ర నాయకులకు వంతపాట పాడారు."

## విశాలాంధ్రకు అనుకూలం

స్టేటు కాంగ్రెసులోని స్వామీజీ, బూర్గులవారి పక్షాలు విశాలాంధ్రను బలపరచినవి. ఆదిలో తెలంగాణాకు మద్దతు యిస్తానన్న బూర్గుల ఢిల్లీకి పోయివచ్చి మారిపోయారని రంగారెడ్డి వర్గం వారి వాదన. దీనికి చాలావరకు గోవిందవల్లభ్ పంత్ కారకుడంటారు. ఎవరి ప్రచారాలు వారు చేసుకున్నారు. ఐదేళ్ళ వరకు తెలంగాణాను ప్రత్యేక రాష్ట్రంగా ఉంచితే యీ అయిదేళ్ళు నిత్య తెలంగాణా, విశాలాంధ్ర పోరాటాలతోనే సరిపోతుందని దూరాలోచనతో వాదించి అసెంబ్లీలో తన వాదనను ముఖ్యమంత్రి నెగ్గించుకొన్నారు. ఇరుప్రాంతాల నాయకుల 'పెద్ద మనుషుల ఒప్పందం'తో తెలంగాణా ప్రాంతం ఆంధ్రరాష్ట్రంలో కలిసిపోయింది. ఇక్కడ ఒక్క విచిత్రమైన సంగతి జరిగింది. ఆదినుండి భాషారాష్ట్ర వాదనకు పట్టుకొమ్మగా ఉన్న స్వామీజీకి గానీ, అతి కీలక సమయంలో విశాలాంధ్రను

బలపరిచిన బూర్గులవారికిగానీ రాష్ట్ర రాజకీయాలలో స్థానమే లభించలేదు. స్వామీజీ ఔరంగాబాద్ నుండి లోక్‌సభకు పోటీచేయగా బూర్గులవారు కేరళ గవర్నరై రాష్ట్రం విడిచిపెట్టి పోయారు. హైదరాబాద్ రాష్ట్రం విచ్ఛిన్నంతో నిజాం నవాబు రాజ్ ప్రముఖ్ పదవి రద్దయిపోయింది.

———

*హైదరాబాద్ రాష్ట్రంనుంచి ఎన్నికైన పార్లమెంటు సభ్యులపేర్లు :

**లోక్‌సభ స్థానాలు (25)**

1. హన్మంతరావు గణేశరావు, 2. సురేష్‌చంద్ర శివప్రసాద్ ఆర్య, 3. షాకతుల్లా అన్సారి, 4. స్వామీ రామానంద తీర్థ, 5. అహమద్ మొహియుద్దీన్, 6. సాదత్ అలీఖాన్, 7. జనార్ధనరెడ్డి, 8. పి. రామస్వామి, 9. శంకర్‌రావు శ్రీనివాసరావు, 10. డి. నామదేవరావు, 11. హరిశ్చంద్ర హెడా, 12. దివాన్ రాఘవేంద్రరావు, 13. డా॥ ఎస్. ఎ. ఎబనీజర్, 14. కృష్ణమాచార్య జోషి (కాంగ్రెస్) 15. ఆర్. రప జపే, 16. బద్దం ఎల్లారెడ్డి, 17. డా॥జయసూర్య, 18. రావి నారాయణరెడ్డి, 19. సుంకం అచ్చాలు, 20. టి. బి. విఠల్‌రావు, 21. పెండ్యాల రాఘవరావు (పి. డి. ఎఫ్.), 22. సి. మాధవరావు (సోషలిష్టు) 23. నారాయణరావు వాఘ్మారే (పీజంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ) 24. శివమూర్తిస్వామి (ఇండిపెండెంటు) 25. ఎం. ఆర్. కృష్ణ (షెడ్యూల్డ్ కాస్ట్స ఫెడరేషన్)

**రాజ్యసభ స్థానాలు (11) :**

1. కె. నారాయణప్ప. 2. ఎస్. చెన్నారెడ్డి, 3. డి.డి. ఇటాలియా, 4. ఉశ్మాన్ సుభానీ, 5. పూరన్‌మల్ సూరజ్‌మల్ లాహోటీ, 6. డా॥ రాజ్ బహాదుర్ గౌడ్, 7. ఎ.కె. ధగే, 8. కె.వి. నరసింగరావు, 9. కిషన్‌చంద్, 10. జె. హెచ్. సుబ్బయ్య, 11. బి. ఎస్. వెంకటరావు.

హైదరాబాద్ రాష్ట్రంలోని జిల్లాలు :

వరంగల్, ఖమ్మం, ఆదిలాబాద్, కరీంనగర్, నల్గొండ, మెదక్, హైదరాబాద్. మహబూబ్‌నగర్, (తెలంగాణా ప్రాంతం) ఔరంగాబాద్, బీడ్, పర్భనీ, నాందేడ్, ఉశ్మానాబాద్ (మరట్వాడా) రాయచూర్, గుల్బర్గా, బీదర్ (కర్ణాటక)

———

# భారతీయ లౌకిక సిద్ధాంతం :
# హైదరాబాద్ ప్రముఖులు

మతమన్నది గాంధీ జీవితమైతే
మతమన్నది లోకానికి హితమైతే
హిందువులం ముస్లిములం
అందరమూ సోదరులం
అందరమూ సోదరులం

—కృష్ణశాస్త్రి.

హైదరాబాద్‌ను పంచవేణీ సంగమంగా వర్ణించారు హైదరాబాద్ సంస్కృతికి ప్రతీకగా నిలిచిన డా॥ బూర్గుల రామకృష్ణారావు. త్రివేణీ సంగమాని కన్న యీ పంచవేణి సంగమం భారత లౌకిక విధానానికి అనేక సందర్భాలలో గర్వకారణంగా నిలిచింది. తెలుగు ప్రధానభాషైన యీ నగరంలో మరాఠీ, కన్నడం, హిందీ ఉర్దు భాషలతో యీ పంచవేణీ సంగమం ఏర్పడింది. ఈ భాషలు తమ ప్రత్యేకతలను కాపాడుకుంటూనే భిన్నత్వంలో ఏకత్వాన్ని ప్రదర్శి స్తున్నాయి. ఈ సీమలో జరిగిన అనేక ప్రజా సంఘటనలలో హిందూ ముస్లిం ప్రజల పాత్ర సమానంగా కన్పిస్తుంది.

## బ్రిటిషువారితో పోరాడిన వీరులు :

1830లో బ్రిటిషువారితో మహారాష్ట్రులకు జరిగిన యుద్ధంలో ఇంగ్లీషు వారికి సహాయపడవలసిందిగా నిజాం నవాబు బీరారు గవర్నరైన మహిపత్ రాయ్‌ను ఆదేశించాడు. అతడందుకు సమ్మతించనందున నిజాం ప్రధాని మీర్ ఆలమ్ రెసిడెంట్ సలహాపై అతడిని పదవినుండి తొలగించాడు. పదచ్యుతి పొందిన మహిపత్‌రాయ్ షోలాపూర్‌లో తిరుగుబాటు లేవదీయగా బ్రిటిషు సైనికులు దాన్ని అణచివేసారు. ఈ ఓటమితో మహిపత్‌రాయ్ స్వరాష్ట్రం విడచిపోవలసి

వచ్చింది. హోల్కార్‌ని ఆశ్రయించటానికి వెళుతుండగా మార్గమధ్యంలో అతడు అతి దీనావస్థలో మరణించాడు. రాష్ట్రంలో ఇంగ్లీషువారిని ప్రతిఘటించిన తొలి వీరుడు మహిపత్ రాయ్.

1808లో నూరుల్ ఉమ్రా, రావ్, రంభానింబాల్కర్ అనబడే ఇద్దరు జాగీర్దార్లు బొలారంలోని బ్రిటిషుసైన్యాన్ని తమవైపుకు తిప్పుకొనటానికి ప్రయత్నించగా హైదరాబాద్ ప్రభుత్వం వారిని శిక్షించింది. జాగీరు గ్రామాల నుండి బైటకు రాకుండా వాళ్ళమీద నిషేధాజ్ఞలను జారీచేసింది.

1817లో మూడవ మహారాష్ట్ర యుద్ధంలో బ్రిటిషువారికి సహాయంగా పంపిన నిజాం సైన్యంలో కొందరు రొహిల్లాలు మహారాష్ట్రులకు వ్యతిరేకంగా పోరాడటానికి నికరిరాంచారు. వారందరిని నిజాం ప్రభుత్వం ఉద్యోగాలనుండి తొలగించింది. ఉద్యోగాలు పోగుట్టుకొన్న రొహిల్లా సైనికులకు ఖాన్‌ఖోటే జాహి అనేవాడు నాయకత్వం వహించి పూనాలో పీష్వాలతో కలిసిపోయి ఇంగ్లీషువారితో పోరాడి మరణించాడు.

బ్రిటిషువారికి తొత్తుగా నిలిచిన నాల్గవ నిజాం నవాబు నాసిరుద్దౌలాను సింహాసనం నుండి దింపివేసి అతని సోదరుడైన ముబారిజుద్దౌలాకు రాజ్యం అప్పగించటానికి హైదరాబాద్‌లో 1839లో మరొక విప్లవం బయలుదేరింది. ఈ సందర్భంలో కర్నూలు నవాబు ఒక లక్ష రూపాయల ఆయుధసామగ్రిని సేకరించిపెట్టాడు. కానీ యీ రహస్యం బయటపడి ముబారిజుద్దౌలా అతని అనుయాయులు బంధించబడ్డారు. ఓడిపోయిన కర్నూలు నవాబును మద్రాసుకు తరలిస్తుండగా తోవలో అతడ్ని ఎవరో చంపివేసారు. ఈ ఉద్యమానికి నాయకత్వం వహించిన మౌల్వీసలీమ్‌కు 18 ఏళ్ళు కారాగారశిక్ష పడింది. రాజబంధువైనందుకు ముబారిజుద్దౌలాను గోలకొండ కోటలో ఆమరణాంతం బంధించి ఉంచారు. ఇతడు 1854లో మరణించాడు.

## 1857 విప్లవం

1857లో బ్రిటిషువారికి వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటు వారి అధికారాన్ని ఎక్కడికక్కడే కూల్చివేసే విధంగా నడిచింది. ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి దావానలంలా వ్యాపించిన యీ ఉద్యమం బ్రిటిషువారిని భయభ్రాంతుల్ని చేసింది. మధ్యభారత్‌లో ప్రజ్వరిల్లిన యీ జ్వాల దక్కను

చేరటానికి ఎక్కువ సమయం తీసుకోలేదు.

నాల్గవ నిజాం నాసిరుద్దౌలా 1857లో మరణించాడు. అతడు మరణ శయ్యపై ఉన్నప్పుడు తన ప్రధాని సాలార్జంగ్‌ని పిలిపించి బ్రిటిషుసామ్రాజ్యంతో తాను కుదుర్చుకున్న సంబంధాలన్నింటినీ తన కుమారుడు అఫ్జలద్దౌలా కాలంలో కూడా కొనసాగించవలసిందని కోరాడు. అఫ్జలద్దౌలా పట్టాభిషేక మహోత్సవంలో పాల్గొని ఇంటికి చేరుకోగానే రెసిడెంట్ ఒక తంతిని అందు కొన్నాడు. ఢిల్లీ విప్లవకారుల హస్తగత మైపోయిన వార్త యీ తంతిద్వారా రెసిడెంటుకు తెలియపరచబడింది. వెంటనే రెసిడెంటు సాలార్జంగ్‌ను పిలిపించి యీ రహస్యవార్త అతని చెవిలో వేసాడు. ఇది రహస్యవార్త కాదని నాల్గు రోజుల నుండే యిలాంటి వార్తలు హైదరాబాద్‌లో వ్యాపించిపోయాయని సాలార్జంగ్ చెప్పగా రెసిడెంటు ఆశ్చర్యపోయాడు.

హైదరాబాద్‌లోని వాతావరణం కూడా బ్రిటిషువారికి అనుకూలంగా లేదు. ఔరంగాబాద్ విప్లవకారులలో కొందరు ప్రాణభీతితో హైదరాబాద్‌కు తల దాచుకొనటానికి రాగా సాలార్జంగువారిని బంధించి రెసిడెంటుకు కానుకగా సమర్పించాడు. ఈ సిగ్గుమాలిన చర్యతో సాలార్జంగుపై ఇక్కడి ప్రజలకు విపరీతమైన హేయభావం కలిగింది. ఒక ప్రతినిధివర్గం నిజాంని కలుసుకొని విప్లవకారుల విడుదల కోరింది. వారి ప్రయత్నం ఫలించనందున నిజాంకు, సాలార్జంగుకు బెదిరింపులతో కూడిన లేఖలందాయి. దానిపై ప్రభుత్వం విప్లవ కారులపై కఠిన నిబంధనలు విధించింది. బ్రిటిషు వ్యతిరేక చర్యలు జరిపే వారిని చూడగానే ఎక్కడి కక్కడే కాల్చివేయ వలసిందని సాలార్జంగు అతిక్రూరులైన రోహిల్లా దళాని కాజ్ఞాపించాడు. వీరు నగరంలో బారులు తీర్చి, కవాతులు జరుపుతూ ప్రజల్లో భయాన్ని సృష్టించారు.

సాలార్జంగు ఎన్ని జాగ్రత్తచర్యలు తీసుకొన్నా విప్లవం చల్లారలేదు. తుర్రేబాజ్‌ఖాన్, అల్లాఉద్దీన్ అనబడే ఇద్దరు రోహిల్లా వీరుల నాయకత్వంలో 500 మంది ప్రజలు జులై 17వ తేదీన రెసిడెన్సీ భవనంపై విరుచుకబడ్డారు. రెసిడెన్సీ ఎదుటగల ఒక భవనం విప్లవకారుల హస్తగతమైంది. ఒక రోజల్లా జరిగిన యీ పోరాటంలో బ్రిటిషువారు తుదకు విప్లవకారులను చెదరగొట్ట కలిగారు. ఈ పోరాటంనుంచి తప్పుకొనిపోతుండగా తుర్రేబాజ్‌ఖాన్ కాల్చి

చంపివేయబడ్డాడు. అల్లాఉద్దీన్‌ను బంధించి అండమాన్ దీవులకు పంపారు. 1857 లో రెసిడెంట్ డేవిడ్సన్ సాలార్జంగుతో కలిసి నిజాం దగ్గరికి పోతుండగా జహాంగీర్‌ఖాన్ అనబడే ఒక విప్లవవీరుడు రెసిడెంటుపై దాడిసల్పాడు. సాలార్జంగు అంగరక్షకులు సకాలంలో అడ్డు రాకపోతే రెసిడెంటు అప్పటికప్పుడే హతమై పోయేవాడు. పట్టుబడ్డ జహాంగీర్ ఖాన్ ఎన్ని చిత్రవధలకైనా సమ్మతించాడు కానీ విప్లవకారుల జాడ తెలుపలేదు. చివరకు ఆంగ్లేయులు అతన్ని ఉరి కంబ మెక్కించారు.

## బీరారు కైవసం

1920లో వైస్రాయి కర్జన్ ప్రభువు హైదరాబాద్ పర్యటించాడు. నవంబరు 5వ తేదీన నిజాం నుండి బీరారును ఇంగ్లీషువారికి శాశ్వతంగా దఖలు పరుస్తున్నట్లు సనదు వ్రాయించుకొన్నాడు. ఈ చర్య ప్రజలకు బ్రిటిషువారిపై కోపాన్ని కలిగించింది. బ్రిటిషు ఇండియాలో స్వదేశీ ఉద్యమం వ్యాపించినప్పుడు ఇక్కడి ప్రజలు హర్షించారు. 1906–1907లో ఎన్నో సభలు, సమావేశాలు జరిగాయి. స్వదేశీ ఉద్యమాన్ని నడిపించవలసిందని, విదేశీ వస్త్రాలను బహిష్కరించవలసిందని ప్రజలు ఉద్బోధింపబడ్డారు. స్వదేశీ ఉద్యమాన్ని బహుళ ప్రచారం చేయటానికి ఆర్యసమాజ్, గణేశ్ ఉత్సవాలు తోడ్పడ్డాయి.

## విప్లవ వీరులకు పుట్టిల్లు

ఈ సందర్భంలో గొప్ప సంస్కృత పండితుడైన శ్రీ పాద దామోదర్ సాత్వెల్కర్ వ్రాసిన విషయాన్ని పేర్కొనటం అప్రస్తుతంకాదు. ఆయన హైదరాబాద్‌లో 1901 నుండి 1908 వరకుండి పోయాడు. హైదరాబాద్ స్వాతంత్రోద్యమం అనే గ్రంథంలోని 7వ సంపుటిలో ఆతడు యిలా పేర్కొన్నాడు. "నాసిక్‌లో కలెక్టరు జాన్సన్ పై ఎవరో బాంబు విసిరారు. దీనికంతా కారణం హైదరాబాదునుండి నాసిక్ వచ్చిన ఒక యువకుడు.అతడు సుమారు 60 మంది యువకులకు విప్లవ భావాలు నూరిపోసాడు. వారిలో ఒకడు కలెక్టరుపై తుపాకీ పేల్చాడు. హైదరాబాద్ నుండి వచ్చిన యీ యువకు డెవరో నాకు బాగా తెలుసు." ఈ విధంగా నాసిక్ విప్లవకారులకు హైదరాబాద్‌తో సంబంధం ఏర్పడింది. నిజాం రాష్ట్రం విప్లవ కారులకు పుట్టిల్లు. ఇటలీ మున్నగు దేశాల నుండి ఆయుధాలు రాసాగాయి. అతి చాకచక్యంతో వాటి నిక్కడికి తెచ్చేవారు.

బ్రెన్‌గన్ ఫ్యాక్టరీకి హైదరాబాద్ స్థావరమన్న విషయంచాలా మందికి తెలియదు.

ప్రజల్లో రాజకీయ చైతన్యం కలిగించటానికి 1918లో హైదరాబాద్‌లో సంస్కరణ సంస్థ వెలిసింది. దీనికి పండిత కేశవరావు కొరాట్కర్ అధ్యక్షుడు. దేశంలో ముమ్మరంగా సాగుతున్న కాంగ్రెస్ ఉద్యమ ప్రభావం హైదరాబాద్ మీద కూడా పడింది. 1918లో ప్రచురించబడ్డ మాంటెంగ్–చెమ్సుఫర్డు నివేదిక తీవ్ర విమర్శకు గురైంది. ఆకాలంలో కాంగ్రెస్ వ్యక్తి ముల్లా అబ్దుల్ ఖయ్యూం, జర్నలిస్టు మొహిబ్‌సేన్, విద్యావేత్త డా॥ అఘోరనాథ చట్టోపాధ్యాయ, విప్లవ వీరుడు పండిత తారానాథ్, బ్యారిష్టర్ శ్రీకిషన్ మున్నగు మేటి నాయకులు ప్రజల్లో నవచైతన్యం కలిగించారు.

హైదరాదాద్‌లో కామ్రేడ్ అసోసియేషన్ (తర్వాత కమ్యూనిస్టు పార్టీ) స్థాపనలో ముందంజ వేసింది ముస్లిం యువకులే. ఆలం ఖుంద్ మీరీ, సయ్యద్ ఇబ్రహీం, గులాంహైదర్, జవ్వాద్‌రజ్వీ, అహసన్ అలీ మిర్జా మొదలైన యువ కులకు కామ్రేడ్ మఖ్దూం మొహియుద్దీన్ నాయకుడుగా ఉండేవాడు.

## మతసామరస్యం — ఉదారభావం

అప్పటి పరిస్థితులు ఎలాఉన్నా హిందూ–ముస్లిం వర్గాల మధ్య స్పర్ధలు, కక్షలు లేవు. మతవిద్వేషాలు లేకుండా సుహృద్భావంతో ప్రజలంతా కలసిమెలసి జీవించేవారు. ఉన్నత వర్గాల ప్రజలు రాజకీయాలకెంత దూరంగా ఉండేవారో మతవర్గాలనుండి అంతదూరంగా ఉండేవారు.వీరు ఇత్తెహాదుల్–ముస్లిమీన్‌కు వార్షిక చందాలు చెల్లించడం లేదని *బహాదర్ యార్ జంగ్ (అప్పటి ఇత్తెహాద్ అధ్యక్షుడు) వాపోతుండేవాడు. పాయిగా నవాబైన ఖుర్షీద్‌జా వసంతపంచమి రోజు తన హిందూ మిత్రులకు గొప్ప విందు చేసి, విందు అనంతరం అనేక దానాలు చేసేవాడు. నవాబ్ ఆశ్మాన్‌జా వసంతోత్సవంలో పాల్గొని రంగుల దుస్తుల ధరించి మిఠాయిపేర్లను మెడలో వేసుకొనేవాడు. నవాబు సాలార్జంగ్ తనపై రంగులు చిమ్మించుకొనేవాడు.

ఆరవ నిజాం నవాబు మీర్ మహబూబ్ ఆలీఖాన్ పరిపాలన ఎంతో ప్రజానురంజకంగా సాగింది. ఆయనకు మత వివక్షణ ఏ మాత్రం లేదు. దాన కర్ణుడని పేరు తెచ్చుకున్నాడు.ఒకసారి రాజప్రసాదంలో లక్ష రూపాయల చోరీ జరిగింది.

దొంగిలించిన నౌఖరు పట్టుబట్టాడు. నవాబుకు పంపే రోజువారీ రిపోర్టులలో యీ విషయాన్ని నగర కొత్వాల్ అఫ్సర్ జంగ్ తెలియపరిచాడు. మరుసటి రోజు నగలతో సహా దొంగను తన ఎదుట ప్రవేశపెట్ట వలసిందిగా నవాబుగారి ఆజ్ఞ అయింది. నగలను పరికించి చూచి, 'అరెరె! అనవసరంగా నీవు యీ శ్రమ తీసుకొన్నావు. ఈ నగలను నేనతనకి యీనాంగా ఇచ్చినవే. నాకు భయపడి యీ విషయం వెల్లడించక పోవచ్చును' అని సర్దిచెప్పి మహబూబ్ ఆలీఖాన్ బహదూర్ ఆ నౌఖరు ప్రాణం కాపాడినాడు.

ఇద్దరు నవాబుల కాలంలో ప్రధానిగా పనిచేసిన మహారాజా సర్ కిషన్ ప్రసాద్ బహదుర్ దాతృత్వం జగత్ ప్రసిద్ధి చెందినది. తన మందిరం నుండి బయటకు వచ్చారంటే దారి పొడవునా రూపాయలు వెదజల్లవలసిందే. ఇంకా ఆయన నమ్రతా భావం చెప్పవలసి వచ్చినా అంతే. తాను వ్రాసే ఉత్తరాలపై ఫకీరు కిషన్ ప్రసాద్ అని సంతకం చేసేవాడు. మహాత్మాగాంధీ–మహారాజా బహద్దురుల మధ్య సత్సంబంధాలు నెలకొని ఉన్నట్టు యీ లేఖ విశదపరుస్తుంది.

### మహారాజాకు మహాత్ముడు వ్రాసిన లేఖ

సత్యాగ్రహాశ్రమం,<br>
సబర్మతి: B. B. & C. I. Rly,<br>
తేదీ 7, జూన్ 1928.

ప్రియమైన మిత్రమా!

ఖాదీ ఉద్యమంలో మీరు శ్రద్ధ చూపుతున్నట్లు, స్వయంగా మీరు ఖాదీ వడుకుతున్నట్లు రూప్‌లాల్ ద్వారా తెలుసుకొని ఎంతో సంతోషించాను ఖాదీ ఉద్యమంలో మైసూరు సంస్థానం అగ్రగామిగా నిలిచిన సంగతిని మీ దృష్టికి తెస్తున్నాను. ఈ ఉద్యమాన్ని మీరు ఒక దీక్షగా నడిపిస్తే నిజాం రాష్ట్రంలోని బీద ప్రజానీకానికి మీరెంతో సేవ చేసిన వారవుతారు.

మీరు, మీ పెద్ద కుమారుడు వడికిన దారపు సాంపుల్సును నాకు పంపి చండి. ప్రదర్శనశాలలో వాటిని జాగ్రత్త పరుస్తాను.

—సం॥ ఎం. కె. గాంధీ

నవాబ్ మీర్ ఉశ్మాన్ అలీఖాన్, ఏడవ నిజాం రాష్ట్రంలో చక్కని పరి పాలనా యంత్రాంగాన్ని రూపొందించాడు. 'జాబితె–అక్లాక్ (సివిల్ కోడు) లోని రెండు ఫర్మానాలు పరిశీలిస్తే యీ విషయం వెల్లడవుతుంది.

1. "అధికారులు పర్యటనలు సల్పుతున్నప్పుడు నృత్య గాన వినోదాలతో కాలం గడుపుతున్నట్టు విశ్వసనీయ వర్గాల ద్వారా నాకు తెలిసింది. ఇది చాలా తీవ్రమైన విషయం. దీనివల్ల ప్రజలకు ప్రభుత్వ యంత్రాంగంపై విశ్వాసం తగ్గి పోయి భ్రష్టాచారం ఏర్పడుతుంది. అందువలన నేనొక హుకూం జారీ చేయక తప్పడం లేదు. ఏ అధికారి అయితే ఇలాంటి దుర్వ్యసనాలకు లోనవుతాడో అతని పట్ల ప్రభుత్వం కఠిన వైఖరి వహిస్తుంది." (1340 హిజ్రి, 16 జమాదుల్ అవ్వల్)

2. ఇకముందు అధికారులందరు విధిగా పాటించవలసిన ఒక తాఖీదు విడుదల చేస్తున్నాను. కోర్టులలో అధికార బాధ్యత నిర్వహిస్తున్నప్పుడు ఏ అధి కారి కూడా సిగరేటు త్రాగడం గానీ, బోడి నెత్తిన కానీ ఉండకూడదు. రూమీ టోపీ కానీ (ఫెజ్) హ్యాట్ గానీ ధరించకూడదు. అందరు విధిగా దస్తార్ పెట్టు కొని షేర్వాణీ ధరించి కార్యాలయాలకు రావాలి. వకీళ్ళ ఎడల, ప్రజల ఎడల మర్యాదగా ప్రవర్తించాలి." (1334 హిజ్రి, 17 షవ్వాల్).

## జాతీయ ముస్లింనాయకులు

హైదరాబాద్ లోని పలుకుబడి గల జాతీయ ముస్లిం నాయకులు కాంగ్రెసు సెక్యులర్ భావాలను ఆదరించే వారు. అలాంటి వారిలో అమీర్ హసన్, గులాం పంజతన్, అక్తర్ హుసేన్ కుటుంబాలు ముఖ్యమైనవి. వీరికి ఇత్తెహాదుల్ ముస్లి మీన్ రాజకీయాలు నచ్చేవి కావు, సిరాజుల్ హసన్ తిర్మిజి, బాకర్ ఆలీ మిర్జా పోలీసు చర్యకు పూర్వమే స్టేటు కాంగ్రెసులో ప్రముఖ పాత్ర వహించారు. మీర్ అహమద్ ఆలీ ఖాన్, బ్యారిష్టర్ అక్బర్ అలీఖాను ప్రముఖ జాతీయ నాయకులు 1940 లో జిన్నా మజ్లిస్‌లో చేరవలసిందని కోరినా, 1947 లో మజ్లిస్‌లో చేరితే రాష్ట్ర ప్రధాన మంత్రి పదవి లభిస్తుందని ఆశ చూపినా బ్యారిష్టర్ అక్బర్ అలీ ఖాన్ అందుకు తిరస్కరించారు. ఖాసిం రజ్వీ చర్యలను అదే పనిగా విమర్శించి 'ఇమ్రోజ్' పత్రికా సంపాదకుడు, యువకుడైన షోయిబుల్లా ఖాన్ హత్య

కాపించ బడ్డారు. అతి కష్టం మీద 'పయాం' పత్రికా సంపాదకుడు అక్తరు హుసేన్ ప్రాణాలతో బయట పడ గలిగాడు.

## పరిపాలనా రంగంలో

స్వాతంత్ర్య భారత దేశంలో హైదరాబాద్ జాతీయ ముస్లిం యువకులకు పరిపాలనా రంగంలో ప్రముఖ స్థానం లభించినది. భారత ప్రభుత్వంతో మంతనాలు జరపటానికి నిజాం నియమించిన ప్రతినిధి వర్గం నుంచి నవాబ్ జైన్ యార్ జంగ్ తప్పుకొన వలసిన పరిస్థితు లేర్పాడ్డాయి. నిజాం చేసే తప్పుడు పనులు చూడలేక ఆయన బొంబాయి వెళ్ళిపోయాడు. పోలీసు చర్య తర్వాత ఏర్పడిన మిలిటరీ, సివిల్ ప్రభుత్వాలలో ఆయన మంత్రిగా పనిచేసాడు. నిజాం ప్రభుత్వంలో మంత్రిగా పనిచేసిన నవాబ్ అలీ యావర్ జంగ్ లాయకలీతో సరి పడక మంత్రిపదవి నుంచి విరమించుకున్నాడు. ఒక దశాబ్దం పైగా వివిధ దేశాలలోఅయన భారత రాయబారిగా పనిచేసి గొప్ప దౌత్యవేత్తగా పేరు సంపాదించాడు. నిజాం సర్వీసులో ఉన్నతోద్యోగి గాను బూర్గుల రామకృష్ణా రావు, సంజీవరెడ్డి మంత్రి వర్గాలలో మంత్రిగాను పనిచేసిన నవాబ్ మెహదీ నవాజ్ జంగ్ గొప్ప సంఘ సేవకుడు. సంఘ సేవను ఆయన రాజకీయాలతో ముడి పెట్టలేదు. హైదరాబాద్ లోని కేన్సర్ ఆస్పత్రి ఆయన కృషి వల్ల ఏర్పడ్డదే నవాబ్ అలీ యావర్ జంగ్, నవాబ్ మెహదీ నవాజ్ జంగ్, బ్యారిష్టర్ అక్బర్ అలీఖాన్‌లు సమర్థులైన గవర్నర్లుగా రాణించారు. హైదరాబాద్ సివిల్ సర్వీసుకు చెందిన డాక్టర్ జహీర్ అహమద్ ఎనిమిది సంవత్సరాలు ఐక్యరాజ్య సమితి లోని వివిధ కార్యాలయాలలో ఉన్నతోద్యోగిగా పనిచేసి నోబుల్ బహుమాన గ్రహీత రాల్ఫ్ బంచ్ అభిమానానికి పాత్రుడైనాడు. ఈయన సౌదీ అరేబియాలో భారత రాయబారిగా కొంతకాలం పనిచేసాడు. నవాబ్ జైన్ యార్ జంగ్ కుమారుడు సాదత్ అలీఖాన్ విదేశాంగ శాఖలో కొంతకాలం ప్రధాని నెహ్రూకు పార్లమెంటరీ కార్యదర్శిగా ఉండి, తర్వాత టర్కీలో భారత రాయబారిగా పదవీ విరమణ జేసాడు.

దేశమంతటిలో మంత్రిత్వ గౌరవం పొందిన తొలి ముస్లిం మహిళ శ్రీమతి మాసూమా బేగం. ఈమె సంజీవయ్య మంత్రివర్గంలో సభ్యురాలు. నిజామత్ జంగ్, విశ్వకవి టాగూరు, సరోజినీ నాయుడుల అభిమానం పొందిన కవి

మాసూమా బేగం భర్త ప్రొఫెసర్ హుసేన్ అలీఖాన్ ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఆంగ్ల భాషాచార్యుడుగా ఉండి ఆ భాషకు విశిష్టమైన సేవ చేసినాడు. బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ఉన్న రోజులలో ఆయన రాష్ట్ర పబ్లిక్ సర్వీసు కమీషన్ సభ్యుడుగా పనిచేసాడు. అలీఘర్ ముస్లిం విశ్వ విద్యాలయం ప్రస్తుత వైస్ చాన్స్‌లర్‌గా పనిచేస్తున్న డాక్టర్ ఖుస్రూ గొప్ప ఆర్థిక శాస్త్రవేత్త. మనదేశంలో భూసంస్కరణల చట్టాలను రూపొందించడంలో ఆయన పాత్ర ప్రధానంగా ఉంది. మరో హైదరాబాద్ సుపుత్రుడు ప్రొఫెసర్ రషీదుద్దీన్ ఖాన్ రాజ్యసభ సభ్యుడు.

భారత లౌకిక విధానానికి హైదరాబాద్ ప్రముఖులు చేస్తున్న సేవ గొప్పది. కొందరనుకునే విధంగా హైదరాబాద్ సంస్కృతి మధు పాత్రకాదు. దాన్ని తిరిగి ఎన్నో ఉన్నత సాంప్రదాయాలు మనకగుపిస్తాయి.

—

*బహాదుర్ యార్ జంగ్ (1905–1944) మహావక్త. జవహర్‌లాల్ నెహ్రూ విశ్వకవి టాగూరు, సరోజినీనాయుడు, జిన్నా మున్నగు అగ్రనాయకులు ఇతని వాక్చాతుర్యానికి ముగ్ధులైన వారే.

1938 దసరా పండుగరోజున ధూల్‌పేట ప్రాంతంలో జరిగిన మత ఘర్షణలో బహాదుర్ యార్ జంగ్ ఇద్దరు మేనల్లుళ్ళు చనిపోయారు. నగరమంతా అట్టుడికినట్లు ఉడికిపోయింది. హిందువులను మూక ఉమ్మడి హత్య చేయడానికి రజాకార్లు కత్తులు, బల్లేలు ధరించి బహదూర్ యార్ జంగ్ మీద వొత్తిడితెస్తున్నారు.

ప్రధాని సర్ అక్బర్ హైదరీ, పోలీసుమంత్రి టస్కర్, పోలీసుకమీషనర్ రహమత్‌యార్ జంగ్ చేతులనుంచి పరిస్థితి దాటిపోయింది. బహాదుర్ యార్ జంగ్‌ని తన ప్రభుత్వాన్ని యీ కళంకంనుంచి కాపాడమని నిజాం కోరినాడు.

జరుగబోయే రక్తపాతాన్ని చూడలేకనో, లేదా తన బలప్రదర్శనకో వెంటనే బహాదుర్ యార్ బాల్కనీలోనుంచిని సాయుధులైన రజాకార్లనుద్దేశించుకుంటూ "ముస్లింలారా! నా ఆజ్ఞ లేనిది ఒక్క అడుగు ముందుకు వేయకండి. ఇస్లాం ప్రతీకారాన్ని కోరద'ని మహా ఉద్రేకంగా ఉపన్యసించినాడు. మంటలు కక్కుతున్న రజాకార్లు ఆ మంటల నార్పివేసుకుంటు వెళ్ళిపోయారు. ఆ రోజున హైదరాబాద్‌లో హిందువులు సురక్షితంగా ఉండకలిగారంటే అది బహాదుర్ యార్ జంగ్ విజ్ఞతానిర్ణయమే.

# ప్రజలమనిషి ప్రకాశం

"తప్పుపాటలు పాడబోకుము
తప్పు మాటలు చెప్పబోకుము
తప్పుకథలను జదువబోకుము
తప్పుదారులు ద్రొక్కబోకుము
పాత కథలను దెలిసి చదువుచు
పాటబాడుము, పరులు, మెచ్చగ
కల్లవ్రాతలు తొలగ బుచ్చుము
కల్లకథలను బులిమి పుచ్చుము.
తెలుగుబిడ్డా తెలుగు చరితను
నేటికైనను తెలిసికోరా!"

అని హెచ్చరించినాడు కవిరాజు రామస్వామి.

ఆంధ్రప్రాంతం బ్రిటిషు పరిపాలనలో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని ఒక భాగంగా ఉండేది. 1800 సం॥లో నిజాం నవాబు తన రాజ్యంలోని బళ్లారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలను ఈస్టిండియా కంపెనీ పరం చేసాడు. అందుకే అవి 'దత్తమండల'మైనది. 1911 లో చిత్తూరు జిల్లా ఏర్పడ్డప్పుడు ఈ ఐదు జిల్లాలను దత్తమండలంగా వ్యవహరిస్తు వచ్చారు. ఈ పేరు బాగుండలేదని డా॥ చిలుకూరి నారాయణరావుగారు 'రాయలసీమ' అని దీనికి నామకరణం చేశారు. ఆ పేరే స్థిరపడిపోయింది. సర్కారుజిల్లాలు కూడా ఒకప్పుడు నిజాం రాజ్యంలోనివే.

దక్కనులో అధికార ప్రాబల్యానికి బ్రిటిషువారూ, ఫ్రెంచివారు పోట్లాడు తున్నప్పుడు ఆ కీచులాటలో అన్ని విధాలా నష్టపడ్డది నిజామే. గెలిచినవారికెల్లా ప్రతిఫలాన్ని పొందకుండానే నిజాం వారు కోరినవి ముట్టజెప్పుకోవలసి వచ్చింది.

మచిలీపట్నం యుద్ధంలోనే నిజాం రాజ్యావిచ్ఛిత్తికి అంకురార్పణ జరిగిందని చెప్పడం తప్పుకాదు. ఆ యుద్ధంలో బ్రిటిషువారు ఫ్రెంచివారిని తుదముట్టించారు. అప్పటి హైదరాబాదు ప్రభువు సలాబత్‌జంగ్ తన సోదరుడు నిజాం అలీఖాన్ తన రాష్ట్రంలో తిరుగుబాటు లేవదీస్తాడని భయపడి గత్యంతరం లేక 1789 మే 14వ తేదీన బ్రిటిషువారితో ఒక ఒప్పందం చేసుకోవలసి వచ్చింది. నిజాం యీ ఒప్పందం కింద మచిలీపట్నంతో సహా ఎనిమిది సర్కారుజిల్లాలను బ్రిటిషువారికి యీనాంగా యిచ్చివేశాడు.

ఇంకా కొంత ప్రాచీన చరిత్రకు వెళ్ళితే ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా అంతా గోలకొండను రాజధానిగా చేసుకొని పాలించిన కుతుబ్‌షాహీ రాజులవే. మైసూరు దేశచరిత్ర పరిశోధకుడైన కర్నల్ మార్కువిల్క్సు ప్రకటించిన గ్రంథంలో తెలుగుభాష వ్యాప్తిలో ఉన్న దేశభాగాన్ని గురించి తెలంగాణా హద్దులగురించి వివరించాడు.

"కళింగమని పిలవబడే తెలింగభాష మహారాష్ట్రకు తూర్పున ఉత్తరాన చికాకోల్‌నుండి దక్షిణాన పులికాట్ వరకు వ్యాపించియున్నది. ఈ విశాలదేశం ఆంధ్ర, కళింగదేశాలుగా విభజించబడి ఉన్నవి. ఉత్తరాన గోదావరికి ఉన్న భాగాన్ని కళింగమని, దక్షిణభాగాన్ని ఆంధ్ర అని వ్యవహరింపబడుతున్నట్లు, మహమ్మదీయుల దండయాత్ర చేసేనాటికీ రెండుభాగాలు 'తెలంగాణా' అని వ్యవహరింపబడుతున్నట్లు దానియొక్క రాజధాని ఓరుగల్లు అయినట్లు తెలుస్తున్నది."

వరంగల్ రాజధానిగా ఉన్న తెలంగాణాను బహమనీ సుల్తానైన అహమద్ షా 1423 లో తనరాజ్యంలో కలుపుకొన్నాడు. ఈ బహమనీ రాజ్యం 1512లో బిరారు, అహమద్‌నగర్, బీజాపూరు, బీదరు, గోల్కొండ అనే ఐదు రాజ్యాలుగా విభజింపబడి వేరువేరు సుల్తాన్ల పరిపాలన క్రింద వచ్చినది. ఓరుగల్లు ప్రతాపరుద్రదేవ చక్రవర్తి పరిపాలించిన ప్రాంతమంతా దాదాపు గోలకొండ సుల్తాన్‌కు చేజిక్కింది. ఈ రాజ్యాన్ని స్థాపించిన కులీ కుతుబ్‌షా తన రాజధానిని ఓరుగల్లునుండి గోలకొండకు మార్చేసాడు. గోలకొండ రాజ్యం గోదావరి కృష్ణానదుల కిందిభాగం నుండి తూర్పున బంగాళాఖాతం సముద్రం వరకు,

పడమర బీజాపురాజ్యం సరిహద్దువరకు, ఉత్తరసరిహద్దులు పెన్‌గంగా వైన్‌గంగా నదులవరకు వ్యాపించి ఉన్నవి. 1589లో కుతుబ్‌షాహీ రాజులు తమ రాజధానిని భాగ్యనగరానికి తరలించారు. ఆ భాగ్యనగరమే మన హైదరాబాద్.

గోలకొండ రాజ్యంలో ఐదు సూబాలుండినవి. మొదటి సూబాలో మహమ్మదీనగర్, మెదక్, కౌలాస్, మలకన్నూరు జిల్లాలు:— రెండవ సూబాలో ఎల్గందల్ (ఈనాటి కరీంనగర్ జిల్లా) ఖమ్మంమెట్టు, దేవరకొండ జిల్లాలు— మూడవ సూబాలో పానుగల్లు, కొండపల్లి, భువనగిరి, అకర్కా జిల్లాలు— నాల్గవ సూబాలో కోయిలకొండ, ఘనపురం, గుంటూరు జిల్లాలు. ఐదవసూబాలో నిజాంపట్నం, ఏలూరు, రాజమండ్రి శ్రీకాకుళం జిల్లాలుండినవి. ఇంత చరిత్ర ఉన్నా ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు ప్రత్యేక రాష్ట్రాలు కావాలని వాదించేవారు చరిత్రతో సంబంధం పెట్టుకోరు. నిజాం నవాబును బలహీనపరచటానికి బ్రిటిషు వారు పన్నిన కుట్రను తెలుగుజాతి తొందరగా తెలుసుకోలేకపోయింది.

## శ్రీ బాగ్ ఒడంబడిక

1913 లోనే ఆంధ్రులు తమకు ప్రత్యేక రాష్ట్రం కావాలని తదాదిగా ఏటేటా ఆ ఉద్యమానికి బలమిచ్చే ఆంధ్రమహాసభలు జరుపుకున్నారు 1918లో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటి ఏర్పడింది. 1926లో ఆంధ్ర విశ్వ విద్యాలయం ఏర్పడగా రాయలసీమ వారు ఇది తమ కక్కరలేదని మద్రాసు విశ్వ విద్యాలయంలోనే ఉండిపోయారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడినప్పుడు తెలంగాణావారు కోరిన రక్షణలు కొత్తవి కావు. ఇలాంటి రక్షణలు రాయలసీమవారుకూడా కోరారు. ఇది 1937 నవంబరు 16వ తేదీన చేసుకొన్న శ్రీ బాగ్ ఒడంబడిక.

## ఆంధ్రులదే అగ్రతాంబూలం

మద్రాసు రాష్ట్రంలో ఉండగా అన్ని ప్రజా పోరాటాలలోను ఆంధ్రులదే అగ్రతాంబూలం. 1921 మార్చి 31, ఏప్రిల్ 1వ తేదీలలో బెజవాడలో కృష్ణా తీరంలో అఖిలభారత కాంగ్రెసు మహాసభలు జయప్రదంగా జరిగినవి. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు తమ రామదండుతో వచ్చి మహాసభ కార్యక్రమాలను క్రమశిక్షణతో కొనసాగించటానికి తోడ్పడ్డారు. మహాత్మాగాంధీ సహాయనిరాకర

ణోద్యమం ప్రారంభించక పూర్వమే ఆంధ్రరత్న చీరాల మహోద్యమం నడిపారు.

మహాత్ముడు ప్రవేశ పెట్టిన సహాయనిరాకరణ, శాసనోల్లంఘనల అనంతరం సభాప్రవేశ వాదులకు, బహిష్కరణ వాదులకు మధ్య తీవ్రచర్చలు జరిగినవి. గయా కాంగ్రెసులో దేశబంధు చిత్తరంజన్‌దాస్ కాంగ్రెసు అధ్యక్షపదవికి రాజీనామా చేయగా శాసనోల్లంఘన, నిర్మాణ కార్యక్రమం రెండింటియందు విశ్వాసం గల దేశభక్త కొండా వెంకటప్పయ్యను మధ్యే మార్గంగా కాంగ్రెసు అధ్యక్షునిగా ఎన్నుకోవడం జరిగింది. ఆంధ్రరత్న భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా ఎన్నికైనారు. అఖిలభారత కాంగ్రెసు కార్యాలయం ఆ రోజుల్లో బెజవాడకు తరిలింది.

## ఆంధ్రకేసరిగా మారిన ప్రకాశం

1928 లో సైమన్ కమీషన్ మద్రాసుకు వచ్చినపుడు తమిళ నాయకులు తప్పుకొన్నారు. నగరంలో హర్తాళ్ జరిగింది. కార్మికులు, విద్యార్థులు నిరసన ప్రదర్శనలు జరిపారు. పోలీసు కాల్పులలో ఒక కార్మికుడు మరణించగా శవాన్ని చూడటానికి వెళ్ళిన ప్రజలను పోలీసులు అడ్డుకున్నారు. ఆ అడ్డును ఛేదించుకొని ప్రకాశంగారు శవాన్ని సందర్శించటానికి ముందుకురికి 'కాల్చండ'ని రొమ్ము ఇచ్చారు. 'నేను ప్రకాశాన్ని' అని సింహగర్జన చేసారు. ఆంధ్రకేసరిగా ప్రకాశంగారు ప్రజల హృదయాలలో శాశ్వతస్థానం సంపాదించుకొన్నారు.

ఉప్పు సత్యాగ్రహంలో కూడా ఆంధ్రులదే ముందంజ. దేశోద్ధారక, మహర్షి బులుసు సాంబమూర్తి, వి ఎల్. శాస్త్రి, ఆంధ్రకేసరి, దుర్గాబాయమ్మ మున్నగువారు సత్యాగ్రహోద్యమంలో పాల్గొని జైలు శిక్షలనుభవించారు. కల్లూరి చంద్రమౌళి, వావిలాల గోపాలకృష్ణయ్య, మంథెన వెంకటరాజు, ఆచార్య రంగా మున్నగువారు ఉప్పు సత్యాగ్రహం నుండి ఉద్భవించిన నాయకులే.

## విశ్వదాత

ఇక్కడ కాశీనాథుని నాగేశ్వరరావుగారిని గురించి కొంత చెప్పాలి. ఆయన ఆంధ్రదేశానికి చేసిన సేవ అపారం. 1908లో ఆంధ్రపత్రికను స్థాపించి ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలని ప్రచారాలు చేయడం ప్రారంభించారు.

1920లో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 1923లో గుంటూరులో జరిగిన ఆంధ్ర రాష్ట్ర మహాసభకు అధ్యక్షత వహించి ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ద్విగుణీకృత ఉత్సాహంతో ప్రచారం చేసారు. 1924 లో దేశోద్ధారక బిరుదుపొంది ఉత్తమ సాహిత్య మాసపత్రిక 'భారతి'ని స్థాపించారు. రచయితలకు పారితోషికం యిచ్చే పద్ధతిని తెలుగు దేశంలో వారే ప్రవేశ పెట్టారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలోను, 1932 లో మరొక సారి శ్రీకృష్ణ జన్మ స్థానాన్ని అలంకరించారు. సెంట్రల్ అసెంబ్లీకి పంతులుగారు కృష్ణా – గోదావరి జిల్లాల నుండి పోటీ చేసినప్పుడు ఆయనకు లభించినన్ని ఓట్లు భారత దేశంలో మరెవరికి లభించలేదు. దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణుడు, కవిపోషకుడు, అజాతశత్రువు, హరిజన బంధువు నాగేశ్వరరావు గారు.

స్వాతంత్ర సమర యోధుల మొదటి వరసలో నుంచునే నాయక మణులలో ఆంధ్ర భీష్మ న్యాపతి సుబ్బారావుగా రొకరు. వకాలతు వృత్తికి స్వస్తి చెప్పి స్వతంత్ర సమరంలో దూకిన సుబ్బారావుగారు అంచెలంచెలుగా ఎదిగి కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి అయినారు. కేంద్ర శాసనసభ్యులుగా సర్ ఫిరోజ్‌షా మెహతా, గోఖలేలతో కలసి పనిచేశారు. ప్రభుత్వోద్యోగాలన్నీ శీఘ్రంగా భారతీయులతోనే భర్తీచేయాలని రాయల్ కమీషన్ ఎదుట వాదించారు విశాలాంధ్ర ఉద్యమానికి తోడ్పడిన మహానుభావుల్లో అయ్యదేవర కాళేశ్వరరావుగారి పాత్ర చిరస్మరణీయమైనది.

## ఆంధ్ర కేసరి తడాఖా

1937 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో జరిగిన ఎన్నికల్లో కాంగ్రెసు పార్టీ పాల్గొన్నది. ఆ రోజుల్లో ఆంధ్ర రాష్టకాంగ్రెసు సంఘానికి ప్రకాశం గారధ్యక్షులు. మహర్షి బులుసు సాంబమూర్తి కార్యదర్శి. వీరిద్దరూ దేశమంతా ప్రచారం చేసినారు. ఆంధ్రదేశంలోని అన్ని నియోజకవర్గాలలో కాంగ్రెసు తన అభ్యర్థులను నిలబెట్టింది.

కాంగ్రెసు మూడుపార్టీలతో ఆనాడు పోరాడవలసి వచ్చింది. నాటి ముఖ్యమంత్రి బొబ్బిలిరాజాగారి నాయకత్వంలోని జస్టిస్ పార్టీ ఒకటి. బొబ్బిలిరాజాతో కలియక పీఠాపురం రాజాగారు ప్రజాపక్షం అని మరోపార్టీ పెట్టారు. ప్రజాభి

మానంలేని యీ రెండు పార్టీలకు ఎన్నికల్లో ఘోరమైన ఓటమి సంభవించింది. ఒక్క చల్లపల్లి రాజాగారు మాత్రమే గెలిచారు. ఈ దెబ్బతో ఆంధ్రలో జస్టిస్ పార్టీ తుడిచిపెట్టుకుపోయింది. ప్రకాశంగారు అహర్నిశలు కృషిచేసి కాంగ్రెసుకు అఖండ విజయం సాధించిపెట్టారు. 'నా కారు ఆ రోడ్డుమీదనుంచి పోనివ్వండిరా, కాంగ్రెస్‌కు ఓట్లు ఎందుకు రావో చూస్తా' అని ధీమాగా అనేవారు. అలాగే సాధించిపెట్టారు. ఇక్కడ 215 స్థానాలలో 116 సాధారణ నియోజక వర్గాలైనప్పటికీ కాంగ్రెసు సంపాదించుకొన్న స్థానాల సంఖ్య 159.

ఎన్నికల తర్వాత రాజాజీ సారథ్యంలో మొట్టమొదటి ప్రజాప్రభుత్వం ఏర్పడింది. రాజాజీ మంత్రివర్గంలో ప్రకాశం పంతులు (రెవెన్యూ) వి. వి. గిరి (కార్మిక) గోపాలరెడ్డి (ఆరోగ్య) మంత్రులైనారు. మహర్షి బులుసు సాంబమూర్తి స్పీకర్. ఈ మంత్రిమండలి పనిచేస్తుండగానే 1939లో రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. 1939 అక్టోబర్‌లో భారతదేశం జర్మనీకి ప్రతికూలంగా యుద్ధంలో పాల్గొంటున్నట్లు వైస్రాయ్ ప్రకటించగానే కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా చేసినవి. యుద్ధానంతరం 1946 ఏప్రిల్‌లో ఎన్నికలు జరిగినవి కాంగ్రెసుకు అత్యధిక మెజారిటీ లభించింది. పార్టీ నాయకత్వానికి ప్రకాశం పంతులు, ముత్తరంగ మొదలియార్ పోటీచేశారు. గాంధీజీ అభిమతానికి విరుద్ధంగా ప్రకాశం పంతులు గెలిచారు. రాజాజీ కేంద్ర మంత్రివర్గంలో చేరి పోయారు.

## ప్రకాశం మంత్రివర్గ పతనం

తమిళులు తెలివైనవారు. ప్రకాశంవంటి ఆంధ్రుడు ముఖ్యమంత్రిగా ఉంటే ఆంధ్రరాష్ట్రం ఏర్పడక తప్పదనీ, మద్రాసు నగరంలో భాగానికై పోరాడక మానరని తెలుసుకొని ఎడమొఖం, పెడమొఖంగా ఉంటున్న రాజాజీ, కామ్‌రాజ్‌లు ఢిల్లీలో మంతనాలు జరుపుకొన్నారు. వారితో పట్టాభివర్గం చేతులు కలిపింది. 1947 మార్చిలో ఒక అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశపెట్టారు.

"ప్రకాశం నాయకత్వం పట్ల విశ్వాసం లేదన్నవారు అలా ఎందుకన్నారో నాకు బోధపడలేదు. కాంగ్రెసు కార్యక్రమాన్ని వ్యతిరేకించి ప్రకాశం చేసిందేమీ లేదని" అన్నారు. అవిశ్వాసతీర్మానాన్ని పరిశీలించటానికొచ్చిన అఖిల భారత

కాంగ్రెసు అధ్యక్షుడు ఆచార్య కృపలానీ. ఏదైనా, ఏమైనా మెజారిటీకి కృపలానీగారు తలవొగ్గక తప్పలేదు. అసెంబ్లీ-కౌన్సిల్ ఉభయసభల సంయుక్త సమావేశం మార్చి 21న జరిగింది. పార్టీ నాయకత్వానికి ప్రకాశంగారు, రామస్వామి రెడ్డియార్ పోటీ చేశారు. రెడ్డియార్‌కు 116, ప్రకాశం పంతులుగారికి 78 ఓట్లు వచ్చాయి * అవిభక్త మద్రాసు రాష్ట్ర మంత్రివర్గాలు స్థిరమైనవి కావు.

## సంజీవరెడ్డి గెలుపు—కురువృద్ధుల కినుక

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు రాజకీయాలు చాలాకాలం ఆంధ్రకేసరి ప్రకాశం, డా॥ పట్టాభి సీతారామయ్యల కీచులాటల మధ్య నడిచినవి. ప్రకాశంగారు ముఖ్యమంత్రి అయినప్పుడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవిని ఆచార్య రంగాకు అప్పగించారు. 1951 ఏప్రిల్ 11వ తేదీన విజయవాడలో తిరిగి ఎన్నికలు జరిగినవి. ప్రకాశంగారి మద్దతుతో ఆచార్య రంగా తిరిగి పోటీచేస్తే మంత్రివర్గీయుల పక్షాన మంత్రిపదవికి రాజీనామా చేసి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు పోటీ చేశారు. ఐదు ఓట్ల తేడాతో సంజీవరెడ్డిగారు గెలిచారు. శ్రీ సంజీవరెడ్డి గెలుపు రాష్ట్ర రాజకీయాలలో గొప్ప మలుపును తెచ్చింది. ఓడిపోయిన రంగాగారు కృషిక్‌కార్ లోక్‌పార్టీ (కె.ఎల్.పి.)ని స్థాపించుకోగా ప్రకాశంగారు కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీలో చేరిపోయారు.

కాంగ్రెసు పార్టీలోని యీ అంతఃకలహాల వలన 1952 ఎన్నికల్లో యీ పార్టీకి ఘోర పరాజయం సంభవించింది. మద్రాసు శాసనసభ్యులు ఆంధ్ర ప్రాంతానికి 138 స్థానాలుండినవి. కమ్యూనిస్టులు యీ ఎన్నికల్లో 41 సీట్లను గెల్చుకోగా కాంగ్రెసువారికి 38 సీట్లే లభించాయి. సర్కారు జిల్లాలలో కె.ఎల్.పి; కమ్యూనిస్టులదే పై చేయి అయింది. మద్రాసునుండి పోటీచేసిన ఆంధ్రకేసరి కూడా ఓడిపోయారు. ప్రకాశం గెలిస్తే మళ్ళీ మద్రాసు మీద పడ్తాడనుకొన్నారు తమిళులు. ఈ సలహా యిచ్చింది రాజాజీ. మద్రాసు తగాదాలో ఉండగా రాష్ట్ర విభజన అసాయకరమైనదని బ్రిటిషువా రుండగానే గవర్నరుతో రాజాజీ ఇండియా కార్యదర్శికి ఒక లేఖ వ్రాయించాడు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రానికోసం ఒక ఉద్యమంగా పోరాడుతున్న కమ్యూనిస్టులపై ప్రజలు సానుభూతి కనబరచారు ఈ ఎన్నికల్లో.

## అమరజీవి పొట్టి శ్రీరాములు

ఆంధ్ర రాష్ట్ర సాధనకు దీక్షగా పనిచేసిన మహానాయకుడు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య. థార్ కమీషన్ ఆంధ్ర రాష్ట్రానికి వ్యతిరేకంగా రిపోర్టు యిస్తే తాను జైపూర్ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షుడైనపుడు కాంగ్రెస్ తరఫున ఒక ఉపసంఘాన్ని నియమించారు. అదే జె.వి.పి. కమిటీ. 1949 ఏప్రిల్‌లో యీ కమిటీ సమర్పించిన సిఫారసులో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడుతుందని ఉన్నా ఖచ్చితమైన కాలనిర్ణయం లేదు. 1952 ఆగష్టు 15వ తేదీన స్వామీ సీతారాం 36 రోజుల నిరాహారదీక్ష బూనినా లాభంలేకపోయింది. 1952 అక్టోబరు 19వ తేదీన మహాత్ముని శిష్యుడు మహాదేశభక్తుడైన పొట్టి శ్రీరాములు గారి ఆమరణ ఉపవాస దీక్ష 58 రోజులు సాగింది. శ్రీరాములు అమరత్వంతో ఆంధ్ర ప్రపంచం భగ్గుమంది. దీని ఫలితంగా 1953 అక్టోబరు 1వ తేదీన ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. భారత స్వాతంత్ర ప్రదాత అనే కీర్తి ఒక వైశ్యునికి లభిస్తే ఆంధ్ర రాష్ట్ర ప్రదాత అనే కీర్తి మరో వైశ్యునికి లభించింది.

## ప్రకాశం లేని మంత్రివర్గం తలలేని మొండెం

ఎన్నికల్లో ఓడిపోయిన సంజీవరెడ్డిగారు రాజ్యసభ సభ్యత్వం సంపాదించుకొన్నారు కనుక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినప్పుడు ఆయనకు శాసన సభ్యత్వం లేదు. శ్రీ అద్దూరి బలరామరెడ్డి రాజీనామా చేయగా ఆయన నియోజకవర్గమైన కాళహస్తినుంచి ఉపఎన్నికలో విజయం సాధించి కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ నాయకుడైనారు. ప్రకాశంగారు లేని మంత్రివర్గం తలలేని మొండెం అన్నారు ప్రధాని నెహ్రూతో సహా అందరూ. కురువృద్ధుడు జీవించి ఉండగా ముఖ్యమంత్రి కాపటానికి ఇష్టపడని సంజీవరెడ్డిగారు ప్రకాశంగార్ని ఒప్పించి ముఖ్యమంత్రిగా చేసి తాము ఉపముఖ్యమంత్రిగా ఉండిపోయారు. ఈలోగా కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ సోషలిస్టు పార్టీగా మారిపోయింది. ప్రకాశంగారి చర్యను పి.ఎస్.పి. వ్యతిరేకించింది. ప్రకాశంగారు పి.ఎస్.పి.ని వీడి కాంగ్రెసు పార్టీలో చేరిపోయారు. ఆయన పార్టీ ప్రజా పార్టీగా రూపొందింది. దానికి శ్రీ తెన్నేటి విశ్వనాథం అధ్యక్షుడైనారు. రంగాగారి కె.ఎల్.పి.కి రాష్ట్ర శాఖ అధ్యక్షులు శ్రీ గౌతు లచ్చన్న. మొదట్లో ప్రకాశంగారి మంత్రివర్గాన్ని కె.ఎల్.పి. బలపరచడంతో మంత్రివర్గ నిర్మాణ సమయంలో గౌతు లచ్చన్న

గారు మంత్రివర్గంలో చేరిపోయినా రాజధాని విషయంలో అభిప్రాయ భేదాలొచ్చి ఆయన రాజీనామా చేసారు. ఆంధ్రలో మొదటిసారి ఏర్పడ్డ ప్రభుత్వం కాంగ్రెసు, ప్రజాపార్టీల మిశ్రమ ప్రభుత్వం. పి.ఎస్.పి., కమ్యూనిస్టు పార్టీ, కె.ఎల్.పి.లు ప్రతిపక్షంలో కూర్చున్నాయి. శ్రీ నీలం సంజీవరెడ్డి స్థానంలో డా॥ బెజవాడ గోపాలరెడ్డి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులైనారు. ప్రకాశంగార్ి మంత్రివర్గం :- శ్రీ టంగుటూరి ప్రకాశం (ముఖ్యమంత్రి), శ్రీ నీలం సంజీవ రెడ్డి (ఉప ముఖ్యమంత్రి), శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథం, కడప కోటిరెడ్డి, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, దామోదరం సంజీవయ్య, పట్టాభిరామారావు (మంత్రులు), నల్లపాటి వెంకట్రామయ్య స్పీకరు. 1952 నుండి డా॥ పట్టాభి రాజకీయాలకు దూరమై మధ్యప్రదేశ్ గవర్నరుగా వెళ్లిపోయారు. అఖిల భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన శ్రీ కళా వెంకటరావు రాష్ట్ర రాజకీయాలకు దిగారు.

## ప్రకాశం ఓటమా — సంజీవరెడ్డి ఓటమా ?

ప్రకాశంగారి మంత్రివర్గం 13 నెలలు మాత్రమే పనిచేసింది. మద్యపాన విషయంపై ప్రభుత్వం శొంఠి రామమూర్తి కమిషన్ను నియమించింది. ఈ సంఘం 1954 మార్చి 2వ తేదీన సమర్పించిన నివేదికలో మద్యపాన నిషేధాన్ని రద్దుపరచమన్నది. ప్రభుత్వం అందుకు సిద్ధంగా లేదు. నిషేధం రద్దుబరచ నందుకు ప్రభుత్వంపై అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టారు శ్రీ గౌతు లచ్చన్న. శ్రీ సంజీవరెడ్డి ప్రత్యర్థులైన శ్రీ నాయకంటి శంకర రెడ్డి, శ్రీ అడుసుమిల్లి సుబ్రహ్మణ్యం వ్యతిరేకంగా ఓటు చేయడంవలన ప్రకాశంగారి మంత్రివర్గం పడిపోయింది. దీన్ని ప్రకాశంగారి ఓటమి కన్నా సంజీవరెడ్డి ఓటమే అనాలి.

## ప్రజలమనిషి ప్రకాశం

ఆంధ్ర ప్రాంతం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడే వంద సంవత్సరాలకు పూర్వం నిర్మించిన కృష్ణా ఆనకట్ట కొంతభాగం పడిపోయింది. దానికింద 11 లక్షల ఎకరాల వరి సాగు అవుతుంది. భారతదేశంలోని పెద్ద ప్రాజెక్టులలో ఇది ఒకటి. పాత ఆనకట్ట పనికిరాదని, కొత్త బ్యారేజి నిర్మాణం కావాలని నిపుణుల సలహా అందినప్పుడే ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. కేంద్రం

నుండి సహాయం అందకపోయినా, ప్రభుత్వానికి ఎన్ని ఆర్థిక ఇబ్బందులున్నా ప్రకాశంగారు యీ పని మొదలుపెట్టారు. తర్వాత ఆది ప్రకాశం బ్యారేజి అయింది. అలాగే వెంకటేశ్వర విశ్వవిద్యాలయం స్థాపించారు. ఆంధ్ర దేశం చిరకాలం జ్ఞాపకముంచుకొనే రెండు గొప్ప పనులను అతి స్వల్పకాలం మాత్రమే అధికారంలోవున్న ప్రకాశంగారు చేసారు. తను చివరివరకు ప్రజల మనిషిగానే ఉండిపోయారు.

## గోపాలరెడ్డిగారి మంత్రివర్గం

ఆంధ్రకేసరి మంత్రివర్గ పతనంతో 1954 నవంబరులో రాష్ట్రపతిపాలన ప్రవేశపెట్టబడింది. 1955లో మధ్యాంతర ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికల్లో కె.ఎల్.పి., ప్రజా పార్టీలతో కాంగ్రెసు చేతులు కలిపింది. నియోజకవర్గాల పునర్విభజనతో 140 సీట్లనుండి వీటి సంఖ్య 194కు పెరిగింది. అధికారం తమకు లభిస్తుందన్న ఆశతో కమ్యూనిస్టులు ఎన్నికల రంగంలో దిగారు. ప్రధాని నెహ్రూ, కాంగ్రెసు అధ్యక్షుడు ధేబర్, ఎస్కే పాటిల్ మున్నగు అధిష్ఠాన వర్గం నాయకులు కాంగ్రెసు పక్షాన ప్రచారం చేసారు. యునైటెడ్ కాంగ్రెసు పార్టీకి 147 స్థానాలు, ఆంధ్ర నేషనలిస్టు పార్టీకి 19, కమ్యూనిస్టు పార్టీకి 13, నేషనలిస్టు పార్టీకి 12, ఇండిపెండెంట్లు 2 స్థానాలు, పి.ఎస్.పి. ఒక స్థానం గెల్చుకొన్నాయి. మళ్లీ నాయకత్వపు పోటీ వచ్చింది. అధిష్ఠాన వర్గం జోక్యంపై డా॥ బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రి అయినారు. శ్రీ సంజీవరెడ్డి ఉపముఖ్యమంత్రిగా ఉండిపోయారు. శ్రీ రొక్కం లక్ష్మీనరసింహం దొర స్పీకరైనారు.

గోపాలరెడ్డి మంత్రివర్గం :— డా॥ బెజవాడ గోపాలరెడ్డి (ముఖ్యమంత్రి) శ్రీ నీలం సంజీవరెడ్డి (ఉపముఖ్యమంత్రి) శ్రీయుతులు ఎస్. బి. పట్టాభి రామారావు, గౌతు లచ్చన్న, కందుల ఓబులరెడ్డి, కళా వెంకటరావు, తెన్నేటి విశ్వనాథం, దామోదరం సంజీవయ్య, కల్లూరి చంద్రమౌళి, డా॥ ఎ. బి నాగేశ్వరరావు (మంత్రులు) శ్రీ చందులాల్ మాధవలాల్ త్రివేది ఉభయ ముఖ్యమంత్రుల కాలంలో గవర్నరుగా పనిచేసారు.

డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రి కాగానే ఆంధ్ర రాష్ట్ర అధ్యక్ష పదవి ఖాళీ అయినది. 1954 జూన్‌లో ఎన్నికలు జరిగినవి. మాజీ

కె.ఎల్.పి. మద్దతుతో డా॥ గోపాలరెడ్డి ఆచార్య రంగాను నిలబెట్టారు. శ్రీ సంజీవరెడ్డి మద్దతుతో శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు పోటీ చేసారు. అల్లూరి గెలిచారు. అంటే డా॥ గోపాలరెడ్డి శ్రీ సంజీవరెడ్డి చాటున ఉండి పోటీలు చేయించగా శ్రీ సంజీవరెడ్డి పక్షం గెలిచింది. శ్రీ నీలం సంజీవరెడ్డి ఖాళీచేసిన రాజ్యసభ స్థానాన్ని శ్రీ అల్లూరి గెల్చుకొన్నారు. కొంతకాలం శ్రీ సంజీవరెడ్డి శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు "కృష్ణార్జునులు"గా మెలిగినారు.

## రెండింటిని కలిపే కృష్ణానది

1955 డిసెంబరు 10వ తేదీన ప్రధాని నెహ్రూ నాగార్జునసాగర్ శంకు స్థాపన చేసారు. ఈ సభలో మాట్లాడుతూ ప్రధాని "నా ఎదుట ఒక మహానది కనబడుతున్నది. దానిపేరు కృష్ణ. ఈ నదికి 'అద్దర్ని ఆంధ్ర, ఇద్దర్ని తెలంగాణా అంటున్నారు. ఈ రెండు భాగాల ప్రజలు ఒకే భాష మాట్లాడుతారు. ఒకే సంస్కృతి గలవారు. ఈ నది ప్రజానీకాన్ని విడదియ్యలేదు," అని అన్నారు. హిందీలో నెహ్రూ చెప్పిన ఈ మాటలను కారణాంతరాలవల్ల రామకృష్ణా రావుగారు తెలుగులోకి యధాతథంగా తర్జుమా చెయ్యలేదని 'బ్రహ్మానంద యాత్ర' లో శ్రీ కపిల కాశీపతిగారు పేర్కొన్నారు. ఆంధ్రప్రదేశ్ అవతరణవరకు డా॥ గోపాలరెడ్డి ' మంత్రివర్గమే అధికారంలో ఉన్నది. గోపాలరెడ్డిగారివి లాలిత్యపు రాజకీయాలు.

ఆయన కవితా షట్పదము. ఎక్కడ తెలుగు కవిత పందిళ్లు కప్పుతున్నా, ఎక్కడ ఉర్దూ కవితకు చల్లని వింజామరలు వీస్తున్నా, ఎక్కడ లలిత సంగీతపు గజ్జెలు కట్టుతున్నా అక్కడక్కడ డా॥ గోపాలరెడ్డి ప్రత్యక్షము:

## ఘనమైన కీర్తికలది ఆంధ్రజాతి

ఆంధ్రుల గత చరిత్రే గొప్పదికాదు; నడుస్తున్న చరిత్ర కూడా గొప్పదే. వర్ధమానయుగంలో ఆంధ్రులు అనేక రంగాలలో విశేష ప్రతిభ కనబరచినారు. సాహిత్యాన్నే ఆయుధంగా ఉపయోగించిన నవయుగవైతాళికుడు కందుకూరి వీరేశలింగం. అఖిలభారత ఖ్యాతి నార్జించిన విద్యావేత్త కట్టమంచి రామలింగా రెడ్డి. బరోడా కళాశాల ఉపాధ్యక్షుడుగాను, మైసూరు యువరాజా కళాశాల ఆచార్యుడుగాను, మైసూరు రాష్ట్ర విద్యాశాఖాధికారిగాను, ఆంధ్ర విశ్వకళా

పరిషత్ ఉపాధ్యక్షుడుగాను పనిచేసినాడు. తెలుగుదేశంలో భావవిప్లవానికి వేగుచుక్కై ప్రకాశించాడు గురుజాడ అప్పారావు. మద్రాసు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడుగా పనిచేసిన తెలుగుబిడ్డ సర్. రఘుపతి వెంకటరత్నం నాయుడు. వార్తాపత్రికను దేశభక్తి ప్రబోధానికి వినియోగించి, ఆంధ్ర జాతీయోద్యమ చరిత్రలో విశిష్టస్థానాన్ని ఆక్రమించిన మనిషి ముట్నూరి కృష్ణారావు. మైసూరు రాష్ట్రంలో జన్మించి, ప్రవాసాంధ్రుడుగానే జీవితం గడిపి ఇంజనీరింగు శాస్త్రంలో ఎన్నో అద్భుతాలను సృష్టించి దిగంతాలవరకు ఖ్యాతిని పెంచుకొన్న ప్రజ్ఞాశాలి మోక్షగుండం విశ్వేశ్వరయ్య.

ఆర్గురు రాష్ట్రపతులలో ముచ్చటగా ముగ్గురు ఆంధ్రులు — డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ, వరాహగిరి వెంకటగిరి, నీలం సంజీవరెడ్డి రాష్ట్రపతులైనారు. తన వాక్చాతుర్యంతో సభామన్నల్ని పొందిన లోక్‌సభ స్పీకర్—అనంతశయనం అయ్యంగార్.

కొండా వెంకటప్పయ్య, హరి సర్వోత్తమరావు, కళా వెంకటరావు, న్యాయపతి సుబ్బారావు, తెన్నేటి విశ్వనాథం, అయ్యదేవర కాళేశ్వరరావు, మొసలికంటి తిరుమలరావు తమ జీవితాలను దేశానికి అంకితం చేసిన పుణ్యమూర్తులు.

ఆంధ్ర మహిళాసభను స్థాపించి, మహిళాభ్యుదయాన్ని ఒక తపస్సుగా నెంచిన విదుషీమణి శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్.

పెక్కుర ఆంధ్రులు పరిపాలనారంగంలో రాణించారు. వేపా రామేశం (మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి), ఎస్.వి రామమూర్తి (మద్రాసు ప్రభుత్వం ప్రధాన కార్యదర్శి), వ్యాకరణం నరహరిరావు (భారత ప్రభుత్వ కంట్రోలర్ మరియు ఆడిటర్ జనరల్, సూడాన్ ప్రభుత్వానికి ఆర్థిక కార్యదర్శి, ప్రపంచ బ్యాంకు ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్), పి. సత్యనారాయణరావు (మధ్యభారత్, జోధ్‌పూర్ సంస్థానాలకు ప్రధాని, 1956 లో కేరళ గవర్నరు), బి. వెంకటప్పయ్య (ప్లానింగ్ కమీషన్ సభ్యుడు) వీరిని ప్రధానంగా పేర్కొనవచ్చు.

విజ్ఞాన శాస్త్రజ్ఞుల్లలో డా॥ ఎల్లాప్రగడ సుబ్బారావు (బయో కెమిస్ట్) డా॥ సూరి భగవంతం (ఫిజిక్సు) డా॥ కె. యల్. రావు (ఇంజనీరింగు కేంద్ర ప్రభుత్వంలో విద్యుచ్ఛక్తి, నీటిపారుదల శాఖ మాజీమంత్రి) ప్రముఖస్థానాల నాక్రమిస్తారు.

భారత పత్రికారంగం ఆంధ్రులను వరించినదంటే అతిశయోక్తి కాదు. సి. వై. చింతామణి, కోటంరాజు రామారావు, కోటంరాజు పున్నయ్య, కుందూరి ఈశ్వరదత్తు, ఖాసా సుబ్బారావు, చలపతిరావు, కపిల కాశీపతి, నార్ల వెంకటేశ్వర రావు, గోరాశాస్త్రి రాణికెక్కిన జర్నలిస్టులు.

ఈ సందర్భంలో ఇద్దరు తెలంగాణా ప్రముఖుల సేవలను తప్పక పేర్కొనాలి.

శ్రీ సురవరం ప్రతాపరెడ్డి ఉద్దండ పండితుడు. ఉద్గ్రంథకర్త. సాహిత్య పరిశీలకుడే కాదు; చక్కని విమర్శకుడు. తెలుగు చదువే కరువైన దినాలలో నా సోదరులకు తెలుగు చదువుకునే హక్కున్నదని జబ్బ చరచి చెప్పిన గొప్ప దనం—నిజాం నవాబు ఫర్మానాను నిలబడి యిదేమిటని తొలిసారి అడగ గలిగిన గుండెదిటవు ఆయనకే దక్కినది. నిరంకుశ ప్రభుత్వాన్ని నిశితంగా విమర్శిస్తూ 'గోలకొండ పత్రిక'ను నిర్వహించిన సాహసి ఆయన.

నిజాం నవాబునుంచి 'రాజాబహాదుర్' బిరుదు, బ్రిటిషు సర్కారునుంచి 'ఓ. బి. ఇ.' బిరుదు పొంది, తాను పెద్దగా చదువుకోకపోయినా పద్నాలుగు సంవత్సరాలు హైదరాబాద్ సిటీ పోలీసు కమీషనర్‌గా పనిచేసి గ్రామీణవిద్యార్థుల చదువులకోసం 'రెడ్డి హాస్టల్' స్థాపించి ఎందరెందరో తెలుగువారు వెలుగులోకి రావడానికి కారకుడైన మహానుభావుడు కోత్వాల్ వెంకట్రామారెడ్డి. పేరుకు రెడ్డి హాస్టలే అయినా అందులో ప్రవేశం అన్నికులాల వారికి అన్ని మతాల వారికి. అనాథ బాలబాలికల శరణాలయాల స్థాపనకు, వయోవృద్ధుల శరణా లయాల స్థాపనకు విశేషంగా తోడ్పడ్డారు. ఆ రోజుల్లో రాజా బహాదుర్ ఇటు హిందువులకు అటు ముస్లింలకు ఆత్మబంధువే.

— —

## 1. అవిభక్త మదరాసు రాష్ట్రపు ముఖ్యమంత్రులు

| | ముఖ్యమంత్రి | పార్టీ | పదవీకాలం |
|---|---|---|---|
| 1. | పానుగల్లు రాజా | జస్టిస్ పార్టీ | 1921–27 |
| 2. | డా॥ పి. సి సుబ్బారాయన్ | ,, | 1927–30 |
| 3. | డా॥ మునిస్వామినాయుడు | ,, | 1930–32 |
| 4. | బొబ్బిలి రాజా | ,, | 1932–37 |
| 5. | సర్. కె.వి. రెడ్డినాయుడు | ,, | 1937 |
| 6. | సి. రాజగోపాలచారి | కాంగ్రెసు | 1937–39 |
| 7. | టంగుటూరి ప్రకాశం | ,, | 1946–47 |
| 8. | ఒ.పి. రామస్వామిరెడ్డియార్ | ,, | 1947–49 |
| 9. | కుమారస్వామిరాజ | ,, | 1949–52 |
| 10. | సి. రాజగోపాలాచారి | ,, | 1952 |

రాజాజీ కాలంలోనే ఆంధ్ర రాష్ట్రావతరణ జరిగినది.

## 2. మదరాసు రాష్ట్ర మంత్రివర్గాలలో ఆంధ్ర సభ్యులు

| | మంత్రివర్గం | ఆంధ్రమంత్రులు |
|---|---|---|
| 1. | రాజాజీ (మొదటిసారి) | (1) టంగుటూరి ప్రకాశం. (2) వి వి. గిరి (3) బెజవాడ గోపాలరెడ్డి. |
| 2. | ప్రకాశం | (1) వి. వి. గిరి. (2) కె. కోటిరెడ్డి (3) వేముల కూర్మయ్య. |
| 3. | ఓమండూరు రామస్వామి రెడ్డియార్ | (1) బెజవాడ గోపాలరెడ్డి. (2) కె. చంద్రమౌళి. (3) వేముల కూర్మయ్య. (4) హాలహర్వి సీతారామా రెడ్డి. |
| 4. | కుమారస్వామిరాజా | (1) బెజవాడ గోపాలరెడ్డి. (2) కల్లూరి చంద్రమౌళి. (3) నీలం సంజీవరెడ్డి. (4) హాలహర్వి సీతారామారెడ్డి. |
| 5. | రాజాజీ (రెండవసారి) | (1) పట్టాభిరామారావు (2) ఎం. వి. కృష్ణారావు. (3) ఎన్. రంగారెడ్డి. (4) ఎన్. శంకర రెడ్డి. (5) దామోదరం సంజీవయ్య. |

——

# పెద్దమనుషుల వొప్పందం

రెండు కోట్లకు మించియుండిన
తెల్లవారలు నక్కటా !
చీల్చివైచిరి నాల్గు దెసలకు
జిమ్మివైచిరి నేటికిన్,

కొంతమంది నిజాము రాష్ట్రము
నందు జిక్కిరి బేలలై,
కొంత మందియు కన్నడంబున
నుండిపోయిరి దీనులై

తెలుగు బిడ్డా ! మరచిపోకుర
తెలుగు దేశం పురిటి గద్దర
కొక్కొరోకో పాట బాడర
తెలుగువారల మేలుకొల్పర !

లెమ్ము లెమ్మిక నడుముగట్టుము
తెల్గువారల నెల్లన
కొకక్క రాష్ట్రము నందు గూర్పగ
గట్టి యత్నము జేయుమా !

— కవిరాజు

ఆ యత్నమే పెద్దమనుషుల వొప్పందం.

1956 ఫిబ్రవరి 20వ తేదీన ఢిల్లీలోని హైదరాబాద్ అతిథి గృహంలో ఆంధ్ర తెలంగాణా నాయకుల సమావేశం జరిగింది. సమావేశంలో పాల్గొన్న నాయకులు :—

శ్రీ డా॥ బి.గోపాలరెడ్డి, శ్రీ సంజీవరెడ్డి, శ్రీ గౌతు లచ్చన్న, శ్రీ అల్లూరి

సత్యనారాయణరాజు (ఆంధ్ర), డా॥ బి. రామకృష్ణారావు, శ్రీ కె వి. రంగారెడ్డి, డా॥ ఎం. చెన్నారెడ్డి, శ్రీ జె.వి. నరసింగరావు. (తెలంగాణా)

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల ఏకీకరణపై తలెత్తిన అంశాలను వీరు చర్చించి యీ దిగువ అంశాలను ప్రతిపాదించుకొన్నారు.

1. రాష్ట్రానికి సంబంధించిన కేంద్ర, రాష్ట్ర సాధారణ పరిపాలనా వ్యయం ఆంధ్ర, తెలంగాణా, నిష్పత్తి ప్రకారం భరించాలి. తెలంగాణా మిగులు ఆ ప్రాంతం అభివృద్ధికి కేటాయించాలి. అయిదేళ్ళదాకా యీ ఏర్పాటు ఉండాలి. అటు తర్వాత తెలంగాణా శాసన సభ్యులు కోరిన పక్షంలో మరో అయిదేళ్లు పొడిగించవచ్చు.

2. శాసన సభలో తెలంగాణా సభ్యులు నిర్ణయించిన విధంగా తెలంగాణాలో మధ్యనిషేధం అమలుజరపాలి.

3. తెలంగాణాలో వున్న విద్యా సౌకర్యాలు తెలంగాణావారికే లభించాలి. ఇంకా అభివృద్ధి పరచాలి. లేకపోతే మొత్తం రాష్ట్రంలోని సాంకేతిక విద్యతో సహా అన్ని విద్యాలయాలలోను మూడోవంతు తెలంగాణా విద్యార్థులకు కేటాయించాలి.

4. ఏకీకరణ కారణంగా కొన్ని ఉద్యోగాలను విధిగా తగ్గించవలసి వస్తే నిష్పత్తి ప్రకారం జరగాలి.

5. ముందు రాబోయే ఉద్యోగాలు ఉభయ ప్రాంతాల జనాభా ప్రాతిపదిక మీద ఉండాలి.

6. తెలంగాణాలో ప్రస్తుతం అమలులో ఉన్న పరిపాలనా న్యాయశాఖలలో ఉర్దూభాషకు కల స్థానం ఐదేళ్ళపాటు కొనసాగాలి. తర్వాత ప్రాంతీయ సంఘం యీ అంశం సమీక్షించి సవరించవచ్చు. ఉద్యోగాలలో చేర్చుకునే ముందు తెలుగు వచ్చితీరాలనే నిబంధన ఉండకూడదు. చేరిన రెండేళ్ళలో తెలుగు నేర్చుకోవాలని నియమం ఉండవచ్చు.

7. తెలంగాణాలో నిష్పత్తి ప్రకారం నిర్ణయించిన ఉద్యోగాలలో ప్రవేశించడానికి అభ్యర్థులకు ఆ ప్రాంతంలో 12 సంవత్సరాల నివాసం ఉండాలి.

8. తెలంగాణాలో వ్యవసాయ భూముల అమ్మకం ప్రాంతీయ మండలి ఆమోదంతో ఉండాలి.

9. తెలంగాణా సర్వతోముఖాభివృద్ధి కార్యక్రమాలకు ఒక ప్రాంతీయ సంఘం ఉండాలి.

10. తెలంగాణా ప్రాంతీయ సంఘం ఏర్పడుతుంది. ఈ ప్రాంతీయ సంఘంలో 20 మంది సభ్యులుంటారు. తెలంగాణా తొమ్మిది జిల్లాలనుంచి తొమ్మండుగురు శాసనసభ్యులను శాసనసభ ఎన్నుకుంటుంది. శాసనసభలోని తెలంగాణా సభ్యులు పార్లమెంటునుంచిగాని శాసనసభనుంచిగాని ఆరుగురు సభ్యులను ఎన్నుకుంటారు. ముఖ్యమంత్రి స్పీకర్ తప్పితే తెలంగాణా ప్రాంతానికి చెందిన మంత్రులందరు యీ సంఘం సభ్యులే.

11. ఈ ప్రాంతీయ సంఘాన్ని రాజ్యాంగంలోని 371 నిర్దేశకసూత్రం ప్రకారం రాష్ట్రపతి నియమిస్తారు. కనుక, ఇది చట్టబద్ధమైన సంస్థ. ప్రణాళికా రచన, అభివృద్ధి వ్యవహారాలు, నీటిపారుదల, ఇతర వ్యవసాయ పథకాలు, పారిశ్రామికాభివృద్ధి, తెలంగాణా ఉద్యోగాలు, ప్రజారోగ్యం, మద్యనిషేధం, ప్రాంతీయసంఘం పరిశీలించి నిర్ణయాలు తీసుకుంటుంది. రాష్ట్ర ప్రభుత్వానికీ, ప్రాంతీయ సంఘానికి మధ్య అభిప్రాయభేదం కలిగితే అంతిమ నిర్ణయానికై భారత ప్రభుత్వానికి నివేదించాలి.

ఈ ఏర్పాటు మధ్యలో మరో ఒప్పందం లేని పక్షాన, పది సంవత్సరాల తరువాత సమీక్ష చేయబడుతుంది.

12. మంత్రివర్గం నిర్మాణంలో ఆంధ్రప్రాంతం నుంచి 60 శాతం, తెలంగాణా ప్రాంతం నుంచి 40 శాతం ఉండాలి. తెలంగాణా భాగంలో ఒక ముస్లిం మంత్రి ఉండాలి.

13. ముఖ్యమంత్రి ఆంధ్రప్రాంతం వారైతే ఉపముఖ్యమంత్రి తెలంగాణా వారై ఉండాలి. ముఖ్యమంత్రి తెలంగాణా వారైతే, ఉపముఖ్యమంత్రి ఆంధ్ర ప్రాంతం వారై ఉండాలి. హోం, ఫైనాన్స్, రెవిన్యూ, ప్లానింగ్-డెవలప్‌మెంట్ వాణిజ్య పరిశ్రమల శాఖలలో కనీసం రెండైనా తెలంగాణా వారికివ్వాలి.

14. హైదరాబాద్ ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు 1962 వరకు

తెలంగాణాకు ప్రత్యేక ప్రదేశ్ కాంగ్రెస్ ఉండాలని కోరుతున్నారు. దీనికి ఆంధ్ర కాంగ్రెసు ఎట్టి పరిస్థితిలో అభ్యంతరం లేదు.

## అంగీకారం కుదిరిన అంశాలు

1. కొత్త రాష్ట్రానికి పేరు:— కొత్తరాష్ట్రం పేరును (ముసాయిదా బిల్లులో ప్రతిపాదించినట్లు) ఆంధ్ర–తెలంగాణాగా ఉండాలని తెలంగాణా ప్రతినిధులు కోరారు. సంయుక్త సెలెక్ట్ సంఘం సమర్పించినట్లు 'ఆంధ్రప్రదేశ్' పేర ఉండాలని ఆంధ్ర ప్రతినిధులు కోరారు.

2. హైకోర్టు: హైకోర్టు ప్రధానస్థానం హైదరాబాదులో ఉండి దాని ఒక బెంచి గుంటూరులో ఉండాలని తెలంగాణా ప్రతినిధులు కోరారు. గుంటూరులో బెంచి ఉండనక్కరలేదని మొత్తం హైకోర్టు హైదరాబాద్‌లోనే ఉండాలని ఆంధ్ర ప్రతినిధులు కోరారు.

## తెలంగాణా ప్రాంతానికి ప్రతిపాదించిన రక్షణలపత్రం వివరాలు

1. ప్రాంతీయస్థాయి సంఘం: ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంతటికీ ఉమ్మడి శాసనసభలు వుంటాయి. మొత్తం రాష్ట్రానికి యీ సభలే శాసనాలు చేస్తాయి. ఒక గవర్నరు ఉంటారు. మొత్తం పరిపాలనా రంగంలో రాష్ట్ర శాసనసభకు బాధ్యులైన మంత్రి మండలివారు సలహాలిస్తూ సహాయపడుతుంటారు.

2. కొన్ని ప్రత్యేక విషయాలలో ప్రభుత్వ వ్యవహారం సుళువుగా జరగటానికి గాను తెలంగాణా ఒక ప్రాంతంగా పరిగణించబడుతుంది.

3. తెలంగాణా ప్రాంతానికి ఒక స్థాయీ సంఘం వుంటుంది. తెలంగాణా మంత్రులతో సహా తెలంగాణా శాసనసభ్యులు అందులో సభ్యులుగా ఉంటారు. ముఖ్యమంత్రి ఇందులో సభ్యుడు కాడు.

4. ప్రత్యేక విషయాలకు సంబంధించిన శాసన విషయాలు ప్రాంతీయ సంఘానికి నివేదించబడుతాయి. ఈ విషయాలకు సంబంధించిన శాసనచర్యను ప్రాంతీయ సంఘం ప్రభుత్వానికి సూచించవచ్చు. ఆర్థిక బాధ్యతలకు సంబంధించిన సాధారణ ప్రభుత్వ విషయాలలో కూడా ప్రాంతీయసంఘం ప్రతిపాదనలు చెయ్యవచ్చు. ఇవి రోజువారీ గాని అవసర వ్యయానికి గాని సంబంధించినవి కాకూడదు.

5. ప్రాంతీయ సంఘం ఇచ్చిన సలహాలను సాధారణంగా ప్రభుత్వమూ, శాసనసభ ఆమోదించాలి. అభిప్రాయభేదం ఏర్పడితే గవర్నరుకు నివేదించాలి. గవర్నరు నిర్ణయం ఖాయమైనదిగా పాటించాలి.

6. ప్రాంతీయ సంఘం పరిశీలన కొచ్చే అంశాలు :

ఎ) శాసనసభ చేసిన చట్టాల పరిధిలో అభివృద్ధి ఆర్థిక ప్రణాళికలు.

బి) స్థానిక పరిపాలనా వ్యవహారాలు. అనగా మ్యునిసిపల్ కార్పొరేషన్ల రాజ్యాంగ అధికారాలు, అభివృద్ధి, ట్రస్టులు, జిల్లాబోర్డులు, గ్రామ పరిపాలనకు సంబంధించిన ఇతర అధికారాలు.

సి) ప్రజారోగ్యం, పారిశుధ్యం, స్థానిక ఆసుపత్రులు, వైద్యశాలలు;

డి) ప్రాథమిక, మాధ్యమిక విద్య.

ఇ) తెలంగాణాలో విద్యాసంస్థలలో ప్రవేశాలు.

ఎఫ్) మద్యనిషేధం.

జి) వ్యవసాయభూముల అమ్మకం.

హెచ్) కుటీర పరిశ్రమలు, లఘు పరిశ్రమలు.

ఐ) వ్యవసాయ సహకార సంఘాలు, అంగళ్ళు, సంతలు.

7. నివాస నిబంధనలు :

తాత్కాలికంగాఐదేళ్ళ.తెలంగాణా నాన్ గెజిటెడ్ ఉద్యోగాలకి రిక్రూటుమెంటు విషయంలో తెలంగాణా ఒక యూనిట్‌గా పరిగణించబడుతుంది. ఈ ఉద్యోగాలకు సంబంధించిన పదవులు ప్రస్తుత హైదరాబాద్ నిబంధనలతో నిర్ణయించిన నిష్పత్తిలో నివాసము షరతులకు అనుగుణంగా వున్నవారితో అంటే "ముల్కీ"ల తోనే భర్తీ చేయబడతాయి.

8. ఉర్దుభాష :

రాష్ట్రంలో ప్రస్తుతం పరిపాలనా న్యాయ వ్యవస్థలలో ఉర్దుభాషకు ఉన్న స్థానాన్ని ఐదేళ్ళపాటు కొనసాగించేందుకు తగు చర్యలు గైకొనుటకుగాను భారత ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి సలహా ఇవ్వాలి.

కొత్తరాష్ట్రంలో అధికంగా ఉన్న ఉద్యోగుల రిట్రెంచిమెంటు :

ఉద్యోగాలలో ఉన్నవారిని తొలగించవలసి వస్తుందని—రిట్రెంచిమెంటు అవసరమౌతుందని భారత ప్రభుత్వం భావించడంలేదు. ఎటువంటి పదవీచ్యుత కార్యక్రమాలు లేకుండానే హైదరాబాద్ రాష్ట్ర ఉద్యోగులను ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సమగ్ర ఉద్యోగాల్లోకి సాధ్యమైనంత వరకు చేర్చుకోవాలన్నదే ఉద్దేశం. ఒకవేళ రిట్రెంచిమెంటు అవసరమైతే యావత్తు విశాల రాష్ట్ర ఉద్యోగులందరికీ అది ఒకే రీతిగా వర్తించేట్లు చూడబడుతుంది.

తెలంగాణా ఆంధ్ర ప్రాంతాల మధ్య ఖర్చు పంపిణీ :

రాష్ట్రంలోని ఆర్థిక వనరులను బట్టి ఖర్చును కేటాయించడం రాష్ట్ర ప్రభుత్వం, శాసనసభల అధికారంలోని వ్యవహారం. అయితే కేంద్రీయ సాధారణ పరిపాలనా వ్యవహారాలకు సంబంధించిన కొత్త రాష్ట్రం ఖర్చులను రెండు ప్రాంతాల మధ్య నిష్పత్తి ప్రకారం భరించి తెలంగాణా ఆదాయంలో మిగులును, తెలంగాణా అభివృద్ధికి కేటాయించి ఉంచాలని ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల ప్రతినిధులు అంగీకరించి ఉన్నారు. కాబట్టి బడ్జెటు కేటాయింపుల విషయంలో ఈ ఒప్పందాన్ని ప్రభుత్వం పాటించవచ్చు. ముఖ్యంగా యీ ఒప్పందం గురించిన అంశాన్ని ఆంధ్ర ముఖ్యమంత్రికి దృష్టికి తేవాలని భారత ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది. ఇది అమలుపరచబడాలని కూడా భారత ప్రభుత్వం ఆశాభావం వ్యక్తపరుస్తున్నది.

ఈ పత్రం హైదరాబాద్ ముఖ్యమంత్రి డా॥ బి. రామకృష్ణారావు సంతకంతో 1956 ఆగష్టు 14న తేదీన హైదరాబాద్ ప్రభుత్వం విడుదల చేసింది.

నోటు :–

పై ఒప్పంద పత్రంలోని అంశాలు :–

2, 3, 7, 8, 10, 11- ఆంధ్రప్రదేశ్ రీజనల్ కమిటి ఆర్డర్‌లో చేర్చబడినవి.

9–ఇండియా రాజ్యాంగం ఆర్టికల్ 371లో చేర్చబడినది.

రక్షణలు 2 నుండి 8 వరకు ఆంధ్ర పదేశ్ రీజనల్ కమిటి ఆర్డర్ 1956 లో చేర్చబడినవి.

6. ఈ సబ్జెక్ట్ టూ యాక్ట్ ఆఫ్ స్టేట్ గవర్నమెంటు (స్టేటు ప్రభుత్వపు ముల్కీ నియమములు) రీజినల్ కమిటీ అర్డరు 1958లో చేర్చబడినది.

పైన పేర్కొన్న అంశాలు "పెద్ద మనుషుల ఒప్పందం"గా అంగీకరింపబడినవి.

"ఈ అంశాలలో ఏది రాజ్యాంగబద్ధమో ఏది కాదో నిర్ణయించటానికి మీకు ఒక న్యాయశాస్త్రవేత్తను సహాయం ఇస్తాను. అతని సలహాతో ఆ నిర్ణయం కూడా చేసి తీసుకోండి" అని శ్రీ పంత్ రెండు ప్రాంతాల నాయకులకు ఆదేశించినారు. 'ఈ పని తెలంగాణా నాయకులకు వదిలిపెట్టి ఆంధ్ర నాయకులు పర్యాలు వెళ్ళిపోయినారు. అప్పట్లో ఆ బిల్లును 'ఆంధ్ర, తెలంగాణా ప్రదేశ్' బిల్లుగా పార్లమెంటులో శ్రీ పంత్ ప్రవేశపెట్టారు. ఒక సభ్యుని సూచనపై రాష్ట్రం పేరు ఆంధ్రప్రదేశ్‌గా అంగీకరించబడింది. అప్పటి ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి కోకా సుబ్బారావు, హైదరాబాద్ వెళ్ళి రంగారెడ్డిని ఒకే హైకోర్టు ఉండాలని ఒప్పించారు. ఉద్దండ తెలిసిన జడ్జిల పెంచి పెట్టుకుందామని సలహా ఇస్తే రంగారెడ్డి అంగీకరించినారు. అప్పుడు ఆంధ్ర హైకోర్టు, తెలంగాణా కలిపి ఒకే హైకోర్టుగా ఏర్పడింది

రాష్ట్రం మొత్తం విస్తీర్ణంలో తెలంగాణా జనాభా 40 శాతం, భౌగోళికంగా మొత్తం విస్తీర్ణంలో తెలంగాణా విస్తీర్ణం 41.9 శాతం.

ప్రాంతీయ సంఘానికి సర్వశ్రీ కె. అచ్యుతరెడ్డి, జి. హయగ్రీవాచారి, జె. చొక్కారావు, కోదాటి రాజమల్లు వరుసగా అధ్యక్షులైనారు

## ముల్కీ చట్టం

పెద్ద మనుషుల ఒప్పందానికి ముల్కీ చరిత్ర కారణభూతం గనుక యీ చరిత్ర గురించి కొంత తెలుసుకోవాలి. ఇది ఒక ముఖ్యమంత్రి పునాదులను కదిలించింది. ఇది ఇద్దరు ముఖ్యమంత్రులను పదవీచ్యుతులను చేసింది.

నిజాం పరిపాలనలో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఏర్పడకముందు ఉత్తరాదినుంచి చాలా మంది ముస్లింలు ఇక్కడికొచ్చి ఉన్నతోద్యోగాలు సంపాదించుకునేవారు. స్థానికులకు ఉద్యోగావకాశాలు కరువైపోయినవి. బ్యారిష్టర్ శ్రీ కిషన్ 1916లో ముల్కీ ఉద్యమాన్ని చేపట్టాడు. సర్ నిజామత్ జంగ్

డాక్టర్ ఆస్కర్ ఆలీఖాన్‌లు సహాయపడ్డారు. ఈ ప్రాంతంలో ఉద్యోగం చేయటానికి ఇక్కడ పదిహేను సంవత్సరాల నివాసం చేసి ఉండాలనే నియమం, స్వాతంత్ర్యం అనంతరం కూడా కొత్త శాసనాలు పాత శాసనాల స్థానం ఆక్రమించిన తరువాత కూడా యీ నిబంధన అమలులో వుంటు వచ్చింది. అందువల్ల ఉద్యోగాలలో యిక్కడివారికి అవకాశం దొరకాలని బయటివారి ప్రాధాన్యత కూడదని 1952లో ఉద్యమం జరిగింది. తీవ్రమైన ఆ ఆందోళనలో పోలీసు కాల్పులలో కొందరు చనిపోయిన తర్వాత ప్రభుత్వం కొన్ని చర్యలు గైకొన్నది. బయటినుంచి వచ్చిన అధికారులు దురుసుగా ప్రవర్తించటం, అక్రమ ప్రమోషన్లు పొందటం దీనికి ముఖ్య కారణం. పండిత నెహ్రూ పరుగెత్తుకుంటు హైదరాబాద్ వచ్చారు. ఫతే మైదానంలో ప్రజలకు హితవు చెప్పారు. "నేను అలహాబాద్‌లో జన్మించాను. ఇంగ్లాండులో చదువుకున్నాను. ఇప్పుడు ఢిల్లీలో వుంటున్నాను. ఇక చెప్పండి నేను ఏ ప్రాంతానికి చెందిన ముల్కీని." అని ఒక సమ్మోహనాస్త్రం వదిలారు. సర్దుబాటు జరిగింది. కాని లోలోన యీ నిప్పు రగుల్కొంటూనే వుంది.

## మనకు సాంస్కృతిక కేంద్రం లేదు

ఈ ముల్కీ ఉద్యమమే ఫజల్ అలీ కమీషన్ ముందు ప్రత్యేక తెలంగాణా రూపం దాల్చింది. నాటి హైదరాబాద్ రాష్ట్రంలోని మహారాష్ట్రీలు, కన్నడిగులు తాము కొత్తరాష్ట్రంలో చేరిపోతే తమకు రక్షణలు కావాలని కోరలేదు. దానికి స్వామీజీ, చాలా వరకు కారకుడు. భాషా ప్రయుక్త రాష్ట్రాలకు స్వామీజీ చేసిన సేవ చిరస్మరణీయమైనది. ఆయనను 'హైదరాబాద్ ప్రకాశం' అన్నారు శ్రీ సంజీవరెడ్డి. మహారాష్ట్రులు కన్నడిగులు పోతూపోతూ యీ ముల్కీ పదాన్ని మూసీలో వదిలిపోతే ఆ సంపదను తెలంగాణావారు వారసులైనారు. న్యాయవేత్త ఫజల్ అలీ, మేధావి ఫణిక్కర్, రాజకీయవేత్త కుంజ్రూలు ముల్కీ చరిత్రను అంగీకరించటానికి చారిత్రకమైన కొన్ని కారణాలున్నాయి. మహారాష్ట్రీలకు పూనే సాంస్కృతిక కేంద్రం. అలాగే కన్నడిగులకు బెంగుళూరు. ఆంధ్రులు చాలాకాలం నిజాంలోను, మద్రాసులోను ప్రభుత్వాధికారం లేకుండా ఉండిపోవటం వలన వారి సాంస్కృతిక కేంద్రాలైన వరంగల్, విజయవాడ గుంటూరులు ఆ స్థానాన్ని కోల్పోయాయి. కృష్ణదేవరాయలు విశాలాంధ్ర

వ్యక్తమైంది కాదు. [illegible] [illegible] ఉండగా [illegible] [illegible] [illegible] హైదరాబాదులో ఉంది. [illegible] [illegible] [illegible] కేంద్ర [illegible] [illegible] రెండు ప్రభుత్వాల [illegible] సమైక్యత కోరుకుంది. రెండు తెలుగు రాష్ట్రాల ఏర్పాటు శాస్త్రీయ దృక్పథంలోను పరిపాలనా సౌలభ్యం దృష్ట్యాను అవసరం యోగ్యమని చెప్పింది ఫజల్ అలీ కమీషన్. 5 ఏ సాధారణ ఎన్నికల తర్వాత అప్పటి శాసనసభ్యులలో మూడింట రెండువంతుల మంది అంగీకరించినట్లయితే రెండు రాష్ట్రాలను విలీనం చేసే అవకాశం ఉంచుకోవచ్చు అన్నది. అయితే పెద్దమనుషుల ఒప్పందంతో విలీకరణ పరిష్కార మార్గం లభించింది.

---

## 1-11-1956 కు పూర్వం భారతదేశ రాజకీయ విభాగాలు

**1. పార్టు 'ఏ' స్టేట్లు :-**

1. అస్సాం, 2. బీహారు, 3. బొంబాయి, 4. మధ్యప్రదేశ్, 5. ఉత్తర ప్రదేశ్, 6. ఆంధ్ర, 7. మద్రాసు, 8. ఒరిస్సా, 9. పశ్చిమ బెంగాల్, 10. తూర్పు పంజాబు.

**2. పార్టు 'బి' స్టేట్లు :-**

1. హైదరాబాద్, 2. జమ్మూ-కాశ్మీర్, 3. మైసూరు, 4. పాట్యాల మరియు తూర్పు పంజాబ్ స్టేట్సు యూనియన్, 5. రాజస్థాన్, 6. మధ్యభారత్, 7. సౌరాష్ట్ర, 8. తిరువాన్కూర్-కొచ్చిన్.

**3. పార్టు 'సి' స్టేట్లు :-**

అజ్మీర్, 2. భోపాల్, 3. వింధ్యప్రదేశ్. 4. కూర్గ్, 5. ఢిల్లీ, 6. హిమాచల్ ప్రదేశ్, 7. కచ్, 8. మణిపూర్, 9. త్రిపుర్.

**4. పార్టు 'డి' స్టేట్లు :-**

1. అండమాన్ నికోబార్, బ్లేర్ దీవులు.

---

# ఆంధ్రప్రదేశ్ నిర్మాతగా సంజీవరెడ్డి

"అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు,
ఓరుగల్లున రాజ వీరలాంఛనముగా
పటు శస్త్ర శాలలు నిలుపునాడు
విద్యానగర రాజవీథులన్ కవితకు
పెండ్లి పందిళ్ళు కప్పించునాడు,
పొట్నూరికి సమీపమున ఆంధ్రసామ్రాజ్య
దిగ్జయ స్తంభ మెత్తించునాడు,
ఆంధ్ర సంతతికే మహితాభిమాన
దివ్య దీక్షా సుఖస్ఫూర్తి దీపరించె
ఆ మహావేశ మర్ధించి యాంధ్రులార!
చల్లుడాంధ్రలోకమున నక్షతలు నేడు."

—రాయప్రోలు.

1956 నవంబరు ఒకటవ తేదీన వచ్చిన దీపావళి ఆంధ్రావళికి దివ్య దీపావళి అయినది. నూటాయాభై సంవత్సరాల తర్వాత తెలుగు ప్రజలంతా ఏకరాజ్యం క్రిందికి వచ్చారు. రాష్ట్రనాయకత్వానికి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ నీలం సంజీవరెడ్డి పోటీ పడ్డారు. భావకవిత్వపు లక్షణాలెక్కువ గల డాక్టర్ గోపాలరెడ్డి రాజకీయ ఎత్తుగడలకు వ్యూహాలకు ఎప్పుడు దూరంగానే ఉన్నా మంత్రిపదవి అనేది ఆయనను అంటిపెట్టుకొని ఉన్నట్లుగా మరెవరినీ-అంటిపెట్టుకొని ఉండలేదు. 1937 లో రాజాజీ మంత్రివర్గంలో చేరినప్పుడు ఆయనకు ముప్పై ఏళ్ళయినా పూర్తికాలేదు. భారతదేశంలో అప్పటికీ ఇప్పటికీ అంత చిన్న వయస్సులో మరొకరు మంత్రి కాలేదు. (సంజీవయ్య రాజాజీ మంత్రివర్గంలో చేరినప్పుడు ఆయన వయస్సు 22 సంవత్సరాలు) రామస్వామిరెడ్డియార్,

కుమారస్వామి రాజా మంత్రివర్గాలలోను పనిచేశారు. ఆయనతో పోటీచేసిన శ్రీ నీలం సంజీవరెడ్డికి ధైర్యం, సాహసం ప్రధాన లక్షణాలు. రెండుసార్లు లిజిస్లేచర్ పార్టీనాయకుడై ఉండికూడా ఒక మెట్టు దిగవలసి వచ్చింది. ఈసారి శ్రీ సంజీవ రెడ్డి గట్టిగా నిలబడ్డారు. ఆంధ్రరాష్ట్రమే ఉంచే యీ పోటీ ఎలా ఉండేదో చెప్పలేం. ఆంధ్రప్రదేశ్ నిర్మాణంతో తొమ్మిది జిల్లాల తెలంగాణా ఒక క్రొత్త శక్తిగా రూపొందింది.

శ్రీ కొండా వెంకట రంగారెడ్డి దూరాలోచనాపరుడు. నిజాయితీగల వ్యక్తిగా ప్రతీతి. ఆయన అభిప్రాయమేమంటే అద్దరి ఇద్దరి రెడ్లు పోటీ పడు తుంటే ఇక్కడివారు తటస్థంగా ఉండాలి. గెలిచినవారు తమవైపే వస్తారు. ఈ సలహా డాక్టర్ చెన్నారెడ్డి, శ్రీ జె. వి. నరసింగరావులకు నచ్చలేదు. డాక్టర్ చెన్నారెడ్డివర్గం డా॥ గోపాలరెడ్డిని బలపరచగా జె వి. వర్గం శ్రీ సంజీవరెడ్డిని బలపరచింది. బూర్గుల వర్గంకూడా శ్రీ సంజీవరెడ్డికే ఓటు చేసింది. ఫలితంగా నవరాష్ట్ర నిర్మాత స్థానాన్ని సంజీవరెడ్డి గెల్చుకొన్నారు.

సంజీవరెడ్డి మంత్రివర్గం : శ్రీ నీలం సంజీరెడ్డి (ముఖ్యమంత్రి) డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, కొండా వెంకట రంగారెడ్డి, కళా వెంకటరావు. ఎస్.బి.పి. పట్టాభిరామారావు, జె. వి. నరసింగరావు, వి. బి. రాజు, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, నవాబ్ మెహిదీ నవాజ్ జంగ్, డి. సంజీవయ్య, ఎం. నరసింగరావు, కె. బ్రహ్మా నందరెడ్డి, గ్రంథి వెంకటరెడ్డినాయుడు, అనగాని భగవంతరావు (మంత్రులు) శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు స్పీకరుగాను, శ్రీ కొండాలక్ష్మన్ బాపూజీ డిప్యూటీ స్పీకర్‌గాను ఎన్నికైనారు.

## కాంగ్రెసు తిరుగులేనిబలం

1957* లో తెలంగాణాకు మాత్రమే అసెంబ్లీ ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికల్లో ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్‌కు తిరుగులేనిబలం లభించింది. ఎన్ని కల అనంతరం అసెంబ్లీలో వివిధ పక్షాల బలాలు : యునైటెడ్ కాంగ్రెస్ లిజిస్లేచర్‌పార్టీ 213, కమ్యూనిస్టు - పి.డి.ఎఫ్. 37, నేషనలిస్టులు 19, సోష లిస్టుపార్టీ 18, పి. ఎస్. పి. 1, ఆంధ్రప్రజాపార్టీ 1, షెడ్యూల్డ్ కాస్టుస్ ఫెడ రేషన్1, ఇండిపెండెంట్లు 10, మొత్తం సీట్లసంఖ్య 300. 1956 నవంబరు1 వ

తేదీనుండి 195 జులై 31 తేదీ వరకు శ్రీ త్రివేది, 1957 ఆగష్టు నుండి 1962 సెప్టెంబరు 6 వరకు శ్రీ భీంసేన్ సచార్ రాష్ట్ర గవర్నర్లుగా పనిచేశారు. 1957 లో హైదరాబాద్ ప్రదేశ్ కాంగ్రెస్ రద్దయిపోయి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ ఏర్పడింది. దానికి శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు అధ్యక్షులైనారు. 1958 ఏప్రిల్‌లో డా॥ బెజవాడగోపాలరెడ్డి కేంద్రంలో ఆర్థికశాఖ సహాయ మంత్రిగా నియమితులై ఢిల్లీకి వెళ్ళిపోయారు. 1959 మార్చి 6 వ తేదీన ఎన్నికల కమీషన్ ఇచ్చిన తీర్పుపై శ్రీ వి. బి. రాజు మంత్రిపదవికి రాజీనామా చేశారు.

1957 మార్చి 2( వ తేదీన భద్రాచలంవద్ద గోదావరీ పడవ ప్రమాదంలో 200 మంది మరణించారు.

## అల్పసంఖ్యాకులకు అభయం

క్రొత్తప్రభుత్వం క్రింద అల్పసంఖ్యాకవర్గాలకు తెలంగాణా ప్రాంతపు ప్రభుత్వోద్యోగులకు ఏవిధమైన నష్టాలు రావని, ఏకీకరణ సూత్రాలు చర్చించినప్పుడు నాయకుల మధ్య జరిగిన ఒప్పందం అక్షరాల అమలు జరుగగలదని హామీ యిస్తూ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి 1956 నవంబర్ 1వ తేదీన హైదరాబాద్ రేడియోలో ప్రసంగించారు. అందుకు ప్రథమ చర్యగా ఉర్దూభాషకు ప్రాంతీయ భాషాస్థానం లభించింది. విజ్ఞానశాస్త్రం-చరిత్రలో పరిశోధనలు జరప దానికి ఉర్దూ-తెలుగు అకాడమీ నెలకొన్నది. తెలంగాణాలో ముఖ్యంగా హైదరాబాద్‌లో ఉన్న ఉర్దూ బోధన మాధ్యమం గల పాఠశాలలు కొనసాగినాయి. లుతుఫుద్దౌలా ఓరియంటల్ ఇన్స్టిట్యూట్, మజ్లిస్ - ఎ - అదబియాత్ ఉర్దూ మున్నగు పరిశోధనా సంస్థలకు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల సహాయం లభించే టట్లు చర్యలు తీసుకొనిబడినవి.

## విధానపరిషత్ అవతరణ

1957 సెప్టెంబరులో లెజిస్లేటివ్ కౌన్సిల్ చట్టాన్ని ఆమోదిస్తూ 90 సీట్లతో విధానపరిషత్తు ఏర్పాటు చేసుకోడానికి పార్లమెంటు అవకాశం కల్పించింది. మొత్తం 90 సీట్లలో స్థానిక సంస్థల నియోజక వర్గాలనుండి 31 మంది, పట్టభద్రుల నియోజక వర్గాలనుండి 8 మంది, ఉపాధ్యాయ నియోజకవరాలనుండి

6 మంది, విధానసభ సభ్యులచేత 31 మంది ఎన్నిక కావాలని, గవర్నర్ నామి నేషన్‌చేత 12 మందిని నియమించవలసి ఉంటుందని పార్లమెంటు నిర్దేశించింది. దీన్ని 1959 జూలై 7 వ తేదీన రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ ప్రారంభిం చారు. ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు ఎగువసభ అధ్యక్షులైనారు. తెలంగాణాలోని అనేక సాహిత్య సాంస్కృతిక ఉద్యమాలకు మూలపురుషులు మాడపాటి వారే. ఎందరో తెలుగువారిని రాజకీయాలలో ప్రవేశపెట్టింది కూడా వారే. పోలీసు చర్య తర్వాత హైదరాబాద్ పురపాలక సంఘానికి మేయర్‌గా ఎన్నికైన మాడపాటివారికి ఇది రెండవ 'గురుకట్న'మైంది. విధానసభలో సీటు దొరకని అసంతృప్తివాదులకు విధానపరిషత్ స్థానమైనది.

## సర్వతోముఖమైన రాష్ట్రాభివృద్ధి

ముఖ్యమంత్రిగా శ్రీ నీలం సంజీవరెడ్డి ఉక్కుహస్తంతో రాష్ట్రాన్ని పరి పాలించారు. రాష్ట్రాభివృద్ధికి అనేక చర్యలు గైకొన్నారు. 1957 ఆగష్టు 7వ తేదీన సాహిత్య అకాడమీ, డిసంబర్ 26న సంగీత నాటక అకాడమీలు ప్రారం భించబడ్డాయి. సనత్‌నగర్ ప్రాంతాన్ని పారిశ్రామిక వాడగా మార్చారు. కాల్‌టెక్స్ నూనె శుద్ధి కర్మాగారం విశాఖపట్టణంలో పనిచేయడం మొదలు పెట్టింది. అధికార వికేంద్రీకరణ చట్టాన్ననుసరించి రాష్ట్రంలో పంచాయతీ రాజ్ శాఖ ఏర్పడి అది స్థానిక నాయకత్వానికి దోహదపడింది.

## డెమోక్రాటిక్ ఫ్రంట్

శ్రీ సంజీవరెడ్డిని వ్యతిరేకించిన తిరుగుబాటు కాంగ్రెస్‌వాదులంతా కలసి డెమోక్రటిక్ ఫ్రంట్ పెట్టుకొన్నారు. దానికి డాక్టర్ మర్రి చెన్నారెడ్డి నాయకుడు. ఖమ్మం నుండి శ్రీ బొమ్మకంటి సత్యనారాయణ, వరంగల్‌నుండి శ్రీ టి. హయ గ్రీవాచారి, నిజామాబాద్ నుండి శ్రీ శ్రీనివాసరావు కృష్ణానుండి శ్రీ కాకాని వెంకటరత్నం, శ్రీకాకుళంనుండి శ్రీ గౌతు లచ్చన్న, గుంటూరునుండి శ్రీ మంథెన వెంకటరాజు, జాగీర్లమూడి చంద్రమౌళి, కర్నూలునుండి శ్రీ కందుల ఓబులరెడ్డి ఈ పార్టీలో చేరిపోయారు. తర్వాత సోషలిష్టుపార్టీ నాయకుడు శ్రీ పి. వి. జి. రాజు చేరారు.

1959 లో స్వతంత్రపార్టీ పుట్టింది. డిమోక్రటిక్ ఫ్రంట్ లోని రంగా

గారి వర్గం ఇందులో చేరిపోయింది. శ్రీ పి. వి. జి. రాజుకు మంత్రి పదవి ఇచ్చి అందులో నుంచి అతన్ని వేరు చేసారు ముఖ్యమంత్రి. శ్రీ సంజీవరెడ్డి రాష్ట్రం నుంచి వెళ్ళిపోగానే కాకాని, డాక్టర్ చెన్నారెడ్డి ప్రభృతులు కాంగ్రెస్‌లో తిరిగి చేరిపోయారు. హైదరాబాద్‌లో ఆచార్య రంగా జన్మదిన సందర్భంలో ఏర్పాటైన సభలో రాజాజీ ఉపన్యాసాన్ని డాక్టర్ చెన్నారెడ్డి అనువదించి స్వతంత్రపార్టీలో చేరిపోతారని అపోహ కల్పించారు. కానీ చేరలేదు.

## అనర్ఘ మణులు రాలిపోయారు

దాదాపు అర్ధశతాబ్దం తెలుగుదేశమే తానుగా, తానే తెలుగుదేశంగా జీవించిన ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం 1957 మే 20వ తేదీన కన్ను మూసారు. తెలుగుదేశం కన్నీరు మున్నీరుగా రోదించింది. అపర చాణుక్యుడని పేరు తెచ్చుకొన్న శ్రీ కళా వెంకటరావు 1959 మార్చి 28వ తేదీన చని పోయారు. మధ్యప్రదేశ్ గవర్నరుగా పదవీ విరమణ చేసి విశ్రాంతి జీవితం గడుపుకుంటున్న మహామేధావి డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య 1959 డిసంబర్ 17న మరణించారు. అనేక ఉద్యమాలలో గాంధీజీకి నమ్మినబంటుగా నిలచిన డాక్టర్ పట్టాభి కీర్తి 'కాంగ్రెసు చరిత్ర' అనే గ్రంథంతో చిరస్థాయిగా నిలిచిపోయింది.

## ఉద్యోగులు

ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వం ఆంధ్ర-తెలంగాణా ప్రభుత్వ పద్ధతులు వేరు. ఆంధ్రపద్ధతి మద్రాసులో అమలులో ఉండే టాటెన్ హాం కోడ్ ప్రకారం జరిగేది. హైదరాబాద్‌లో బొంబాయిపద్ధతి అమల్లో ఉంది. 1956 నవంబరు ఒకటినించి అకస్మాత్తుగా ఆంధ్రప్రదేశ్‌లో మద్రాసుపద్ధతి అమలులోకి వచ్చింది. తెలంగాణాలో మిగిలిపోయిన హైదరాబాద్ ఉద్యోగస్థులకు యీ పద్ధతి తెలియదు. తెలుసుకోవడానికి గ్రంథాలు లేవు. రెండు కలిపే ముందు ఆ కోడ్ సవరణలతో సహా మళ్ళీ అచ్చువేసి, తెలంగాణా ఉద్యోగస్థులకు సరఫరా చేసి, ఆ కోడ్ ప్రకారం వారికి కొంతకాలం తర్ఫీదు ఇవ్వాలని ఎవరికి తోచలేదు. వారు బాధ్యులుకాని అజ్ఞానానికి తెలంగాణా ఉద్యోగస్థులు బాధపడవలసి వచ్చింది.

1958 మార్చి 18వ తేదీన ప్రభుత్వం తెలంగాణా ఉద్యోగుల 'గ్రీవియెన్సెస్ ఎంక్వైరీ కమిటీ' నియమించింది.

## అ. భా. కాం. అధ్యక్షపదవి

1959 నవంబరు నెలలో ప్రధాని నెహ్రూ హైదరాబాద్ పర్యటనకొచ్చినప్పుడు ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి పరిపాలనా సామర్థ్యానికి ముగ్ధులైనారు. అఖిలభారత కాంగ్రెసు కమిటీ అధ్యక్షపదవినుండి శ్రీమతి ఇందిరాగాంధీ విరమించబోతున్న సమయమది. ఆ స్థానంలో శ్రీ సంజీవరెడ్డిని కూర్చోపెట్టితే దక్షిణాదిలో స్వతంత్రపార్టీ బలాన్ని అరికట్ట వచ్చుననుకొన్నారు నెహ్రూ.

1951 లో అఖిలభారత కాంగ్రెసు కమిటీ సర్దార్ పటేల్ – నెహ్రూ ముఠాలుగా చీలిపోయినప్పుడు శ్రీ కళా వెంకటరావు పటేల్ ముఠాను బలపరచగా ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షుని హోదాలో శ్రీ సంజీవరెడ్డి నెహ్రూ ముఠాను బలపరిచారు. 1960 జనవరి 14వ తేదీన బెంగళూరులో జరిగిన అఖిలభారత కాంగ్రెసు మహాసభకు శ్రీ సంజీవరెడ్డి అధ్యక్షులుగా ఎన్నికైనారు. స్వరాజ్యం వచ్చిన తర్వాత కాంగ్రెసు అధ్యక్షపదవి అలంకార ప్రాయం మాత్రమే. ముఖ్యమంత్రి పదవితో పోల్చితే తీసికట్టు. త్యాగాలు చేయడం శ్రీ సంజీవరెడ్డికి క్రొత్త విషయం కాదు. 1951లో ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీ చేసినప్పుడే మంత్రి పదవిని వదులుకొన్నారు. ఇప్పుడు అఖిలభారత కాంగ్రెసు కమిటీ అధ్యక్షపదవి స్వీకరించడానికై ముఖ్యమంత్రి పదవికి రాజీనామా ఇవ్వడానికి సిద్ధపడ్డారు. కొందరు గొప్పవారుగా పుట్టుతారు. కొందరిపై గొప్పతనం రుద్దబడుతుంది. కొందరు కష్టపడి గొప్పవారౌతారు. శ్రీ సంజీవరెడ్డి మొదటి రెండూ స్థానాలకు చెందినవారు కాక కష్టపడి గొప్పవారైన వ్యక్తి.

## వారసుడు ఎవరు?

ముఖ్యమంత్రి పదవి ఖాళీ కాగానే వారసత్వపు తగాదాలు ప్రారంభమైనవి. ముఖ్యమంత్రిని నియమించే సత్తా శ్రీ సంజీవరెడ్డి కున్నది. అధిష్ఠానవర్గంతో సంప్రదింపులు జరిపారు. తెలంగాణా నాయకుడైన శ్రీ కె. వి. రంగారెడ్డి వైపు అధిష్ఠానవర్గం ఉన్నట్లు వార్తలందాయి. కేరళ గవర్నరుగా ఉన్న డా॥ బూర్గుల రామకృష్ణారావును రంగంలోకి దింపాలని ఒక అభిప్రాయం కలిగింది. ఈ

పదవికి డా॥ గోపాలరెడ్డి కూడా పోటీపడ్డారు కనుక ఆయనను పిలపించమని సలహాఇచ్చి తాను దూరంగా ఉండిపోయారు బూర్గుల. శ్రీ బ్రహ్మానందరెడ్డి పేరు కూడా వినిపించింది. కాని ఢిల్లీనుండి వచ్చిన శ్రీ సంజీవరెడ్డి ఏ ప్రకటన చేయలేదు. డాక్టర్ గోపాలరెడ్డి ఉత్సాహం చూపలేదు. ముగ్గురు సీనియర్ నాయకులలో ఇద్దరైన డాక్టర్ గోపాలరెడ్డి, డా॥ బూర్గుల రామకృష్ణారావు రాష్ట్ర రాజకీయాల నుంచి శాశ్వతంగా దూరమైపోయారు.

———

*ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి శాసన సభ్యుల సంఖ్య 301 గా నిర్ణయించబడింది. అయితే ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు ఆంధ్ర శాసన సభ్యులసంఖ్య 196 మంది. హైదరాబాద్ శాసనసభలోని తెలంగాణా సభ్యుల సంఖ్య 101 మంది. మొత్తం 297 మంది సభ్యులతో నూతన శాసనసభ ప్రారంభమైంది.

ఈ శాసన సభ్యులలో ఆయా పార్టీలకు చెందిన సంఖ్యాబలం వివరాలు యివి :

కాంగ్రెస్ 197; పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్ - కమ్యూనిస్టుపార్టీ 49 సోషలిస్టుపార్టీ 25; షెడ్యూల్డు కులాల ఫెడరేషన్ 5; స్వతంత్రులు 21 మంది.

———

# ముఖ్యమంత్రిగా సంజీవయ్య

"గోదావరీ పావనోదార వాఃపూర
మఖిల భారతము మాదన్ననాడు
తుంగభద్రా సముత్తుంగ రావముతోడ
కవుల గానము శ్రుతి గలయునాడు
పెన్నానదీ సముత్పన్న కైరవదళ
శ్రేణిలో తెన్గు వాసించునాడు
కృష్ణా తరంగ నిర్ణిద్ర గానముతోడ
శిల్పము తొలిపూజ సేయునాడు
అక్షరజ్ఞాన మెఱుగదో యాంధ్రజాతి
విమల కృష్ణానదీ సైకతములయందు
కోకిలపు బాట పిచ్చుక గూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు !"

—విశ్వనాథ.

ఆంధ్ర రాజకీయ రంగంలో ఒక మెరుపుతీగలా ప్రకాసించిన శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు 1938 నుండి అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సభ్యులు. ఆయనకు భారత రాజకీయ రంగంలో ఉజ్జ్వల భవిష్యత్తు లభించగలదని ఆశించే వారు డాక్టర్ పట్టాభి. శ్రీ సంజీవరెడ్డి అఖిలభారత రాజకీయరంగంలో ప్రవేశించ గానే ముఖ్యమంత్రి పదవి తనకు రావాలన్నారు శ్రీ అల్లూరి. శ్రీ సంజీవరెడ్డి తొలి విజయాలకు కొంత కారకుడైన శ్రీ అల్లూరి ఆ పదవిని కోరడం సహజమే. ఆయనది ప్రచండ ప్రచారం. నలుగుర్ని పోగు చేసుకొనే విద్య శ్రీ అల్లూరికి అరచేతిలోని ఉసరిక. తెలంగాణా మిత్రులతో క్రొత్త స్నేహం కలిపినారు. మంత్రి కాని అల్లూరిని ఎకాయకి ముఖ్యమంత్రిగా చేయడం అనుభవజ్ఞులైన పెద్దలకు యిష్టంగా లేదు. రాజకీయ కిటుకులన్నీ బాగా ఎరిగిన శ్రీ అల్లూరి తన తరఫున శ్రీ ఎన్. బి. పి. పట్టాభిరామారావు, శ్రీ సంజీవయ్యలను రంగంలోకి

దించారు. ఆయన ప్రచారానికి శ్రీ సంజీవరెడ్డి తాత్కాలికంగా లొంగిపోవలసి వచ్చింది. నలభై ఏళ్ళు నిండీ నిండని శ్రీ సంజీవయ్యను ముఖ్యమంత్రిగా అంతా అంగీకరించారు. తొలి హరిజన ముఖ్యమంత్రిని ఎంచుకొన్న గౌరవం ఆంధ్ర ప్రదేశ్‌కు లభించింది.

## సంజీవయ్య మంత్రివర్గం

శ్రీ దామోదరం సంజీవయ్య ముఖ్యమంత్రిగా ఏర్పడిన మంత్రివర్గంతో శ్రీ కొండా వెంకటరంగారెడ్డి (ఉపముఖ్యమంత్రి), శ్రీయుతులు అల్లూరి సత్య నారాయణరాజు, ఎన్.బి.పి. పట్టాభిరామారావు, పిడతలరంగారెడ్డి, కల్లూరి చంద్ర మౌళి, కాసు బ్రహ్మానందరెడ్డి, మందుముల నరసింగరావు, పి.వి.జి. రాజు, నూకల రామచంద్రారెడ్డి, ఏ.సి. సుబ్బారెడ్డి, కొండాలక్ష్మన్ బాపూజీ, ముళ్ళ పూడి పళ్ళంరాజు, శ్రీమతి మాసూమా బేగమ్ (సభ్యులు). 1960 జనవరి 10 వ తేదీన సంజీవయ్య మంత్రివర్గం ప్రమాణ స్వీకారం చేసింది. శ్రీ పిడతల రంగా రెడ్డి మంత్రివర్గంలో చేరిపోవడం వలన శ్రీ నూకల నరోత్తమరెడ్డి ప్రదేశ్‌కాంగ్రెస్ అధ్యక్షులైనారు. ఈ మంత్రివర్గంలో శ్రీ సంజీవరెడ్డి అనుకూల వ్యతిరేకవర్గాలు కలసిపోయాయి.

## ఎగుడు దిగుళ్లు

అధికారంలో ఉన్న ఇరవయ్యేడు నెలల సంజీవయ్య మంత్రివర్గం ఎగుడు దిగుళ్ళతోనే నడిచింది. ఇంతవరకు రాజకీయాలలో సంజీవయ్య వర్గమంటూ ఏదీలేదు. మంత్రిగా ఉన్నప్పుడు 'జెంటల్‌మెన్ - మినిష్టర్'గా పేరు తెచ్చు కొన్న శ్రీ సంజీవయ్య ముఖ్యమంత్రికాగానే ఒక వర్గాన్ని కూడగట్టుకొనవలసిన పరిస్థితులు అవసరమై పూర్తిగా శ్రీ అల్లూరిపై ఆధారపడి పోయారు. రాజకీయా లలో మూడు వర్గాలు తలెత్తాయి. 1. సంజీవరెడ్డి వ్యతిరేకవర్గం, 2. అధికార దాహంగల వర్గం. 3. వెనుకబడ్డ కులాలవర్గం, సంజీవయ్య ముఖ్యమంత్రి కావటంతో సంజీవరెడ్డి ముఠా అసమ్మతివర్గమైంది.

పెద్దమనుషుల ఒప్పందాన్ని శ్రీ సంజీవయ్య అమలు పరచటానికి ప్రయత్నించి తెలంగాణా నాయకులకు ఉపముఖ్యమంత్రి పదవి, ప్రదేశ్‌కాంగ్రెస్ అధ్యక్షపదవు లిచ్చినా అవి ముఠా తగాదాల వరకే ఉండిపోయాయి. ముఖ్య

మంత్రి పాక్షికపై ఖరితో చేసిన పనులు ఉపముఖ్యమంత్రికి నచ్చలేదు. కొన్ని కోర్టులకు వెళ్ళి రద్దయినాయి. మరోకొన్నింటిని తర్వాత ముఖ్యమంత్రులైన సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి రద్దు పరిచారు. తాను తెచ్చుకొన్న ఏ. సి. సుబ్బారెడ్డి బాహాటంగానే యుద్ధానికి దిగాడు. మంత్రివర్గంలోనే "యూనిటీ ఫ్రంట్"ని స్థాపించారు. శ్రీ బ్రహ్మానందరెడ్డి శ్రీ పి వి.జి. రాజు, శ్రీ కొండాలక్ష్మన్, ఏ.సి. ఈ ముఠాలో చేరిపోయారు. ఈ ముఠాకు అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులైన శ్రీ సంజీవరెడ్డి సంపూర్ణ సహకారం లభించింది.

## ఎలక్షన్ కమీషన్ గొడవలు

ఆ సమయంలో వచ్చిన ఎన్నికల్లో అభ్యర్థుల్ని నిర్ణయించడానికి ఒక కమీషన్ నియమించవలసి వచ్చింది. ఈ కమిటీలో శ్రీ అల్లూరి తన వర్గంవారికే ఎక్కువ స్థానాలిచ్చారని చెప్పి యూనిటీ ఫ్రంట్ అధిష్ఠానవర్గానికి ఫిర్యాదు జేసింది. అదను చూసి శ్రీ అల్లూరిపై దెబ్బతీయటానికి సిద్ధంగా ఉన్న శ్రీ సంజీవరెడ్డి కిది మంచి అవకాశ మిచ్చింది. ఈ కమిటీలో తన పేరు లేనందుకు శ్రీ ఏ.సి. సుబ్బారెడ్డి పెద్ద అల్లరి చేసారు. ముఖ్యమంత్రి, ఏ. సి. ఒకర్నొకరు పార్లమెంటరీ సాంప్రదాయానికి విరుద్ధమైన పరిభాషలో దూషించుకొన్నారు. ఏ. సి. శక్తివంతుడైన నాయకుడు స్థాన బలం కలిగిన వ్యక్తి ఈ తగాదాలో పడి తన మంత్రి పదవిని కోల్పోయారు.

అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షులైన సంజీవరెడ్డి ఎలక్షన్ కమీషన్ ఎన్నికలను నిబంధనావళి ప్రకారం జరిపించ లేదనే సాకుతో ఎన్నికలను రద్దు చేయించారు. కొత్తగా కమీషన్ ఎన్నికలు జరిపించ వలసిందని ఆంధ్రప్రదేశ్ వ్యవహారాలు చూస్తున్న శ్రీ పంత్ ద్వారా ఆదేశాలు పంపించారు. పొంచి ఉన్న శక్తుల కేంద్రీకరణ కిది మంచి అవకాశం కల్పించింది. ఎన్నికల కమిటీని యూనిటీ ఫ్రంట్ వారు హస్తగతం జేసుకున్నారు.

## నూకల సోదరులకు పెరిగిన ప్రాధాన్యం

శ్రీ సంజీవ రెడ్డి హయాంలో నూకల సోదరుల కెక్కువ ప్రాధాన్యం లభించలేదు. శ్రీ సంజీవయ్య హయాంలో వారికి అధికప్రాధాన్యం ఇచ్చి శ్రీ జె. వి. నరసింగరావును పూర్తిగా విస్మరించడంతో తెలంగాణా రాజకీయాలలో

సెలం సంజీవరెడ్డి చేసిన పొరపాటే శ్రీ సంజీవయ్య చేసారు. శ్రీ సూకల రామ చంద్రారెడ్డి మంత్రి అయినప్పుడు ఆయన సోదరుడైన శ్రీ నరోత్తమ రెడ్డికే ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవి ఎందుకు ఇవ్వాలని ప్రశ్నించిన వారిలో తెలంగాణా నాయకులైన శ్రీ కె. వి. రంగారెడ్డి, శ్రీ జె. వి. నరసింగరావు శ్రీ. వి. బి. రాజు ప్రధాన పాత్ర వహించారు.

## గ్రేటర్ హైదరాబాద్ కార్పొరేషన్

అంత వరకు విడి విడిగా ఉన్న హైదరాబాద్ సికింద్రాబాద్ పురపాలక సంఘాలు 1960 ఆగష్టు 3వ తేదీన లీనమై గ్రేటర్ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌గా ఏర్పడింది. దీనితో మునిసిపల్ ఎన్నికలు జరుపవలసి వచ్చింది. మంత్రి శ్రీ పి. వి. జి. రాజు అధ్యక్షతన ఒక సివిల్ బోర్డు ఏర్పడింది. సివిల్ బోర్డు సూచించిన కొన్ని పేర్లను ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు మార్పు చేయడంతో శ్రీ పి. వి. జి. రాజు, శ్రీ నరోత్తమరెడ్డి మధ్య వివాదం హెచ్చింది. ఈ విధంగా శ్రీయుతులు జె. వి ; పి. వి. జి.; వి. బి.; నరోత్తమరెడ్డికి వ్యతిరేకంగా చేతులు కలపడంతో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవినుంచి శ్రీ నరోత్తమ రెడ్డి తప్పుకొనవలసి వచ్చింది. ఆయన స్థానంలో మంత్రి పదవికి రాజీనామాచేసి శ్రీ ముళ్లపూడి పళ్ళంరాజు. 1961 మార్చి 3వ తేదీన ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులైనారు. ట్రాన్సు పోర్టుకేసులో హైకోర్టు తీర్పు వ్యతిరేకంగా రావడంవలన పట్టాభి రామారావు 1961 ఫిబ్రవరి 22వ తేదీన మంత్రి పదవికి రాజీనామా చేసారు.

## రాజకీయాలలో నెగ్గుతూ వచ్చిన సాహితీవేత్త

సాధారణంగా రాజకీయ వేత్తలు సాహితీ ప్రియత్వానికి ఆమడ దూరం. కానీ మన రాష్ట్రంలో రాణించిన సాహితీ వేత్తలైన రాజకీయ నాయకుల్లో శ్రీ సంజీవయ్య ఒకరు. పద్యాలతో పాటలతో ఉపమానాలతో పదమాధుర్యంతో ఆయన ఉపన్యాసం కవితవలె కొనసాగేది. 1960 మే 6వ తేదీన అఖిల భారత తెలుగు రచయితల సమావేశాన్ని హైదరాబాద్‌లో రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ ప్రారంభించారు. 1961 నవంబర్ 1వ తేదీన లలితకళా అకాడమీ ప్రారంభించబడింది. నిండైన దేశ భక్తితో సంజీవయ్యగా రెత్తిన సాహిత్య నీరాజనాలివి.

## మూడవ సార్వత్రిక ఎన్నికలు – ప్రముఖుల ఓటమి

1962 ఫిబ్రవరి 19వ తేదీన రాష్ట్రంలో మూడవ సార్వత్రిక ఎన్నికలు

నీలం సంజీవరెడ్డి చేసిన పొరపాటే శ్రీ సంజీవయ్య చేసారు. శ్రీ నూకల రామచంద్రారెడ్డి మంత్రి అయినప్పుడు ఆయన సోదరుడైన శ్రీ నరోత్తమ రెడ్డికే ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవి ఎందుకు ఇవ్వాలని ప్రశ్నించిన వారిలో తెలంగాణా నాయకులైన శ్రీ కె. వి. రంగారెడ్డి, శ్రీ జె. వి. నరసింగరావు శ్రీ. వి. బి. రాజు ప్రధాన పాత్ర వహించారు.

## గ్రేటర్ హైదరాబాద్ కార్పొరేషన్

అంత వరకు విడి విడిగా ఉన్న హైదరాబాద్ సికింద్రాబాద్ పురపాలక సంఘాలు 1960 ఆగష్టు ౬వ తేదీన లీనమై గ్రేటర్ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌గా ఏర్పడింది. దీనితో మునిసిపల్ ఎన్నికలు జరుపవలసి వచ్చింది. మంత్రి శ్రీ పి. వి. జి. రాజు అధ్యక్షతన ఒక సివిల్ బోర్డు ఏర్పడింది. సివిల్ బోర్డు సూచించిన కొన్ని పేర్లను ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు మార్పు చేయడంతో శ్రీ పి. వి. జి. రాజు, శ్రీ నరోత్తమరెడ్డి మధ్య వివాదం హెచ్చింది. ఈ విధంగా శ్రీయుతులు జె. వి ; పి. వి. జి.; వి. బి.; నరోత్తమరెడ్డికి వ్యతిరేకంగా చేతులు కలపడంతో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవినుంచి శ్రీ నరోత్తమ రెడ్డి తప్పుకొనవలసి వచ్చింది. ఆయన స్థానంలో మంత్రి పదవికి రాజీనామాచేసి శ్రీ ముళ్లపూడి పళ్ళంరాజు. 1961 మార్చి ౬వ తేదీన ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులైనారు. ట్రాన్సుపోర్టుకేసులో హైకోర్టు తీర్పు వ్యతిరేకంగా రావడంవలన పట్టాభి రామారావు 1961 ఫిబ్రవరి 22వ తేదీన మంత్రి పదవికి రాజీనామా చేసారు.

## రాజకీయాలలో నెగ్గుతూ వచ్చిన సాహితీవేత్త

సాధారణంగా రాజకీయ వేత్తలు సాహితీ ప్రియత్వానికి ఆమడ దూరం. కానీ మన రాష్ట్రంలో రాణించిన సాహితీ వేత్తలైన రాజకీయ నాయకుల్లో శ్రీ సంజీవయ్య ఒకరు. పద్యాలతో పాటలతో ఉపమానాలతో పదమాధుర్యంతో ఆయన ఉపన్యాసం కవితవలె కొనసాగేది. 1960 మే 6వ తేదీన అఖిల భారత తెలుగు రచయితల సమావేశాన్ని హైదరాబాద్‌లో రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ ప్రారంభించారు. 1961 నవంబర్ 1౬వ తేదీన లలితకళా అకాడమీ ప్రారంభించబడింది. నిండైన దేశ భక్తితో సంజీవయ్యగా రెత్తిన సాహిత్య నీరాజనాలివి.

## మూడవ సార్వత్రిక ఎన్నికలు - ప్రముఖుల ఓటమి

1962 ఫిబ్రవరి 19వ తేదీన రాష్ట్రంలో మూడవ సార్వత్రిక ఎన్నికలు

ఆచార్యరంగా ఒకరు. ఆయనకు మొదటి నుంచి కమ్యూనిస్టులతో పెండు భోజనం అంటే గిట్టదు. పదవీ వ్యామోహం లేని అఖిల భారత నాయకుల్లో ఆయన ఒకరు. 1948 లో పండిత నెహ్రూ కేంద్ర వ్యవసాయ మంత్రిగా ఆహ్వానించినా, 1952 లో రాజాజీ మద్రాసు ఉప మంత్రిగా ఉండవె పొమ్మన్నా, 1953 లో కర్నూల్‌లో తనతో పాటు మంత్రి వర్గంలో చేర మనమని ప్రకాశంగారు బలవంతం జేసినా ఆయనందుకంగీకరించలేదు, ఆచార్యరంగా గురించి సుప్రసిద్ధ పాత్రికేయుడు ఖాసా సుబ్బారావు ఒక మాట చెప్పారు. 'రంగాకు మొదటి స్థానం రాదు : రెండో స్థానం ఆయన అంగీకరించరు అని.' ఏ పదవిలోనూ ఆయన ఇమడలేకపోవడానికి ఈ లక్షణమే కొంత కారణమై ఉంటుంది. 1947 నుంచి 1951 వరకు అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా ఉన్న ఆచార్య రంగా ఏనాడూ ఆంధ్ర శాసన సభ్యులు కారు.

స్వతంత్ర పార్టీలో కూడా ఆయనకు ప్రథమ స్థానం లాంఛన మాత్రం గాని వాస్తవంకాదు. ప్రథమ స్థానం రాజగోపాలాచారి గారిది. ద్వితీయ స్థానం మసానిది. ఆ తరువాత స్థానం రంగా గారిది. ఆ పార్టీని నడిపించిన వారు రాజాజీ. నడిపిన వారు మసాని. కనిపించినవారు రంగాజీ.

1972 లో రంగాగారు కాంగ్రెస్ పార్టీలో తిరిగి ప్రవేశించారు.

## సంజీవరెడ్డి పునరాగమనం

ఎన్నికల తరువాత శ్రీ నీలం సంజీవరెడ్డి రాష్ట్ర రాజకీయాలలో తిరిగి ప్రవేశించి మళ్లీ ముఖ్యమంత్రి అయినారు. సంజీవరెడ్డి మంత్రివర్గం :— శ్రీ నీలం సంజీవరెడ్డి (ముఖ్యమంత్రి), శ్రీయుతులు నూకల రామచంద్రారెడ్డి, కాసు బ్రహ్మానందరెడ్డి, పి. వి. జి. రాజు, ముక్కపాటి పద్మరాజు, డాక్టరు మర్రి చెన్నారెడ్డి నవాబ్ మీర్ అహమద్ అలీఖాన్, శివరామ ప్రసాద్. ఎం. ఎస్. లక్ష్మీనరసయ్య (కేబినెటు హోదా మంత్రులు), శ్రీయుతులు ఎం. ఆర్. అప్పారావు, పి.వి. నరసింహారావు, ఆలపాటి వెంకటరామయ్య బి. వి. గురుమూర్తి, శ్రీమతి సదాలక్ష్మి (స్టేటు మంత్రులు). స్టేటు మంత్రులుగా వచ్చిన వారంతా కొత్తవారే. మంత్రి వర్గ సమావేశంలో వీరు పాల్గొనరు. అయితే వారికి సంబంధించిన శాఖల విషయాలు గైకొనే సమయంలో వీరిని మంత్రివర్గ సమావేశానికి ఆహ్వానిస్తారు.

ఆచార్యరంగా ఒకరు. ఆయనకు మొదటి నుంచి కమ్యూనిస్టులంటే పెద్ద భూస్వామ్యం అంటే గిట్టదు. పదవీ వ్యామోహం లేని అఖిల భారత నాయకుల్లో ఆయన ఒకరు. 1948 లో పండిత నెహ్రూ కేంద్ర వ్యవసాయ మంత్రిగా ఆహ్వానించినా, 1952 లో రాజాజీ మద్రాసు ఉప మంత్రిగా ఉండమని కోరుతున్నా, 1953 లో కర్నూల్‌లో తనతో పాటు మంత్రి పదవిలో చేర మనమని ప్రకాశంగారు ఒత్తిడి వంతం జేసినా ఆయనందుకంగీకరించలేదు. ఆచార్యరంగా గురించి సుప్రసిద్ధ పాత్రికేయుడు ఖాసా సుబ్బారావు ఒక మాట చెప్పారు. 'రంగాకు మొదటి స్థానం రాదు : రెండో స్థానం ఆయన అంగీకరించడు అని.' ఏ పదవిలోనూ ఆయన ఇముడలేకపోవడానికి ఈ లక్షణమే కొంత కారణమై ఉంటుంది. 1947 నుంచి 1951 వరకు అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా ఉన్న ఆచార్యరంగా ఏనాడూ ఆంధ్ర శాసన సభ్యులు కారు.

స్వతంత్ర పార్టీలో కూడా ఆయనకు ప్రథమ స్థానం లాంఛన మాత్రం గాని వాస్తవం కాదు. ప్రథమ స్థానం రాజగోపాలాచారి గారిది. ద్వితీయ స్థానం మసానిది. ఆ తరువాత స్థానం రంగా గారిది. ఆ పార్టీని స్థాపించిన వారు రాజాజీ. నడిపిన వారు మసాని. కనిపించినవారు రంగాజీ.

1972 లో రంగాగారు కాంగ్రెస్ పార్టీలో తిరిగి ప్రవేశించారు.

## సంజీవరెడ్డి పునరాగమనం

ఎన్నికల తరువాత శ్రీ నీలం సంజీవరెడ్డి రాష్ట్ర రాజకీయాలలో తిరిగి ప్రవేశించి మళ్లీ ముఖ్యమంత్రి అయినారు. సంజీవరెడ్డి మంత్రివర్గం :— శ్రీ నీలం సంజీవరెడ్డి (ముఖ్యమంత్రి), శ్రీయుతులు నూకల రామచంద్రారెడ్డి, కాసు బ్రహ్మానందరెడ్డి, పి. వి. జి. రాజు, మల్లిపూడి పళ్ళంరాజు, డాక్టరు మర్రి చెన్నారెడ్డి నవాబ్ మీర్ అహమద్ అలీఖాన్, [illegible] ప్రసాద్. ఎం. ఎస్. లక్ష్మీనరసయ్య (కేబినెట్టు హోదా మంత్రులు), శ్రీయుతులు ఎం. ఆర్. అప్పారావు, పి.వి. నరసింహారావు, ఆలపాటి వెంకటరామయ్య, బి. వి. గురుమూర్తి, శ్రీమతి సదాలక్ష్మి (స్టేటు మంత్రులు). స్టేటు మంత్రులుగా వచ్చిన వారంతా కొత్తవారే. మంత్రి వర్గ సమావేశంలో వీరు పాల్గొనరు. అయితే వారికి సంబంధించిన శాఖల విషయాలు గైకొనే సమయంలో వీరిని మంత్రివర్గ సమావేశానికి ఆహ్వానిస్తారు.

పై చైనా దురాక్రమణ హఠాత్తుగా జరుగలేదు. ఇది 1957 నుంచి ప్రారంభమైంది. 1959 మార్చి 31 వ తేదీన టిబెటు అధినేత దలైలామా భారతదేశానికి ప్రవాసం వచ్చాడు. భారతదేశం ఆయనకు ఆశ్రయమిచ్చింది. దీనితో భారత చైనా సంబంధాలు విషమించాయి. 1962 సెప్టెంబరు 8 వరకు కమ్యూనిష్టు చైనా అడపా దడపా జరిపిన దాడులతో సుమారు 12,000 చదరపు మైళ్ళ భారత భూభాగాన్ని ఆక్రమించింది. తర్వాత యుద్ధం ద్వారా, 2,600 చదరపు మైళ్ళు దురాక్రమణ చేసింది. ఇలా చైనా 14,600 చదరపుమైళ్ళ మన భూభాగాన్ని స్వాహా చేసింది. "పాశ్చాత్య రాజ్యాలకు వారసత్వంగా సంక్రమించిన జాడ్యం సామ్రాజ్యతత్వం" అంటూ నినాదాలు చేస్తూ వచ్చిన కమ్యూనిస్టులు ఇరువయ్యో శతాబ్దంలో సామ్రాజ్యవాదు లెవరో రుజువు చేసుకొన్నారు.

## కామ్‌రాజ్ సూత్రం

1963 ఆగష్టు 24వ తేదీన కామ్‌రాజ్ సూత్రం అమలుకు వచ్చింది. పార్టీ సేవకు సీనియర్ నాయకుల పదవీ పరిత్యాగం పేర కేంద్రమంత్రులైన శ్రీయుతులు మురార్జీ, ఎస్.కె పాటిల్, జగ్‌జీవన్‌రాం, బెజవాడ గోపాలరెడ్డి, లాల్‌బహాదుర్ శాస్త్రి. ముఖ్యమంత్రులలో శ్రీయుతులు కామ్‌రాజ్ (మద్రాసు), బిజూ పట్నాయక్ (ఒరిస్సా), వినోదానంద్ ఝా (బీహార్), చంద్రభానుగుప్తా (ఉత్తరప్రదేశ్), మండ్లాయ్ (మధ్యప్రదేశ్)లకు ఉద్వాసన జరిగింది

## పోచంపాడుకు శంఖుస్థాపన

అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షపదవి నుండి ముఖ్యమంత్రిగా వచ్చిన శ్రీ సంజీవరెడ్డి కాంగ్రెస్ అధిష్ఠానవర్గం నాయకుల జాబితాలో చేరిపోయారు. వెనుకబడిన తెలంగాణా రాయలసీమ పట్ల ఎక్కువ శ్రద్ధ చూపడం మొదలు పెట్టారు. నిజామాబాద్ జిల్లాలో గోదావరీ జలాలతో పోచంపాడు కర్నూలు జిల్లాలో కృష్ణమీద శ్రీశైలం ప్రాజెక్టులకు పథకాలు వేయించారు. ఈ రెండు ప్రాజెక్టులకు ప్రధాని నెహ్రూ శంకుస్థాపన జరిపారు. 1963 అక్టోబర్ 6వ తేదీన రాజధాని నగరంలో నెహ్రూ జూలాజికల్ పార్క్ ప్రారంభోత్సవం జరిగింది.

## అభినందనీయమైన చర్య

కర్నూలు జిల్లాలో బస్సు రూట్లను జాతీయం చేసినందుకు బస్సు యజ

మాసులు సుప్రీంకోర్టుకు వెళ్ళి కేసు గెలుచుకున్నారు. నిపుణుల సంఘం ప్రకారం ముందు నెల్లూరు చిత్తూరు కడపజిల్లాల బస్సురూట్లను జాతీయం చేసి కర్నూలు చేపట్టాలి. ముఖ్యమంత్రి వ్యతిరేకులైన శ్రీ పిడతల రంగారెడ్డి శ్రీ విజయభాస్కరరెడ్డి మొదలైన వారిమీద ఇది దాడి అని ఒక విమర్శ. వారి ఫిర్యాదులను సుప్రీంకోర్టు 1964 ఫిబ్రవరి 23వ తేదీన అంగీకరించింది. తప్పు తనమీద వేసుకొని శ్రీ సంజీవరెడ్డి ముఖ్యమంత్రి పదవికి వెంటనే రాజీనామా ఇచ్చారు. ఇది అభినందనీయమైన చర్య. ప్రజాస్వామ్యంలో పరిశుభ్రమైన పరిపాలనా సంప్రదాయాన్ని సృష్టించిన వారైనారు. సంజీవరెడ్డి, ఆయన స్థానంలో 1964 ఫిబ్రవరి 29న శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి అయినా అసెంబ్లీ నాయకత్వాన్ని సంజీవరెడ్డి నాలుగు నెలలు తమ చేతుల్లోనే ఉంచుకొన్నారు.

1964 జనవరి 22న శ్రీ దామోదరం సంజీవయ్య కార్మికమంత్రిగా కేంద్ర ప్రభుత్వంలో చేరిపోయారు.

## ప్రపంచం పేదదైంది

1964 మే 27న జాతిరత్నం జవహర్‌లాల్ నెహ్రూ పరమపదించారు. భారత జాతిచరిత్రలో ఒక శకం సమాప్తమైంది. ఒక సంవత్సరం కాలంలో ప్రపంచం ఎన్నో విధాల దారుణాలను భరించింది. 1963 నవంబరులో శాంతి కాముక నాయకుడైన అమెరికా అధ్యక్షుడు జాన్ ఫిట్జ్ గెరాల్డ్ కెన్నెడీ హత్య చేయబడ్డాడు. 1964 అక్టోబరు 16న ప్రపంచ రాజకీయ రంగంనుంచి సోవియట్ ప్రధాని నికితాక్రుశ్చేవ్ నిష్క్రమించాడు. కేంద్రంలో సంజీవరెడ్డి ప్రభృతులతో సిండికేటు బృందం పైకొచ్చింది. లాల్ బహాదుర్‌శాస్త్రిని ప్రధానిగా చేసింది యీ సిండికేటే. శాసనసభా నాయకత్వానికి రాజీనామా చేసి శ్రీ సంజీవరెడ్డి లాల్ బహాదుర్ శాస్త్రి మంత్రివర్గంలో చేరిపోయారు. రాష్ట్రపతి అయ్యేవరకు ఆయన జీవితం పాత పదవులకు రాజీనామాలు; కొత్త పదవుల స్వీకారాలు.

———

# బ్రహ్మానందీయం

పాటలీ పుత్రమ్ము కోట కొమ్మల మీద
తెలుగు జెండాలు నర్తించునాడు
ఢిల్లీశు నెదిరి చెండిన తెల్గు విలుకాండ్రు
నవలక్ష లోరుగల్ గవియునాడు
రాచూరు కదన మం దేచి తళ్ తళ మంచు
తెలుగు జోదుల కత్తి తిరుగునాడు
అలచోళ పాండ్య భూముల తెల్గు సరకార్ల
పసుపు సూయాణమై ప్రాకునాడు
చూచి సంతోష భారంబు మోచిశిరము
నూచు భాగ్యంబునకు నింత నోచలేక
ఏలపుట్టితి నిపుడిసీ! ఏటి బ్రతుకు ?
కట కటా దాటిపోయే బంగారు యుగము.

**- తుమ్మల**

దాటి పోలేదని నిరూపించిన తెలుగు వెలుగు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి.

శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి జీవితమే ఒక మహాభారతం. అందులో ఏ ఘట్టం చూచినా మీసాలను దువ్వుకొనటం, పద్మవ్యూహాలను పన్నటం, ప్రతిపక్షాలను పరిహసించటం, ఎట్టివారినైనా సాహసించి మీది కురకటం, విజయ దుందుభులను మ్రోగించటం కనిపిస్తాయి. 1964 ఫిబ్రవరి 29వ తేదీన ముఖ్య మంత్రి పదవిని పట్టిన శ్రీ బ్రహ్మానందరెడ్డి పూర్వపు మంత్రి వర్గాన్నే ఉంచుకొని నాల్గు నెలల తర్వాత శ్రీ సంజీవరెడ్డి అనుమతి లేకుండా శ్రీ తోట రామస్వామి, శ్రీ చెంచు రామానాయుడు, శ్రీ తానేటి వీరరాఘవులను మంత్రి వర్గంలో చేర్చుకొన్నారు.

## "తన బలం — స్థాన బలం"

మన రాష్ట్రంలో అఖిల భారత స్థాయిలో నాయకులైన అవకాశం ఎవరికి లభించినా అందులో స్థానబలం హెచ్చు; తన బలం తక్కువ. అందువలన వీరు ఎంత ఉన్నత పీఠంలో ఉన్నా, రాష్ట్ర రాజకీయాలపై తమకు గల వ్యామోహాలకు దూరంగా ఉండలేకపోయారు. డా॥ పట్టాభి, సంజీవరెడ్డి, సంజీవయ్య, డా॥ చెన్నారెడ్డి పి. వి. నరసింహారావు, అంతా ఈ దారిన నడచిన వారే. రాష్ట్రంలో తమ స్థానరక్షణకై కందకాలు త్రవ్వుకున్న వారే. కేంద్రంలో ఉన్న సంజీవరెడ్డి ఢిల్లీనుండే యీ హెచ్చరికలు చేయటం మొదలుపెట్టారు.

## బలపడుతున్న బ్రహ్మానందరెడ్డి

బ్రహ్మానంద రెడ్డి ముఖ్య మంత్రి అయిన సంవత్సరంలోనే గుంటూరులో అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశాలు జరిగినాయి. కొత్త రఘురామయ్యను కాదని తన సారథ్యంలో యీ మహా సభలను బ్రహ్మాండంగా జరిపించి అఖిల భారత స్థాయిలో తమ ప్రతిష్ఠను పెంచుకొన్నారు. బ్రహ్మానంద రెడ్డి, ఢిల్లీలోని ఆంధ్ర నాయకుల కిది మేల్కొలుపైనది. ఆయన ఇంకా పైకి వెళ్ళడం ఇష్టంలేని వారంతా రాష్ట్రంలో ఏ. సి. సుబ్బారెడ్డి సారథ్యంలో సంజీవరెడ్డి, సంజీవయ్య, రఘురామయ్యలకు అనుకూలురైన వారంతా ఒక ముఠాగా తయారైనారు.

ఇంత వరకు "నమ శ్శత్రేచ, మిత్రేచ" అనే ధోరణిలో ఉంటున్న కాసువారు ఆసిద్ధాంతాన్ని విడిచి పెట్టి సంజీవరెడ్డికి వ్యతిరేకులైన వాళ్ళనందరిని పోగుచేసుకొని తన బలంపెంచుకొనటం ప్రారంభించారు. మంత్రి పదవి కోల్పోయిన వి బి. రాజుకు రోడ్డు రవాణా కార్పోరేషన్ అధ్యక్షపదవి, ఎన్నికలలో ఓడిపోయిన జె.వి. నరసింగరావుకు విద్యుచ్ఛక్తిబోర్డు అధ్యక్షపదవి, కందుల ఓబులరెడ్డికి ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవి, శీలం సిద్ధారెడ్డికి భూ తనఖా బ్యాంకు అధ్యక్షపదవి ఇచ్చారు. గొట్టిపాటి బ్రహ్మయ్యను విధానపరిషత్ అధ్యక్షస్థానంలో కూచోపెట్టి పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిని ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులుగా చేసారు. కాకాని వెంకటరత్నం, వాసిరెడ్డి కృష్ణమూర్తినాయుడు, కె.వి. నారాయణరెడ్డి మున్నగు సంజీవరెడ్డి వ్యతిరేకులంతా బ్రహ్మానందరెడ్డి వర్గంలో చేరిపోయారు.

## ప్రతిష్ఠాకరమైన గెలుపు

రాష్ట్ర ఎన్నికల కమిటీలోని 11వ సభ్యుడైన ఆలపాటి వెంకటరామయ్య 1965 జూన్ 16న మరణించారు. ఆయన ఉండగా ఏ.సి. ముఠాదే పైచేయి. ఏ.సి. ముఠాలో ఏ.సి. సుబ్బారెడ్డి, నూకల రామచంద్రారెడ్డి, పి.వి.జి. రాజు, నవాబ్ మీర్ అహమద్ అలీఖాన్, శ్రీమతి రుక్మిణమ్మ-సభ్యులు. ముఖ్యమంత్రి గ్రూపులో ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి, డాక్టర్ ఎం. చెన్నారెడ్డి, తిమ్మారెడ్డి, తోట రామస్వామి, వి.బి. రాజు సభ్యులు. 11వ సభ్యుని భర్తీకోసం ఎన్నికలు జరుపవలసి వచ్చాయి. ఎవరి అభ్యర్థి గెలిస్తే వారికి బలం ఎక్కువ అవుతుంది. అందువలన విపరీతమైన పట్టుదలతో ఇరుపక్షాలవారు ఎన్నికల కురుక్షేత్రంలో దిగారు. ముఖ్యమంత్రి అభ్యర్థి కాకాని వెంకటరత్నం. ఏ. సి. అభ్యర్థి అంటే సంజీవయ్య, రఘురామయ్య, సంజీవరెడ్డి అభ్యర్థి మూర్తిరాజు. చివరకు ముఖ్యమంత్రి గ్రూపు గెలిచింది. కాకాని పదకొండో సభ్యులైనారు.

ఈ కాకాని గురించి ఒక సంగతి చెప్పాలి 1951లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షపదవికి ఆచార్యరంగా సంజీవరెడ్డి మధ్య పోటీ జరిగినప్పుడు కాకాని వెంకటరత్నం కృష్ణా జిల్లాలోని తన అనుయాయుల ఓట్లన్నీ సంజీవరెడ్డికి వేయించి ఆరోజు సంజీవరెడ్డి గెలుపుకు కారకుడైనారు. ఇప్పుడు ఈ కాకానే సంజీవరెడ్డి అభ్యర్థి అయిన మూర్తిరాజును ఓడించి రాష్ట్ర రాజకీయాలనుంచి సంజీవరెడ్డిని దూరం చేయగలిగారు. అందుకే కాకాని వెంకటరత్నాన్ని ఉక్కు కాకాని అని అంటారు.

## ప్రధాని లాల్‌బహాదుర్ నిర్యాణము

1965 సెప్టెంబరులో మనదేశానికి పాకిస్తాన్‌తో 22 రోజుల భీకర పోరాటం జరిగింది. యుద్ధంలో గెలిచి ప్రధాని లాల్‌బహాదుర్ శాస్త్రి విజయ పేరుదనిపించుకొన్నాడు. తాష్కెంట్‌లో పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ అయూబ్ ఖాన్‌తో శాంతి సంధి జేసుకొన్న ప్రధాని శాస్త్రి అదేరోజు దేశంకాని దేశంలో కన్నుమూసారు. 1966 జనవరి 24వ తేదీన శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధాన మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసారు. ఆమె మొదటి మంత్రివర్గంలో సంజీవయ్య, సంజీవరెడ్డి క్యాబినెట్ మంత్రులు, కొత్త రఘురామయ్య, డా॥ కె.ఎల్. రావు

స్టేటుమంత్రులు, బి.ఎస్.మూర్తి ఉపమంత్రి. కేంద్రంలో ఇంత పెద్ద సంఖ్యలో ఆంధ్రులు మంత్రులు కావటం ఇదే మొదటిసారి.

## విగ్రహ విధ్వంసన

రాష్ట్ర రాజకీయాలలో ఒకవంక గ్రూపు తగువులుండగా విశాఖకు ఉక్కు కర్మాగారం రాదని పితూరీలు బైల్దేరినవి. పెట్టుబడి పెట్టదలచుకున్న ఆంగ్లో-అమెరికన్ కన్సార్షియంవారు గోవాకంటె కూడా విశాఖపట్నం అనువైన స్థలమని తమ నివేదికలో పేర్కొన్నారు. అప్పటి కేంద్ర ఉక్కుమంత్రి దీన్ని అంగీక రించారు. ప్రాంతీయ దురాభిమానాలకు లోనై ఒరిస్సాలో బైలదిల్లా, మద్రాసులో సేలం మైసూరులోని హోస్పేటలో ఐదవ ఉక్కు కర్మాగారం స్థాపించాలన్న ప్రచారాలు ప్రారంభమైనవి. ఈ రాజకీయాలలో తమకు ఉక్కు కర్మాగారం దక్కదేమోనని ఆంధ్రులు రాష్ట్ర వ్యాప్తంగా ఆందోళనలు లేవదీసారు. నిరసన వ్రతాలు జరిపారు. అమృతరావు నిరహార దీక్ష బూనారు. కేంద్ర మంత్రిగా ఉన్న సంజీవరెడ్డికి సిండికేటు నాయకులైన కామ్‌రాజ్, నిజలింగప్పలతో కల స్నేహానికి కారణంగా రాష్ట్రం తరపున గట్టిగా వాదించలేక పోతున్నారని ప్రతి పక్షసభ్యులు రాష్ట్ర శాసనసభలో ఆయనమీద నేరారోపణ జేసారు.

ఆంధ్రుల జాతీయజీవనంలో విజయవాడకు చాలా ప్రాముఖ్యముంది.ఇక్కడ 1955లో ఆంధ్రకేసరి ప్రకాశం, రైతుకేసరి ఆచార్యరంగాల విగ్రహ ప్రతిష్ఠాప నలు జరిగినవి. సంజీవరెడ్డి విగ్రహాన్ని కూడా స్థాపించాలన్న అభిప్రాయం కలిగి 1964లో అది నెరవేరింది. ఉక్కు కర్మాగార విషయమై అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకులంతా రాజీనామా చేసారు. రాష్ట్రంలో ఇంత అలజడి జరుగు తున్నా కేంద్రం పట్టించుకోలేదు. అందుకు నిరసనగా ప్రజలు కేంద్ర ప్రభుత్వ ప్రతినిధి అయిన సంజీవరెడ్డి కంచు విగ్రహంపై ఆ పగ తీర్చుకున్నారు. ఇవి విగ్రహ రాజకీయాలు.

## రాజకీయ రంగంలో విద్యారంగం

1957లో డా॥ సూరి భగవంతం పదవీ విరమణతో ఉస్మానియా విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సులర్ పదవి ఖాళీ అయినది. ఈ ఖాళీలో రెండేళ్ళకై డా॥ సదాశివరెడ్డిని నియమించారు. 1959లో ఒక చట్టం వచ్చింది. దానితో

డి.ఎస్.రెడ్డి పదవీకాలం ఐదేళ్ళకు పెరిగింది.అంటే ఆయన 1964లో రిటైర్‌కావాలి. ఈలోగా డా॥ రెడ్డి తన పరపతిని పెంచుకొని మరోఐదేళ్ళు ఆ పదవిలో ఉండేటట్లు చేసుకొన్నారు. అంటే ఇప్పుడాయన 1969లో పదవీ విరమణ చేస్తారు. ఇంతలో విశ్వవిద్యాలయ చట్టం సవరణ బిల్లును అసెంబ్లీ ఆమోదించింది. వైస్‌ఛాన్సులర్లను తొలగించే అధికారం యీ బిల్లుద్వారా ప్రభుత్వానికి లభించింది. డా॥ రెడ్డికీ, ముఖ్యమంత్రికీ ఎక్కడ అభిప్రాయ భేదం వచ్చిందో తెలియదు కానీ సంజీవరెడ్డి బంధువైనందున డా॥ రెడ్డిపై ముఖ్యమంత్రి కక్షబూనినట్లు ప్రచారం జరిగింది. ఏది ఏమైతేనేం—డా॥ రెడ్డిని తొలగించి అతని స్థానంలో గుంటూరు మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్ డా॥ నరసింహారావును ఉస్మానియాకు వైస్‌ఛాన్సులర్‌గా నియమించినట్లు ప్రభుత్వ ప్రకటన వెలువడింది. తనకు పాత నియామకమే వర్తిస్తుందని, 1969 వరకు తానా పదవిలో ఉండటానికి అర్హుడని హైకోర్టులో పిటిషన్ దాఖల్ చేసుకోగా హైకోర్టు దాన్ని కొట్టివేసింది దానిపై డా॥ రెడ్డి సుప్రీంకోర్టుకు అపీలు జేసుకొన్నారు.

ఇది ఇలా ఉండగా డాక్టర్ నరసింహారావు ప్రమాణ స్వీకారం చేయడానికి హైదరాబాద్‌కు రాగా విద్యార్థులు ఆయనను విశ్వ విద్యాలయ ప్రాంగణంలోకి అడుగు పెట్టనివ్వలేదు. డాక్టర్ నరసింహారావుకు, రాజ్‌భవన్‌లోనే ప్రమాణ స్వీకారం చేయవలసి వచ్చింది. చార్జి యిచ్చే రిజిస్ట్రారుని విద్యార్థులు రహస్య స్థలానికి తరలించుకు పోయారు. డాక్టర్ నరసింహారావు చార్జీ తీసుకొనడానికి ముందే డాక్టర్ రెడ్డి సుప్రీం కోర్టులో కేసు గెలుచుకొని 1969 వరకు పదవిలో ఉండటానికి కోర్టు అనుమతి పొందారు. 1968లో ఉస్మానియా స్వర్ణోత్సవాలు డాక్టర్ రెడ్డి ఆధ్వర్యంలోనే ఘనంగా జరిగినవి. ఈ సందర్భంలో ముఖ్యమంత్రికి గౌరవ పట్టా ప్రదానం చేస్తానంటే బ్రహ్మానందరెడ్డి అందుకు తిరస్కరించి తమ గౌరవాన్ని పెంచుకున్నారు. రజాకార్ల కాలంలో కానీ పోలీసుచర్య సమయంలో కానీ ఎన్నడూ రాజకీయాల ప్రసక్తికి పోని ఉస్మానియా విద్యార్థులు ఇక నుంచి రాష్ట్ర రాజకీయాలలో ప్రధాన పాత్ర వహించడం కనిపిస్తుంది. ఒకసారి విద్యార్థులు రాజకీయాల రుచి మరిగారంటే అది మానవ రక్తం రుచి చూచిన పులి మనస్తత్వం వంటిది.

## కాంగ్రెసుకు కంచుకోట

1967లో నాల్గవ సార్వత్రిక ఎన్నికలు జరిగినవి. సంజీవరెడ్డి గ్రూపుకు సగం బ్రహ్మానందరెడ్డి గ్రూపుకు సగం స్థానాలిచ్చినారు కాంగ్రెస్ అధ్యక్షుడు కామ్‌రాజ్. అయినా బ్రహ్మానందరెడ్డి అభ్యర్థులే చాలామంది గెలిచినారు. అసెంబ్లీలో వివిధ పార్టీల బలాబలాలు :— కాంగ్రెసు 164, సి.పి.ఐ. 10, స్వతంత్ర 24, సి. పి. ఎం. 9, జనసంఘ్ 3, రిపబ్లికన్ పార్టీ 2, ఎస్. ఎస్. పి.2 జన కాంగ్రెస్ 20, పీపుల్సు డిమోక్రటిక్ పార్టీ 34, ఇండిపెండెంట్లు 17, నామినేటెడ్ 1, మొత్తం సీట్ల సంఖ్య 287. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసుకు కంచుకోటగా నిలిచింది.

## దేశస్థాయిలో కాంగ్రెసుకు శృంగభంగం

ఈసారి ఎన్నికల్లో కాంగ్రెసు పార్టీకి శృంగభంగం లభించింది. ఇరవై ఏళ్లగా నిరాటంకముగా పాలనాధికారం వహించిన కాంగ్రెసు పార్టీ, యీ ఎన్నికల్లో తీవ్ర పరాజయం ఎదుర్కొన వలసి వచ్చింది. మొత్తంలో ఎనిమిది రాష్ట్రాలలో మాత్రమే కాంగ్రెసుకు మెజారటీ లభించింది. దేశవ్యాప్తంగా క్షామమేర్పడడం, అనేకచోట్ల అల్లరులు అలజడులు జరగడం, ముఖ్యంగా ఢిల్లీలో గోహత్యా నిషేధాన్ని గూర్చి జరిగిన అల్లరులు, విద్యార్థుల అల్లరులు, జవహర్‌లాల్ నెహ్రూ సారథ్యం లేకపోవడం, కాంగ్రెసు పాలక వర్గంలోనే అంతః కలహాలు, ధరల పెరుగుదల వీటి ప్రభావం ప్రజానీకంపై బలంగా పనిచేసింది. తమిళనాడు, పంజాబ్, కేరళ, పశ్చిమ బెంగాల్, ఒరిస్సా, బిహార్, హర్యానా, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, కేంద్రపాలిత ప్రాంతమైన ఢిల్లీలో కాంగ్రేసేతర ప్రభుత్వాలేర్పడినవి. దాదాపు నూరు మంది మంత్రులు యీ ఎన్నికల్లో ఓడిపోయారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల వ్యవసాయ, ఆహార శాఖల మంత్రులందరు ఈ ఎన్నికల్లో ఓడిపోవడం విశేషం.

ద్రావిడ మున్నేట్ర కజగం లోక్‌సభకు నిలబెట్టిన అభ్యర్థులలో 99 శాతం మందిని గెలిపించి అఖిలభారత రికార్డును నెలకొల్పింది. ఆ పార్టీ లోక్‌సభకు 24 మంది అభ్యర్థులను నిలబెట్టగా 23 మంది గెలిచారు. అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడు కామ్‌రాజ్ విరుద్ధనగర్ అసెంబ్లీ నియోజకవర్గం నుండి ఒక విద్యార్థి

నాయకుని చేతిలో ఓడిపోయారు. మద్రాసుకు చెందిన కేంద్రమంత్రులు సుబ్రహ్మణ్యం, అలగేసన్, శ్రీమతి సౌందరం రామచంద్రన్, సి. ఆర్. పట్టాభి రామన్, శ్రీమతి సరోజినీ చంద్రశేఖర్ డి.ఎం.కె. చేతుల్లో ఓడిపోయారు.

## *ఇనాముల రద్దు

1967 ఆంధ్రప్రదేశ్ తెలంగాణా ప్రాంతం ఇనాముల రద్దు చట్టం 1967 అక్టోబరు 6 నుండి అమలులోనికి వచ్చింది. ఈ చట్టం క్రింద మతసంస్థలు, ధర్మసంస్థల ఆధీనంలోని భూములతో సహా అన్ని ఇనాం భూములు రద్దు చేయబడ్డాయి. ఇనాం భూములు కలిగి ఉన్నవారు అంటే రైతులకి పట్టా మంజూరు చేయబడ్డ ఇనాందార్లు 'బలెహాజ్-ఎ-ఖదీమ్' (పూర్వాచారం) మొదలైనవారు పట్టా మంజూరైన తేదీనుండి భూమిశిస్తు చెల్లించవలసి వచ్చింది.

## రాష్ట్ర రాజకీయాలలో కొత్తమలుపు

ఈ ఎన్నికలలో ఆంధ్రప్రదేశ్ రాజకీయాలలో కొత్తమార్పులు వచ్చాయి. ఆంధ్రప్రదేశ్‌లో గత మున్పై ఏళ్ళుగా పనిచేస్తున్న కమ్యూనిస్టుపార్టీ 1964లో రెండుగా చీలిపోయింది. సి.పి.ఐ.కి చండ్రరాజేశ్వరరావు, సి.పి.ఎం.కు పుచ్చలపల్లి సుందరయ్య నాయకులు. స్వతంత్ర పార్టీ పుట్టి పదేళ్ళు అయినా ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో ప్రధాన ప్రతిపక్షం అయింది. 1967 జూన్‌లో పి.డి.పి. కాంగ్రెసులో చేరిపోవడంతో కాంగ్రెసు బలం 184కు పెరిగింది. స్వతంత్ర జన కాంగ్రెస్ కలసి డెమోక్రటిక్ ఫ్రంట్‌గా 4[illegible] మంది సభ్యులతో ప్రధాన ప్రతిపక్షంగా రూపొందింది. దీని నాయకుడు గౌతు లచ్చన్న. ఈ ఎన్నికల్లో మాజీ హోం మంత్రి నవాబ్ అహమద్ అలీ ఖాన్, మాజీమంత్రిణి శ్రీమతి సదాలక్ష్మి, విద్యామంత్రి అల్లూరి బలరామిరెడ్డి, శాసనసభలో లెఫ్ట్ కమ్యూనిస్టు నాయకుడు పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, పోలిట్ బ్యూరో సభ్యుడు నీలం రాజశేఖరరెడ్డి తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షులు హయగ్రీవాచారి ఓడిపోయారు.

1967 మార్చి [illegible] వ తేదీన బ్రహ్మానందరెడ్డి శాసనసభ కాంగ్రెసు పార్టీ నాయకుడుగా తిరిగి ఎన్నికైనారు. పదమూడుగురు క్యాబినెటు మంత్రులు, ఆరుగురు సహాయ మంత్రులతో మంత్రివర్గాన్ని నిర్మించారు. కాసు బ్రహ్మానందరెడ్డి (ముఖ్యమంత్రి) డా॥ ఎం. చెన్నారెడ్డి పి. తిమ్మారెడ్డి, వి.బి. రాజు, తోట

రామస్వామి, జె.వి. నరసింగరావు, కొండాలక్ష్మణ్ బాపూజీ, తాసేటి వీర రాఘవులు (క్యాబినెటు హోదా మంత్రులు) పి.వి. నరసింహారావు. సి.వి. సుదు మూర్తి, విజయభాస్కరరెడ్డి, రుద్రరాజు రామలింగరాజు, చెంచు రామానాయుడు, శీలం సిద్దారెడ్డి (సహాయ మంత్రులు). డా॥ చెన్నారెడ్డి ఉక్కుమంత్రిగా కేంద్రానికి వెళ్ళడంతో ఒక నెలరోజులు తిరగకుండానే మంత్రివర్గ పునర్నిర్మాణం జరుపవలసి వచ్చింది. కొత్తగా చేరిన మంత్రులు :— ఏ.సి. సుబ్బారెడ్డి, కె.వి. నారాయణరెడ్డి, మహమ్మద్ ఇబ్రాహిం అలీ అన్సారీ, అరిగె రామస్వామి, వెని గళ్ళ సత్యనారాయణ. మొత్తం 8 మంది మంత్రులు జనసంఖ్యలో చూచినా, విస్తీర్ణంలో చూచినా మంత్రివర్గంలో మూడవవంతు తెలంగాణాకు లభించాలి. ఇంతవరకు యిలాగే జరుగుతు వచ్చింది. కానీ ఇప్పుడీ మంత్రివర్గంలో తెలంగాణా సభ్యులకు సగంస్థానాలు లభించాయి. ముఖ్యమంత్రి వర్గంలో తెలంగాణా సభ్యుల సంఖ్యాబలానికి ఇది నిదర్శనం. క్యాబినెటులో సహాయమంత్రుల విచక్షణ తొలగించి ముఖ్యమంత్రి ఇప్పుడు మంత్రులందరిని క్యాబినెటు మంత్రులుగా మార్చివేసారు. తిమ్మారెడ్డి స్థానంలో కాకాని వెంకటరత్నం ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులైనారు. 1964 ఏప్రిల్ 4 నుండి 1968 ఏప్రిల్ 10 వరకు పట్టం థాను పిళ్ళే 1968 ఏప్రిల్ 11 నుండి 1976 జనవరి వరకు ఖండుబాయి దేసాయి రాష్ట్ర గవర్నర్లుగా పనిచేసారు. బి.వి. సుబ్బారెడ్డి తిరిగి అసెంబ్లీ స్పీకరుగా ఎన్నికైనారు. గొట్టిపాటి బ్రహ్మయ్య స్థానంలో పిడుతల రంగారెడ్డి విధానపరిషత్ అధ్యక్షులైనారు. లోక్‌సభ ఎన్నికలలో సంజీవయ్య ఓడిపోవడం గ్రూపు రాజకీయ తగాదాల పరాకాష్ఠ.

## కాంగ్రెస్ రాజకీయాలకు దూరమైన శ్రీ సంజీవరెడ్డి

ఈసారి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ మంత్రివర్గంలో కొత్త రఘురామయ్య రఘునాథరెడ్డికి సహాయమంత్రుల స్థానం, బి.ఎస్. మూర్తి, జె.బి. ముత్యాల రావులకు డిప్యూటీ మంత్రుల స్థానం లభించింది. లోక్‌సభ స్పీకర్ పదవికి కాంగ్రెసుపార్టీ పక్షాన నీలం సంజీవరెడ్డి ప్రతిపక్షాల తరఫున తెన్నేటి విశ్వనాథం పోటీచేసారు. విశ్వనాథాని కన్న సంజీవరెడ్డికి 77 ఓట్లు అధికంగా లభించాయి. కాంగ్రెసు కివి వెనుకటి రోజులుకావు. లోక్‌సభలో 47 శాతం స్థానాలు ప్రతి పక్షాలాక్రమించుకొన్నవి. ఎనమిది రాష్ట్రాలలో కాంగ్రెస్ అధికారాన్ని కోల్పో

యింది. ఈ సంగతి గుర్తుకు తెచ్చుకొని స్పీకరుగా ఎన్నికైన సంజీవరెడ్డి లోక్‌సభలో దాదాపు సగం మంది సభ్యుల విశ్వాసం పొందవలసిన అవసర ముందని భావించుకొని కాంగ్రెస్‌పార్టీ సభ్యత్వానికి రాజీనామా చేసారు. గతంలో సభాపతులైన మావలంకార్, అనంతశయనం అయ్యంగార్, సర్దార్ హుకుమ్‌సింగ్ ఈ పని చేయలేదు. సంజీవరెడ్డి తీసుకొన్న చర్య ఎంతో గొప్పదన్నారు రాజాజీ.

## నిజాం మరణం

మాజీ హైదరాబాద్ సంస్థానాధీశుడైన నవాబ్‌మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహాదుర్ తన 82వ ఏట 1967 ఫిబ్రవరి 24వ తేదీన మరణించాడు. తన పూర్వీకులు కోల్పోయిన రాజ్యమంతా ఒకచోట చేరేనాటికి తనకు రాజ్యాధి కారం పోయింది. హతాశుడై దివంగతుడైనాడు నిజాం. తెలుగుదేశ చరిత్రలో ఏడు తరాల పరిపాలన జరిపిన నిజాం రాజుల శకం అంతరించింది.

మాజీ హైదరాబాద్ రాష్ట్ర తొలి తుది ప్రజా ముఖ్యమంత్రిగా ఉండి, కేరళ ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల గవర్నరుగా పనిచేసి, తరువాత రాజ్యసభ సభ్యులై, చివరి దశలో రాజకీయాలకు దూరమై, సాహిత్యసేవలో జీవితాన్ని గడుపుకుంటున్న డా॥ బూర్గుల రామకృష్ణారావు 1967 సెప్టెంబరు 15వ తేదీన మరణించారు. విశాలాంధ్ర నిర్మాణానికి ఆయన విజ్ఞతా నిర్ణయమే ముఖ్య కారణమని పత్రికలు రాసాయి. ఈ దుర్ఘటన జరిగిన ఐదురోజులకే రాష్ట్ర వ్యవహారాల మంత్రి ఏ.సి. సుబ్బారెడ్డి చనిపోయారు. ఆయన చెట్టంత మనిషి. మంత్రివర్గపు పేకాటలలో ఇంతవరకు తురుపు ఆసుగా ఉంటున్న వ్యక్తి. ఆయన మద్రాసులో బ్రహ్మానందరెడ్డితో కలసి చదువుకొన్న విషయం చాలామందికి తెలియదు.

## అఖిల భారత కాంగ్రెసు మహాసభలు

డెబ్బయి ఒకటవ అఖిలభారత కాంగ్రెసు మహాసభలు జనవరి 1968లో హైదరాబాద్‌లో ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి నేతృత్వంలో మహా వైభవో పేతంగా జరిగినవి. కాసువారికి అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీలో సభ్యత్వం లభించింది. ఆయన అధిష్ఠానవర్గం నాయకులలో ఒకరైనారు. అధ్యక్ష పదవికి సంజీవయ్య డా॥ చెన్నారెడ్డి పేర్లు వినిపించినా ఆ స్థానం నిజలింగప్పకు అబ్బింది.

# బ్రహ్మానంద వైభవం

భారతదేశంలోని పెద్ద రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ది అయిదవస్థానం. దేశ వైశాల్యంలో మనది పదోవంతు భూమి ఉన్నది. జనాభా ప్రకారమైతే నాల్గో స్థానం. అయినా తలసరి సాలీనా ఆదాయంలో మనది పధ్నాలుగో స్థానం. ప్రజల దారిద్ర్యం పోవాలంటే సత్వర పారిశ్రామికాభివృద్ధి జరగాలి. 1500 కోట్ల పెట్టుబడితో ఒక ప్రణాళికను సృష్టించి పెట్టుబడులు పెట్టేవారిని ఆహ్వానించారు ముఖ్యమంత్రి. రాష్ట్ర ప్రభుత్వం ద్వారా కొత్త పరిశ్రమలకు అనేక సౌకర్యాలు కలిగించారు. కొంతవరకు కృషి ఫలించింది.

శ్రీ బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి అయినప్పటినుండి ఆంధ్రప్రదేశ్‌కు న్యాయం చేయవలసిందిగా కేంద్రాన్ని అభ్యర్థించి కృతకృత్యులు కావడమే ధ్యేయంగా పెట్టుకొన్నారు. అఖిలభారత ఉద్యోగ స్థాయిలో ఆంధ్రులకు అన్యాయం జరిగితే సహించబోమని నిష్కర్షగా ప్రకటించారు. పెద్ద పరిశ్రమల పంపకంలో, కేంద్రప్రభుత్వశాఖలలో ఆంధ్రులకు జరుగుతున్న అన్యాయాలను అక్రమాలను బయటపెట్టారు. గోదావరిపై వంతెనకు, నాగార్జునసాగర్ నిర్మాణానికీ, బలిమెలా డామ్‌కు, శ్రీశైలం తుంగభద్ర ప్రాజెక్టులకు, పోచంపాడు పథకానికి, సికింద్రాబాద్‌ను రైల్వేమండలం చేయడానికి జరుగుతున్న జాప్యాలన్నింటిని బట్టబయలుజేసారు. ఆయన ముఖ్యమంత్రి అయిన తర్వాత ఢిల్లీలో ఆంధ్రుల ప్రతిష్ఠ పెరిగింది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అఖిలభారత స్థాయిలో ఒక స్వతంత్ర ప్రతిపత్తిగల వ్యక్తిగా రాణించడం జరిగింది. గోవిందవల్లభ్ పంత్, బి. సి. రాయ్, కామ్‌రాజ్ కోవకు చెందిన ముఖ్యమంత్రుల వరుసలో శ్రీ బ్రహ్మానందరెడ్డి నిలుస్తారు.

---

*తెలంగాణాలో చాకలి, మంగలి మొదలైన వృత్తి పనులు జేసుకొనే వారి కిచ్చిన ఇనాములు, మత సంస్థల పోషణ కిచ్చిన ఇనాములు వేలాది ఎకరాల సంఖ్యలో ఉండినవి. వాటి వివరాలు :—

| క్రమ సంఖ్య | జిల్లా పేరు | ఇనాముల సంఖ్య | విస్తీర్ణము (ఎకరాలలో) |
|---|---|---|---|
| 1. | ఆదిలాబాద్ | 3,386 | 59,000 |
| 2. | కరీంనగరు | 4,415 | 12,954 |
| 3. | ఖమ్మం | 2,390 | 26,949 |
| 4. | నల్గొండ | 10,625 | 1,73,330 |
| 5. | వరంగల్ | 7,556 | 42,259 |
| 6. | నిజామాబాద్ | 12,343 | 24,243 |
| 7. | మహబూబ్‌నగర్ | 15,063 | 2,57,107 |
| 8. | కె.వి. రంగారెడ్డి | 10,434 | 74,957 |

1954లో బి. రామకృష్ణారావు మంత్రివర్గం ఇనాముల రద్దు శాసనం తెచ్చింది. అయితే ఇందులో పనిపాటలు చేసుకొనే వారివి, దేవదాయ ధర్మ దాయ శాఖల ఇనాంలు మినహాయించ బడినవి.

ఈ ఇనాములు నానారకాలుగా ఉండినవి. అరాజీ మక్తా, అరాజీ అగ్రహార్, మద్రా మక్తా, సెరీ ఇనాం, బలూతా ఇనాం, నీరడీ ఇనాం. కిద్మతీ ఇనాం వగైరా :—

——

# భాషాబంధం గొప్పది

"ఒక్కటేరా ! తెలుగుదేశం
ఒక్కటేరా ! తెలుగుభాష
ఎక్కడున్నా తెలుగు లంవరు
ఒక్కటేరా ! ఒక్కటేరా !
అరుకు లోయల గాలికొండ
హైదరాబాద్ గోలకొండ
కలసి కట్టెను తెలుగుతల్లి
కంఠసీమను పూలదండ—
ఒక్కటే గోదావరీ నది
ఒక్కటే కృష్ణానది
రెండునదులూ తెలుగుజాతి
గుండెలో ఒకటైనవి.
సాగర మ్మొక వైపున నిజాం
సాగరమ్మొక వైపున
తెలుగుతల్లికి వీచు చల్లని
అలలవీవన అందమొప్పు.

ఎదలు ఎదలు కూర్చికట్టిన
ఏకతా సేతువులమీద
కదలివచ్చే అభ్యుదయ చ
క్రాల కిడుదాం స్వాగతమ్మును"

—జె. బాపురెడ్డి.

బెంగాలీలకు చిత్తరంజన్‌దాస్, సుభాష్ చంద్రబోస్, తమిళులకు రాజాజీ అన్నాదొరై, మహారాష్ట్రులకు తిలక్, గోఖలే వారి కాలాలలో ఏకైక నాయకులు.

*తెలంగాణాలో చాకలి, మంగలి మొదలైన వృత్తి పనులు జేసుకొనే వారి కిచ్చిన ఇనాములు, మత సంస్థల పోషణ కిచ్చిన ఇనాములు వేలాది ఎకరాల సంఖ్యలో ఉండినవి. వాటి వివరాలు :—

| క్రమ సంఖ్య | జిల్లా పేరు | ఇనాముల సంఖ్య | విస్తీర్ణము (ఎకరాలలో) |
|---|---|---|---|
| 1. | ఆదిలాబాద్ | 3,386 | 59,000 |
| 2. | కరీంనగరు | 4,415 | 12,954 |
| 3. | ఖమ్మం | 2,390 | 26,949 |
| 4. | నల్గొండ | 10,625 | 1,73,330 |
| 5. | వరంగల్ | 7,556 | 42,259 |
| 6. | నిజామాబాద్ | 12,343 | 24,243 |
| 7. | మహబూబ్‌నగర్ | 15,063 | 2,57,107 |
| 8. | కె.వి. రంగారెడ్డి | 10,434 | 74,957 |

1954లో బి. రామకృష్ణారావు మంత్రివర్గం ఇనాముల రద్దు శాసనం తెచ్చింది. అయితే ఇందులో పనిపాటలు చేసుకొనే వారివి, దేవదాయ ధర్మ దాయ శాఖల ఇనాంలు మినహాయించ బడినవి.

ఈ ఇనాములు నానారకాలుగా ఉండినవి. అరాజీ మక్తా, అరాజీ అగ్రహార్, మద్రాజా మక్తా, సెరీ ఇనాం, బలూతా ఇనాం, నీరడీ ఇనాం, కిద్మతీ ఇనాం వగైరా :—

# భాషాబంధం గొప్పది

"ఒక్కటేరా ! తెలుగుదేశం
ఒక్కటేరా ! తెలుగుభాష
ఎక్కడున్నా తెలుగు లందరు
ఒక్కటేరా ! ఒక్కటేరా !
అరుకు లోయల గాలికొండ
హైదరాబాద్ గోలకొండ
కలసి కట్టెను తెలుగుతల్లి
కంఠసీమను పూలదండ—
ఒక్కటే గోదావరీ నది
ఒక్కటే కృష్ణానది
రెండునదులూ తెలుగుజాతి
గుండెలో ఒకటైనవి.
సాగర మ్మొక వైపున నిజాం
సాగరమ్మొక వైపున
తెలుగుతల్లికి వీచు చల్లని
అలలవీవన అందమొప్పు.

ఎదఎదలు కూర్చికట్టిన
ఏకతా సేతువులమీద
కదలివచ్చే అభ్యుదయ చ
క్రాల కిడుదాం స్వాగతమ్మును"

—జె. బాపురెడ్డి.

బెంగాలీలకు చిత్తరంజన్‌దాస్, సుభాష్ చంద్రబోస్, తమిళులకు రాజాజీ అన్నాదొరై, మహారాష్ట్రులకు తిలక్, గోఖలే వారి కాలాలలో ఏకైక నాయకులు.

అంతటి అదృష్టం నోచుకోలేని 'విలక్షణ' జాతి తెలుగువారిది. ఈ 'విలక్షణ'తనే 'విశిష్టత' అనేవారు కూడా మనలో లేకపోలేరు. జీవించి ఉండగా ఎవ్వరిని ఏకైక నాయకుడుగా శ్లాఘించమని శపథంబూనిన తెలుగువారు అందుకు అను కూలంగానే రెండుసార్లు ఆంధ్రకేసరి ప్రకాశాన్ని ముఖ్యమంత్రి పదవినుండి దించివేసారు. ఆంధ్రులంతా కలసి సంజీవరెడ్డికే ఓటుచేస్తే ఆయన 1969 లోనే రాష్ట్రపతి అయ్యేవారు. ఆరు సంవత్సరాల నుండి అవిచ్ఛిన్నంగా ముఖ్యమంత్రిగా కొనసాగుతున్న బ్రహ్మానందరెడ్డి ఎక్కడ తెలుగుజాతి ఏకైక నాయకునిగా స్థిరపడిపోతాడేమోనని అడపాతడపా చిన్నపాటి అల్లర్లు లేవతీసినవారికి తెలంగాణా ఆందోళన వెతుకబోయిన తీగలా లభించింది. ప్రత్యేక తెలంగాణా బంజర్లను సాగుచేయడానికి పూనుకొన్న వారు ఉద్యోగులు. దీనికి నీటి సరఫరా చేసింది ముల్కీ చట్టం.

కేంద్ర నాయకత్వం కూడా ఆంధ్రదేశంలో ఎవ్వరిని ఏకైక నాయకునిగా బలపడనివ్వలేదు. ప్రకాశంగారికి వ్యతిరేకంగా గాంధీజీ డా॥ పట్టాభిని చేర దీసారు. సంజీవరెడ్డికి వ్యతిరేకంగా కొంతకాలం అల్లూరి సత్యనారాయణరాజును తర్వాత బ్రహ్మానందరెడ్డిని దగ్గరకు తీసారు. ఇప్పుడు బ్రహ్మానందరెడ్డి వ్యతిరేక శక్తులకు తెలంగాణా ఆందోళనరూపంలో పరోక్షంగా సహాయం లభించింది.

## కోర్టుల వ్యతిరేకత

ప్రభుత్వ ఉద్యోగాల గురించి పార్లమెంటు 1957లో చేసిన చట్టం ప్రకారం తెలంగాణా ప్రాంతీయులకు 15 సంవత్సరాల నివాసార్హతను బట్టి తెలంగాణాలో తహసీల్దారు హోదావరకు అన్ని ఉద్యోగాలివ్వాలనే శాసనం చెల్ల నేరదని 1969లో సుప్రీంకోర్టు తీర్పు నిచ్చింది. అలాంటి నిబంధన 16వ ఆర్టికల్ ప్రకారం రాష్ట్రంలో విధించబడవచ్చు కానీ రాష్ట్రంలోని భాగంలో విధించరాదు. కనుక రద్దు అన్నది కోర్టు. దాంతో ప్రత్యేక రాష్ట్రం యిచ్చి అలాంటి రక్షణ యిప్పించమన్నారు తెలంగాణా వారు.

ఒక్క సంజీవయ్యగారి రెండేళ్ళ పరిపాలనలో తప్ప ఉపముఖ్యమంత్రి పదవి, ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షపదవి తెలంగాణావారికి దక్కలేదు. స్పీకరు పదవి రాలేదు. చీఫ్ సెక్రటరీ కాలేదు. రావలసిన ఉస్మానియా విశ్వవిద్యాలయ

ఉపాధ్యక్ష పదవి పోయింది. చూస్తుండగానే మహారాష్ట్రకు విదర్భనుంచి కన్నం వార్, కర్నాటకకు హైదరాబాద్ కర్నాటక్ నుంచి వీరేంద్రపాటిల్ ముఖ్యమంత్రులైనారు. తెలంగాణాలో మద్యపాన నిషేధం లేనందువలన ఆబ్కారీ మిగుళ్ళను ఆంధ్రప్రాంతంలో ఖర్చు చేసినట్లు వదంతులు వ్యాపించాయి.

రాజకీయాల్లో అవకాశవాదమెక్కడ ప్రారంభమవుతుందో ఎక్కడ సమాప్త మవుతుందో చెప్పలేం. అవకాశవాద జాతికి చెందిన రాజకీయవాదుల సంఖ్య తెలంగాణాలో కూడ తక్కువేమీ కాదు. అలాంటివారికి యీ ఉద్యమం మంచిప్రేరణ యిచ్చింది. సమైక్యాంధ్ర వ్యవస్థలో అమరని తెలుగేతర శక్తులకు ప్రత్యేక తెలంగాణా అవతరణావకాశం కొత్త వెలుగుబాటగా కనిపించింది.

తెలంగాణా సమస్య ప్రధానంగా ఆర్థికమైనది. ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వం, తరవాత కూడా ఆంధ్ర-తెలంగాణా సమైక్యతను మనసారా అంగీకరించని వర్గాలు కొన్ని తెలంగాణా ప్రాంతంలో ఉన్నాయి. కాని అవి 1969 సంవత్సరారంభం దాక బలాన్ని పుంజుకోలేక పోయాయి. అందుకు 1956 నుంచి 1966 వరకు – అంటే తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలం ముగింపు వరకు, మనరాష్ట్రంలో ఆర్థికాభ్యున్నతి కార్యక్రమం చురుకుగా సాగుతూ ఉండడమే కారణం. ఏ కారణాలవల్లనైతేనేమి 1966-67 లగాయతు మన అభివృద్ధి కార్యక్రమం పూర్తిగా కుంటుపడింది. నిరుద్యోగం నిర్వ్యాపారత విస్తృతమయ్యాయి.

ఆంధ్రప్రదేశ నిర్మాణానికి కొన్ని హామీలు, వాటి నసులు పరచవలసిన నైతిక బాధ్యత, పునాది, వీటి విస్మరణ జరిగించనటానికి అఖిలపక్ష ఒప్పందమే తార్కాణం.

## అఖిల పక్ష ఒప్పందం

తెలంగాణా రక్షణలు అమలుపరచడానికై తీసుకొనవలసిన చర్యల గురించి చర్చించడానికి ముఖ్యమంత్రి, అన్ని రాజకీయ పార్టీల నాయకులతో 1969 జనవరి 19వ తేదీన ఒక అఖిల పక్ష సమావేశం ఏర్పాటు చేసినారు. ఉద్యోగాలు, ఉద్యోగుల సీనియారిటీ జాబితాలు, తెలంగాణా మిగులు నిధులు అభివృద్ధి విద్యాసౌకర్యాలు మొదలైన వాటినిగురించి చర్చలు జరిగాయి.

ఈ కమిటీలో పాల్గొన్న సభ్యులు :- సర్వశ్రీ జె. చొక్కారావు, జె. అచ్యుతరెడ్డి, వి. బి. రాజు, పి. నరసింగరావు, సి. హెచ్. రాజేశ్వరరావు, బద్రీవిశాల్ పిట్టీ, వై. వి. కృష్ణారావు, పి. వి. నరసింహారావు, జూపూడి యజ్ఞ నారాయణ, కుడిపూడి ప్రభాకరరావు, వి. రామారావు, రోడామిస్త్రీ, సి. జంగా రెడ్డి, ఎ. వాసుదేవరావు, సుల్తాన్ సలాఉద్దీన్ ఒవైసీ, పి. నరసారెడ్డి, జె. రంగా రెడ్డి, పి. గోవర్ధనరెడ్డి, జలగం వెంగళరావు, టి. పురుషోత్తమరావు, కె. రామ చంద్రారెడ్డి, కమాలుద్దీన్, ఎర్రం సత్యనారాయణ, సి. హెచ్. వి. సి. మూర్తి రాజు, కె. రాజమల్లు, కె. సుదర్శన్‌రెడ్డి, కాకాని వెంకటరత్నం, ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య, కాజ రామనాథం, టి. రామస్వామి, సీలం సిద్దారెడ్డి, అరిగె రామస్వామి, ఎన్. ప్రసాదరావు పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, జె. వి. నరసింగరావు, కె. వి. నారాయణరెడ్డి, బి. వి. గురుమూర్తి, మహమ్మద్ ఇబ్రాహిం అలీ అన్సారీ, గౌతు లచ్చన్న, వావిలాల గోపాలకృష్ణయ్య, నరసింహారెడ్డి, కొండా లక్ష్మణ్ బాపూజీ, కాసు బ్రహ్మానందరెడ్డి.

అఖిలపక్ష సమావేశం ఈ దిగువ నిర్ణయాలను గైకొన్నది:-

## ఉద్యోగాలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగుల నియామకం నిబంధనల క్రింద తెలంగాణా ప్రాంతీయులకు రిజర్వుచేసిన ఉద్యోగాలలో నేరుగా, లేక ప్రమోషన్ ద్వారా, లేక బదిలీద్వారా నియమించబడిన అన్యప్రాంతవాసులైన వ్యక్తుల నందరినీ వెంటనే తొలగించడం జరుగుతుంది. ఆ విధంగా ఏర్పడిన ఖాళీ లన్నిటినీ అర్హులైన తెలంగాణా ప్రాంతీయుల నియామకం ద్వారానే భర్తీ చేయడం జరుగుతుంది. అట్టి అభ్యర్థులు లభించని సందర్భాలలో అట్టివారు లభ్య మయ్యే వరకు ఆ పదవులను ఖాళీగా ఉంచడం జరుగుతుంది. ఆపైన పేర్కొన్న తరహాలో తక్షణచర్యలు ప్రారంభమవుతాయి.

ఆ విధంగా ఉద్యోగాల నుండి తొలగించబడిన అన్యప్రాంతీయులకు సర్వీస్ విచ్ఛిత్తి లేకుండా ఆంధ్రప్రాంతంలో ఉద్యోగాలు చూపుతారు. అవసర మైతే తాత్కాలికంగా అదనపు కొత్త పదవులను కల్పిస్తారు.

ఈ నిర్ణయాలను వెంటనే ఖచ్చితంగా అమలుజకిపే బాధ్యత నిర్వహణకై ఇద్దరు సీనియర్ అధికారులను నియమిస్తారు.

దొంగ ముల్కీ సర్టిఫికేట్ల ఆధారంగా ఉద్యోగాలు సంపాదించుకొన్న వారి ద్యోదులపై దర్యాప్తు కొనసాగుతుంది.

## చట్ట ప్రాతిపదికపై ఏర్పడిన సంస్థలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగుల నియామకపు (ముల్కీ నిబంధన) చట్టం నిబంధనలు ప్రభుత్వోద్యోగులకు స్థానిక పరిపాలన క్రిందగల ఉద్యోగాలకే వర్తిస్తుంది. ఈ చట్టం ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి బోర్డుకు వర్తించదని హైకోర్టు ఇటీవల తీర్పు చెప్పినది. ఈ సంస్థలు రాష్ట్రవ్యాప్తం అయినందున వాటిలోని ఉద్యోగాలకు కూడా ప్రభుత్వోద్యోగుల విషయంలో వలెనే తెలంగాణా ప్రాంతపు అభ్యర్థులకు రిజర్వేషన్ ఉండాలని ప్రభుత్వం భావిస్తున్నది. ఈ నిబంధనలు రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డుకు వర్తింపజేసే విషయంలో హైకోర్టు తీర్పుపై రాష్ట్ర ప్రభుత్వం వెంటనే అపీలు దాఖలు చేస్తుంది.

## సీనియారిటీ జాబితాలు

ఆంధ్ర తెలంగాణా ఉద్యోగులకు వారి హోదాలు నిర్ణయిస్తూ ఒక జాబితాను కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన అన్ని సందర్భాలలోను, లేక అట్టి జాబితాల తయారీ, లేక వాటి సవరణకై ఆదేశాలు జారీచేసిన సందర్భాలలోనూ, అట్టి ఆమోదం పొందిన జాబితాలనే, వారి ఉద్యోగ నిబంధనలను క్రమబద్ధం చేసే విషయంలో అనుసరించడం జరుగుతుంది. కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన ఆ తరహా జాబితాలు లేని సందర్భాలలోను, లేక అట్టి జాబితాల తయారీకి, సవరణకు ఆదేశాలు జారీకాని సందర్భాలలోను, కేంద్రప్రభుత్వామోదం లభించేవరకు రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న తాత్కాలిక జాబితాలను అనుసరించడమే కొనసాగుతుంది. పదవులను సమస్థాయిలో ఉండేటట్లు చేసే విషయంలో, లేక హోదాల నిర్ణయానికి ఉమ్మడి జాబితాలను తయారు చేసే విషయంలో కేంద్ర ప్రభుత్వం ఏదైనా ఆదేశం జారీచేసిన సందర్భంలో ఇక ఆ విషయంపై ఎట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరపకుండా అట్టి ఆదేశాన్ని రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తుంది.

## తెలంగాణా మిగులు నిధులు

అఖిలపక్ష వొప్పందంలో తెలంగాణా మిగులు నిధులగూర్చి చర్చలు జరిగినవి. అపోహలను తొలగించి తెలంగాణా మిగులు నిధులను తేల్చడానికి కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్‌ను అభ్యర్థించడాని కంగీకారం కుదిరింది.

1956 లో జరిగిన పెద్దమనుషుల ఒప్పందం తరువాత తెలంగాణాకు జరిగిన మరొక అనుకూలమైన ఏర్పాటే అఖిలపక్ష ఒప్పందం. అయితే తెలంగాణా ఆందోళన ఉధృతదశకు చేరేసరికి సంతకాలు చేసినవారిలో కొందరు ముఖ్యులు జారుకున్నారు.

అఖిలపక్ష ఒడంబడిక ప్రకారం లెక్కలు తీయిస్తే తెలంగాణా ప్రాంతంలో 4500 మంది గైర్ ముల్కీలు పనిచేస్తున్నట్లు తేలింది. వారిని ఆంధ్రప్రాంతానికి తరలించటానికి సుప్రీంకోర్టు అడ్డు వచ్చినది. ఈ పరిస్థితి నెదుర్కొనేందుకై ముఖ్యమంత్రి తెలంగాణాకు ప్రత్యేకంగా 2000 ఉద్యోగాలు కొత్తగా కల్పించి, వాటికి అభ్యర్థుల నియమించే అధికారం కలెక్టర్ల కిచ్చారు.

అఖిలపక్ష ఒప్పందంలోని రెండవ అంశం తెలంగాణా మిగులు నిధులు. కుమార్ లలిత (అకౌంటెంటు జనరల్ హోదా కలిగిన కేంద్ర ఉద్యోగి) నివేదిక ప్రకారం తేలిన తెలంగాణా మిగులు నిధులు 34.10 కోట్ల రూపాయలు భార్గవా కమిటీవారు తేల్చిన మిగులు నిధులు 28.34 కోట్లు.

## విభిన్న వర్గాలు

ఇదీ ఇలా ఉండగా మంత్రి కొండాలక్ష్మణ్ బాపూజీ తెలంగాణాకు ఆంధ్ర ప్రదేశ్‌లోని అంతర్భాగంగా స్వతంత్ర ప్రతిపత్తి ఇవ్వాలన్నారు. ఆయనమాట చెల్లలేదు. ఢిల్లీలోనే ముఖ్యమంత్రికి రాజీనామా నందజేసి డా॥ చెన్నారెడ్డితో మంతనాలు జరపడం ప్రారంభించారు. శ్రీ నూకల సర్వోత్తమరెడ్డి ఆంధ్రులభాష తెలంగాణావారి భాష ఒకటి కాదన్నారు. జలగం వెంగళరావు మాత్రం తెలంగాణా వారికిచ్చిన హామీలు సాధించుకొనేందుకు ఏ సహాయం చేయడానికైనా తాము సిద్ధంగా ఉన్నామని ప్రత్యేక రాష్ట్రవాదాన్ని మాత్రం తాము అభినందించజాలమని బహిరంగంగా చెప్పారు. కారణాలు ఏమైనా నూకల రామచంద్రారెడ్డి జె. చొక్కారావులు ప్రత్యేకవాదులు కారు.

## తెలంగాణా ప్రజాసమితి – 'ఫైర్ ఈటర్'

ఆంధ్రప్రదేశ్ రాజకీయాలలో డా॥చెన్నారెడ్డి శక్తిమంతుడైన నాయకుడు. ఈనాటి తెలంగాణా ముఖ్యతరం కాంగ్రెసు నాయకులలో చాలామంది ఆయన రాజకీయ పాఠశాలలో శిక్షణ పొందినవారే. కనుక వారికి ఆయన ఎడల వ్యక్తిగతమైన అభిమానముంది. ఆయనకు ఛత్రం పట్టేవారున్నారు. డా॥ చెన్నారెడ్డి కొంతకాలం బూర్గుల రామకృష్ణారావు, కె. వి. రంగారెడ్డి నాయకత్వంలో పనిచేసినా అంతా స్వయంకృషి స్వప్రభావం. స్వయం సిద్ధం. ఒకరు చెప్పితే వచ్చింది కాదు. ఒకరివద్ద నేర్చింది కాదు. పాతికేళ్ళ వయస్సుకే పార్లమెంటు సభ్యులైనారు. పదేళ్ళు రాష్ట్రమంత్రిగా పనిచేశారు. కేంద్రమంత్రిగా అఖిలభారత రాజకీయాలలో రాణించారు. ఆయనది ఒకరికి లొంగి ఉండే స్వభావంకాదు. పండిత గోవింద వల్లభ్‌పంత్‌కు అందరు పాదస్పర్శ చేస్తుంటే ఆపని ఆయన చేయలేదు. శ్రీమతి ఇందిరాగాంధీ కాంగ్రెసు అధ్యక్షులు కాకపూర్వంనుండే వారిరువురి మధ్య స్నేహ సంబంధాలున్నాయి.

ఏ. మదన్‌మోహన్ కన్వీనర్‌గా ఏర్పడిన "పీపుల్స్ కన్వెన్షన్" ప్రజా సమితిగా మారింది. 1969 ఆగష్టు 27వ తేదీన హైదరాబాద్ కార్పొరేషన్ ఎన్నికలలో ప్రత్యేకరాష్ట్ర వాదాన్ని సమర్థించే ఎం. లక్ష్మీనారాయణ మేయరుగాను మేడం రామచంద్రయ్య ఉపమేయర్‌గాను ఎన్నికైనారు. విశ్వవిద్యాలయంతో సహా తెలంగాణాలోని విద్యాలయాలన్నీ వరుసగా తొమ్మిది మాసాలవరకు మూసి ఉంచబడ్డాయి. డాక్టర్ చెన్నారెడ్డి ప్రజాసమితి అధ్యక్షులుగా ఎన్నికైన వెంటనే తెలంగాణా ఆందోళనకు ప్రాముఖ్యం లభించింది. అఖిలభారత పత్రికలు డా॥ చెన్నారెడ్డిని "ఫైర్ ఈటర్" గా పేర్కొన్నాయి.

1970 లో పార్లమెంటుకు జరిగిన మధ్యంతర ఎన్నికల్లో వెల్లువలా విజృంభించిన ప్రజాసమితి పర్వతాలనుకున్నవారిని పెళ్ళగించివేసి తెలంగాణా లోని 13 స్థానాలలో 10 స్థానాలను గెలుచుకొని లోకసభలో ఎనిమిదవ పెద్ద పార్టీ అయింది. ప్రధాని అష్టసూత్ర పథకాన్ని అంగీకరించి తెలంగాణా ప్రజా సమితిని కాంగ్రెసులో విలీన పరిచారు, డాక్టర్ రెడ్డి. బ్రహ్మానందరెడ్డిని గద్దె దించడానికి డా॥ చెన్నారెడ్డిని ప్రధాని వాడుకున్నారని ప్రచారం జరిగింది.

## రాజుగారి యునైటెడ్ ఫ్రంట్

తెలంగాణా ప్రత్యేకరాష్ట్ర ఉద్యమం డా॥ చెన్నారెడ్డి చేతుల్లో ఉండటం యిష్టంలేని వి. బి. రాజు తమ నాయకత్వంకూడా ఉందనిపించుకునేందుకు అసెంబ్లీలో యునైటెడ్ ఫ్రంట్ (టఫ్)ను సృష్టించి దానికి 'సదర్‌సాబ్' అని పించుకున్నారు. అందుకే ప్రజాసమితి నాయకత్వానికి, టఫ్ నాయకత్వానికి మొదటినుంచీ తూర్పు పడమరలే. ప్రజాసమితిలో డా॥ చెన్నారెడ్డి నాయకత్వం అంగీకరించని వారంతా వి.బి. రాజు పరోక్షనాయకత్వ ఛాయలో నూకల రామ చంద్రారెడ్డి, కొండాలక్ష్మణ్ నాయకత్వం క్రింద తెలంగాణా కాంగ్రెసు పేర మరో వర్గంలో చేరిపోయారు.

1934 లోనే తెలంగాణాలో స్థిరపడిపోయిన పల్లూరి బసవరాజు ఆంధ్ర మహాసభలనాటి నాయకుడు. రాజ్యాతంత్రం నడపటంలో కళా వెంకటరావు అంతటివ్యక్తి. వెల్లోడీ కాలంనాటి మంత్రి. అయితే రాజుగారికి పూర్తికాలం మంత్రిపదవిలో ఉండే యోగం లేదు. 1952 లో బూర్గుల రామకృష్ణారావు మంత్రివర్గంలో చేరిన రాజుగారు ముఖ్యమంత్రితో విభేదించి మధ్యలోనే 'గుడ్‌బై' అన్నారు. 1956 లో సంజీవరెడ్డిగారి మంత్రివర్గంలో చేరితే ఎన్నికల్లో గెలుపు చెల్లదని ట్రిబ్యూనల్ ఇచ్చిన తీర్పుపై 1959 లో మంత్రిపదవికి రాజీనామా చేశారు. 1967 ఎన్నికల్లో గెలిచి బ్రహ్మానందరెడ్డిగారి మంత్రివర్గంలో రెవిన్యూ మంత్రి అయినారు.

రాజకీయ రథాన్ని స్వయంగా నడపడం కంటే నడిపించేవారికి సహాయ పడటమే వి.బి. రాజుకు అలవాటు. రాజకీయ నాటకాలను స్వయంగా ఆడించడం కంటే ఆడించేవారికి సహాయపడి తెరవెనుక నాయకుడుగా ఉండటమే ఆయనకు సరదా. ముఖ్యమంత్రికి సచివుడుగా సారథిగా ఉంటున్న రాజుగారు ఆయనతో విభేదించి రాష్ట్ర సమైక్యతకై ముఖ్యమంత్రి రాజీనామా చేయాలని ప్రకటించి మంత్రివర్గంనుంచి బైటపడ్డారు. తాను పెంచి పోషించిన ఫ్రంట్ పక్షాన రాజ్య సభకు ఎన్నికై తదాదిగా కేంద్ర రాజకీయాలలో నిమగ్నులై పోయారు.

## ఉద్యమం వెర్రితలలు

కేంద్రప్రభుత్వానికి వ్యతిరేకంగా నడుపవలసిన యీ ఉద్యమం దురదృష్ట

వశాస్త్ర ఆంధ్రులపైన ముద్రించబడిన విపరీతమైన వ్రాతలను వేసింది. ఆంధ్ర స్త్రీలకు అవమానకరమైన రాతలతో గోడలను నింపివేశారు. నిరసన వ్రతాలు సత్యాగ్రహాలతో ఆరంభమైన యీ ఉద్యమం ఆ దశను దాటి బస్సులను పోస్టాఫీసులను తగులబెట్టి ప్రభుత్వ ఆస్తికి నష్టం కలిగించడం, ఆంధ్ర ప్రాంతం నుండి వచ్చినవారి భవనాలను తగులబెట్టడం దశకు వచ్చింది. విద్యాలయాలన్నీ మూసివేశారు. తలాతోకాలేని అపవాదులను ప్రచారం చేశారు. అవకాశాన్ని తీసుకొని సాంఘిక వ్యతిరేకశక్తులు రంగంలో దిగాయి. జిల్లాలలో పనిచేసే ఆంధ్ర ఉద్యోగులు ముఖ్యంగా ఉపాధ్యాయులు తమ పదవులను వదిలిపెట్టి ఆంధ్రప్రాంతానికి వెళ్ళిపోయారు. ఈ ఉద్యమంలో గమనించవలసిన విషయమేమిటంటే ఇది ఒక ఆంధ్రప్రాంతానికి చెందినవారికి వ్యతిరేకంగా మాత్రమే జరిగింది. తెలుగు మాతృభాష కానివారందరూ ఆనాడు రాష్ట్రంలో క్షేమంగానే ఉన్నారు.

## "వీర తెలంగాణా మాది — వేరు తెలంగాణా కాదు"

ఈ ఉద్యమకాలంలో ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు శ్రీ రావినారాయణ రెడ్డి ప్రచురించిన ఒక కరపత్రం మేధావులను ఆకర్షించింది. తెలంగాణా ఇతిహాసంలో మొదటినుంచి తుదివరకు రావి నారాయణరెడ్డి పాత్ర ప్రధానమైనది. పార్టీ అనుబంధాలతో నిమిత్తం లేకుండా అందరి అభిమానం పొందిన నాయకుడాయన. ఇది అనేక అపోహలను తొలగిస్తుంది.

"ఆంధ్రప్రాంతంలోని 70 నుండి 80 తాలూకాలలో కృష్ణా, గుంటూరు ఉభయ గోదావరి నెల్లూరు జిల్లాలలోని 20 శాతం తాలూకాలు మాత్రమే వ్యవసాయంలో అభివృద్ధి చెంది ఉన్నవి. ఈ 20 తాలూకాలలో వచ్చిన అభివృద్ధి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత వచ్చిందికాదు. అక్కడ ప్రకృతి సిద్ధమైన భౌగోళిక పరిస్థితి, సారవంతమైన భూమి, సర్ ఆర్థర్ కాటన్ కృష్ణా గోదావరి ఆనకట్టలను శతాబ్దం క్రితమే నిర్మించిన కాలువలద్వారా చేసిననాటి సరఫరా కారణాలు. ఈ 20 తాలూకాలు మినహా మిగిలిన ఆంధ్రప్రాంతమంతా తెలంగాణా జిల్లాలవలెనే వెనుకబడి ఉంది. కొన్ని ప్రాంతాలు ఇంకా వెనుకబడి ఉన్నాయి. రాయలసీమ నిరంతరం కరువుకు ఆటపట్టు. ఈ కరువునివారణలకు గత 12 సంవత్సరాలుగా ప్రభుత్వం ఇంచుమించుగా ఏమీచేయలేదనే చెప్పవచ్చు.

అభివృద్ధికై అంతా కలసిఉండాలి"అని రావి నారాయణరెడ్డి విజ్ఞప్తి. సమైక్యత కై జాతీయ దృక్పథంతో కృషిసల్పినవారు కమ్యూనిస్టులే.

## జాతీయస్థాయిలో విభజన నిరాకరణ

రాష్ట్ర విభజనను జాతీయస్థాయిలో స్వతంత్ర పార్టీ మాత్రమే బలపరిచింది. రిపబ్లికన్ పార్టీ పి.ఎస్.పి; ఎస్.ఎస్.పి.. బలపరచలేదు. పెరుగుతున్న ఉద్యమానికి తట్టుకొనలేక కేంద్రపార్టీల అభిమతానికి విరుద్ధంగా రాష్ట్రస్థాయిలో యీ పార్టీలు విభజనకు అంగీకరించాయి. రిపబ్లికన్ పార్టీ రాష్ట్రశాఖ అధ్యక్షురాలు శ్రీమతి జె. ఈశ్వరీబాయి, పి.ఎస్.పి. రాష్ట్ర శాఖ అధ్యక్షులు ఎస్.బి. గిరి; ఎస్.ఎస్.పి., రాష్ట్రశాఖ అధ్యక్షులు బద్రీవిశాల్ పిట్టీ ప్రత్యేక తెలంగాణా వాదాన్ని బలపరిచారు. ఇత్తెహాదుల్ ముస్లిమీన్ తటస్థంగా ఉండిపోయింది.

తెలంగాణా ప్రత్యేక రాష్ట్ర ఆందోళన జరుగుతున్నప్పుడు 96 సార్లు కాల్పులు జరిగాయి; ఇందువలన 57 మంది మరణించారు. 183 మంది గాయపడ్డారు. ప్రభుత్వ, ప్రైవేటు ఆస్తుల నష్టం విలువ వరుసగా రూ. 47, 54, 000 రూ. 19, 08, 000 ఉంటుందని 1969—70 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పరిపాలనా నివేదికలో పేర్కొనబడింది.

## పెద్దలు పోయారు.

1969 మే 3వ తేదీని రాష్ట్రపతి జాకీర్ హుసేన్ హటాత్తుగా కన్నుమూసారు. ఆయన హైదరాబాద్‌లో పుట్టి పెరిగినవారు. వి.వి. గిరి తాత్కాలిక రాష్ట్రపతి అయినారు.

ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు, ప్రజాకవి, కార్మిక నాయకుడు, గొప్ప దేశ భక్తుడైన కామ్రేడ్ మఖ్దూం మొహియుద్దీన్ 1969 ఆగస్టు 20న మరణించాడు. తుదివరకు ప్రజల కోసమే బ్రదుకుతూ వచ్చాడు మఖ్దూం, 1970 ఫిబ్రవరి 10వ తేదీన ముఖ్యమంత్రికి అప్పుడైన బి.వి. గురుమూర్తి కన్నుమూసాడు. జూలై 24న తెలంగాణా పిత కొండా వెంకట రంగారెడ్డి, నవంబరు 11న ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు దివంగతులైనారు. కాకలు తీరిన దేశభక్తులను రాష్ట్రం కోల్పోయింది.

## అంతరాత్మ ప్రబోధం

1969 బెంగుళూరు సమావేశంలో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ రెండుగా చీలిపోయింది. సంజీవరెడ్డి డి.ఎస్. రాజు, వెంకట సుబ్బయ్య, చెంగ ల్రాయ నాయుడు ప్రభృతులు వ్యవస్థా కాంగ్రెసులో ఉండిపోయారు. (1971 లోక్‌సభకు జరిగిన మధ్యాంతర ఎన్నికల్లో వ్యవస్థా కాంగ్రెస్ రాష్ట్రంలో తుడిచి పెట్టుకుపోయింది.)

అదే సమయంలో రాష్ట్రపతి పదవికి ఇద్దరు ఆంధ్ర మహానాయకులు పోటీ పడ్డారు. సిండికేటు అభ్యర్థిగా పోటీ చేస్తున్న నీలం సంజీవరెడ్డి నామినేషన్ పత్రాలపై సంతకం పెట్టిన శ్రీమతి ఇందిరాగాంధీ అంతరాత్మ ప్రబోధమనే సూత్రం లేవనెత్తి ఎవరి ఓటు హక్కు వారు స్వేచ్ఛగా ఉపయోగించుకొన వలసిందని, కాంగ్రెస్‌పార్టీ క్రమశిక్షణకు విరుద్ధంగా ప్రచారాలు చేసారు. తాత్కాలిక అధ్యక్ష పదవికి రాజీనామా చేసి ఇండిపెండెంటు అభ్యర్థిగా వి.వి. గిరి పోటీ చేసారు.

అర్థం తిరుగని కథ గిరి గారిది. పూర్తిపేరు వరాహగిరి వెంకటగిరి. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మంత్రి. కేంద్రంలో మంత్రి పదవి నిర్వహించిన మొదటి ఆంధ్రుడు. శ్రీలంకలో భారత హైకమీషనర్; కేరళ, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలకు గవర్నరు; తర్వాత మన దేశానికి ఉపరాష్ట్రపతి. చివరకు రాష్ట్రపతి. ఇన్ని పదవులు ఏ తెలుగు నాయకుణ్ణి వరించలేదు.

ఈ ఎన్నికల్లో 62 శాతం కాంగ్రెసు సభ్యులు సంజీవరెడ్డికే ఓటుచేసారు. కమ్యూనిస్టు పార్టీ. అకాలీదళ్, డి.ఎం.కె.; పి.ఎస్ పి.; ఇండిపెండెంట్లు అటు ఇటుగా ఉండిపోయారు. బ్రహ్మానందరెడ్డి ప్రధానమంత్రి పక్షం వహించి వి.వి. గిరి విజయానికి తోడ్పడ్డారు. రాష్ట్రపతి పదవికి ఇంత ఆర్భాటంగా ఎన్నికలు జరగటం మనదేశంలో ఇదే మొదటిసారి.

## తెలంగాణా ఆందోళన - పూర్వాపరాలు

ప్రత్యేక తెలంగాణా ఆందోళన రాష్ట్ర కాంగ్రెస్‌లోని అంతఃకలహాలను రచ్చ కీడ్చింది. సమయం దొరికినపుడల్లా సంజీవయ్య, రఘురామయ్యలు ముఖ్యమంత్రి

మీద ధ్వజమెత్తారు. సంజీవరెడ్డి ఈ సమయంలో తటస్థంగా ఉండిపోయారు. అవసరమైనప్పుడు ముఖ్యమంత్రిని ఆదుకున్నది కామరాజ్, నిజలింగప్ప చౌహాన్‌లు మాత్రమే.

ఆంధ్రప్రదేశ్ నుండి తెలంగాణా విడిపోతే మహారాష్ట్ర, కర్నాటక పునాదులుకూడా కదిలిపోతాయి. వెనుకటి హైదరాబాద్ రాష్ట్రంలోని ఒక ప్రాంతం వీడిపోతే దాని ఇతర పూర్వ భాగాలైన హైదరాబాద్ కర్నాటక, మరాట్వాడా యీ దారినే చూడవచ్చు. ఈ దృష్టితో ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని కేంద్ర నాయకత్వం సమర్థించ లేదు.

## విజయనగర సంస్కృతికి దూరమైన తెలంగాణా

బహమనీ రాజ్యం దక్కనులో 1347లో స్థాపించబడింది. బహమనీ రాజైన మొదటి మహమ్మద్ షా (1358–1375) ఓరుగల్లు కాపయ నాయకుణ్ణి ఓడించి తెలంగాణా ప్రాంతాన్ని బహమనీ రాజ్యంలో కలుపుకున్నాడు. 1475లో దక్కనులో భయంకరమైన క్షామమేర్పడగా దీన్ని ఆసరాగా తీసుకొని ఒరిస్సా రాజు తెలంగాణాపై దాడి సల్పాడు. మహమ్మద్ షా బహమనీ యీ దాడిని తిప్పికొట్టి ఒరిస్సా రాజులకు తెలంగాణా మీద ఏమాత్రం హక్కు లేదని ఒక పత్రం వ్రాయించుకొన్నాడు. తెలంగాణాలో బహమనీ రాజుల పరిపాలన రెండు శతాబ్దాల వరకు ఉండిపోయింది.

ఇదే సమయంలో దక్షిణా పథంలో ఒక గొప్ప హిందూ రాజ్యం వెలసింది. 1336లో జరిగిన మొదటి హరిహర రాయలు పట్టాభిషేకంతో విజయనగర చరిత్ర ప్రారంభమౌతుంది. వీరి పరిపాలన మొదటి రోజుల్లో కర్నాటక లోని బళ్ళారి, చిత్రదుర్గ, కడూరు, శివమొగ్గ, ధార్వాడ, రాయచూరు జిల్లాలు, ఆంధ్ర ప్రాంతం లోని కర్నూలు, అనంతపురం, కడప, నెల్లూరు, చిత్తూరు జిల్లాలుండేవి. వీరి రాజ్య విస్తరణతో 14వ శతాబ్దానికి కృష్ణ మొదలు రామసేతు పర్యంతం గల దక్షిణ దేశానికి వీరు ప్రభువులయ్యారు. వైభవోపేతమైన విజయనగర సంస్కృతికి తెలంగాణా దూరంగా ఉండిపోయింది.

## ఆంధ్ర–తెలంగాణా వారి భాష ఒకటే.

బహమనీ, గోలకొండ సుల్తానులు మత సహనం కలవారు. హిందువులు

ముస్లింల మధ్య మైత్రీభావం నెలకొని పోయి అది మతాంతర వివాహాల రూపంలో బయటపడింది. ప్రభుత్వ లెక్కలు దేశభాషలోనే వ్రాయబడేవి. ఈ సుల్తానులు పర్షియా టర్కీ దేశస్థులకు ఎక్కువ సంఖ్యలో ఉద్యోగాలిచ్చేవారు. దేశీయులైన హిందువులకే ఎక్కువ సంఖ్యలో ఉద్యోగాలు లభించే అవకాశం ఉండేది.

కుతుబ్‌షాహీ సుల్తానులలో చివరివాడైన తానీషా కాలంలో భద్రాచల ప్రాంతానికి తహసీల్దారుగా నున్న కంచెర్ల గోపన్న భద్రాద్రి రామాలయ నిర్మాణానికి ప్రభుత్వ ధనాన్ని వినియోగించి సీతారాములకు అనేక అమూల్య ఆభరణాలు తయారుచేయించినాడు. తానీషా అతన్ని 14 సంవత్సరాలు చెరసాలలో బంధించాడు. ప్రభుత్వ సంపదంతా భద్రాద్రి ఆలయంలోనే రత్నాభరణాల రూపంలో ఉందని తెలుసుకొన్నా దాన్ని కొల్లగొట్టించక పోవడం తానీషా మత సహనానికి తార్కాణం. ఇలాంటి ఉన్నత సంప్రదాయం మన చరిత్రలో మరొక చోట కానరాదు.

ఇబ్రహీం కులీ కుతుబ్‌షా మల్కిభరాముడైనాడు. ఇతడు తెలుగు కవులను ఆదరించి తెలుగుభాషను పోషించాడు. కవి అంటే సరి చెవి తెగ గోసుకునే అభిరుచితో ఈ గోల్కొండ నవాబు రాజ్యమంతా తన కవులను సృష్టించాడు, కవిత్వం రానివారు కూడా అనేకమంది ఈతని ముందు జిలిబిలి అల్లికలు అల్లి "వల్లె" అనిపించుకొని "ముల్లెలు" సంపాదించుకునేవారు. అటువంటి కవులిద్దరో కవుడు మల్కిభరామ్‌ను గూర్చి

యరలవ మదనస యసుచును
బరువడి నీ యక్షరములు భయసయతతులన్
నిరతరమును వ్రాయ నేర్చిరి
మఱి మఱి నీ పుత్రులెల్ల మల్కిభరామా

1687లో ఔరంగజేబు గోలకొండను జయించి మొగల్ సామ్రాజ్యములోని ఒక భాగంగా జేసుకున్నాడు. ఆంధ్రులభాష, తెలంగాణా వారి భాష ఒకటి కాదంటే ఎట్లా?

నిరక్షరాస్యులు అటు ఇటు సమానమే.

పోలీసు చర్య జరిగిన నాటికి తెలంగాణాలో చదువుకొన్నవారి సంఖ్య

నూటికి పది. ఇది ఆనాటి అఖిల భారత అక్షరాస్యతతో దాదాపు సమానమే. ఐతే హైదరాబాద్ రాష్ట్రంలో మూడవ భాగాన్ని ఆక్రమించుకొన్న సమస్థానాలు, జాగీర్లు, పాయేగా యిలాకాలో మాత్రం పరిస్థితి దయనీయంగానే ఉందని చెప్పక తప్పదు. జాగీరు యిలాకాలో 50 చదరపు మైళ్ళకొక పాఠశాల ఉండగా ప్రభుత్వ యిలాకాలో ప్రతి 10.5 చ. మై. కొక పాఠశాల ఉండింది. తెలంగాణా ప్రాంతం ఒక్కటే రాష్ట్రంలో వెనుకబడ్డ ప్రాంతంగా చిత్రించడం వలన జరిగిన పొరపాటుకు తెలంగాణా ఆందోళన కాలంలో తగిన ఫలితం అనుభవించ వలసి వచ్చింది.

## మానసిక కారణాలు

తెలంగాణా, ఆంధ్ర ఉద్యోగుల మధ్య పొంతనకుదరలేదు. ఆంధ్ర ఉద్యోగులు తామే తెలివిగల వారైనట్లుగా సోదర తెలంగాణా ఉద్యోగులను చిన్నచూపు చూడటం. తెలంగాణా ఉద్యోగులు నెమ్మదిగా, తీరికగా పనిచేస్తారు. ఆంధ్ర ఉద్యోగులు చేయదలిస్తే త్వరత్వరగా పని తెముల్చుకుంటారు. దీనివల్ల ఒకర్నొకరు అర్థంచేసుకోవడం కష్టమైపోయింది. పరస్పర ఈర్ష్యాద్వేషాలు ప్రబలినాయి.

2. తెలంగాణా అధికారులలో హిందువులు, ముస్లింలు పని విషయంలో ఎలా ఉన్నా మర్యాద యిచ్చి పుచ్చుకుంటారు. ఆంధ్ర గెజిటెడ్ ఉద్యోగుల ప్రవర్తన కొంత భిన్నంగా ఉండేది. దాంతో ఉభయవర్గాల మధ్య అపోహలు పెరిగినాయి.

3. ఆంధ్రులు తెలంగాణా రైతుల భూములు 3 లేక 5 వందలకో కొని ఎకరానికి ఒక వెయ్యి రూపాయల పంట పండించడం మొదలుపెట్టారు. పొలం అమ్ముకున్న రైతు తన పొలంలోనే కూలి చేయవలసివచ్చింది. తెలంగాణా దేశముఖుకన్న ఆంధ్రప్రాంతంనుండి వచ్చిన రైతు ఎక్కువకూలి యిచ్చినా తన పొలంలోనే కూలి చేయవలసి రావటం, తెలంగాణా గ్రామీణునకు మానసికనష్టం కలిగింది. ఈ భూముల లావాదేవీలకు సంబంధించిన ఒక్క అంశంకూడా ప్రాంతీయ సంఘం దృష్టికి రాలేదు. అవసరం ఉన్నవాడు అమ్ముకుంటె శక్తి ఉన్నవాడు కొనుక్కుంటాడన్న సూత్రం ఈ సందర్భంలో వర్తింపజేయడం దురదృష్టకరం.

3. 1956 కు పూర్వం నిర్మించబడిన గృహాలకు రెంట్ కంట్రోల్ నిబంధనలు వర్తిస్తే ఆ తర్వాత కట్టిన యిండ్లకు యీ నిబంధన వర్తించలేదు. బాధపడ్డవారే బాధపడవలసి వచ్చింది.

4. తెలంగాణాకు ప్రాణప్రదమైన పోచంపాడు వంటి భారీ ప్రాజెక్టుల పని చాలా మందకొడిగా నడిచింది. పూర్వపు హైదరాబాద్ ప్రభుత్వంలో రూపొందించిన అంచనాల ప్రకారం 117 కోట్ల రూపాయలతో నిర్మించవలసిన ఈ ప్రాజెక్టు 24 లక్షల ఎకరాలను సాగుకు తేవాలి. కాని ఆర్థిక వనరుల లోపం వల్ల 59 కోట్ల రూపాయలకు తగ్గించి 5 లక్షల 70వేల ఎకరాలు మాత్రమే సాగులోనికి వచ్చేటట్లు కుదించవలసి వచ్చింది. కేంద్ర ప్రభుత్వంనుంచి అందని సహాయానికి రాష్ట్ర ప్రభుత్వం బాధ్యత వహించవలసి వచ్చింది.

5. హైదరాబాద్ ఇంజనీర్లు నాగార్జునసాగర్ రూపకల్పన చేసినప్పుడు కుడికాలువ నీరు గుంటూరు జిల్లా మొదలగు ఆంధ్రప్రాంతాలను, ఎడమకాలువ తెలంగాణాలోని నల్లగొండ, ఖమ్మం, వరంగల్ జిల్లాల్లోనేకాక కృష్ణాగోదావరీ జిల్లాలలో కూడా కొంత భూమిని సాగుచేయడానికి ఉద్దేశించబడినది. ఈ పథకం ప్రకారం 19వ డిస్ట్రిబ్యూటర్‌నుండి నందిగామ ప్రాంతానికి నీరు వెళ్ళవలసి ఉండగా, అంతవరకు కాలువ నిర్మాణం కాకముందే 16వ డిస్ట్రిబ్యూటర్‌నుండి అడ్డంగా కాలువ త్రవ్వించి నందిగామ ప్రాంతానికి సరాసరి నీటిని అందిజేయాలని ఎత్తువేసినట్లు, ఇది 'కె.ఎల్. రావు ప్రాజెక్టు'గా మారినట్లు ప్రచారాలు జరిగినవి.

## వాంఛూ సంఘం నివేదిక

తెలంగాణాలో ముల్కీలకు ఉద్యోగ సంరక్షణ రాజ్యాంగబద్ధంగా వుండేటందుకు మార్గాలు అన్వేషించడానికి సుప్రీమ్‌కోర్టు మాజీ చీఫ్ జస్టిస్ కె. ఎన్. వాంఛూ అధ్యక్షతన ఒక సంఘం నియమించబడినది. కేంద్ర ప్రభుత్వ అటార్నీ జనరల్ నిరేన్‌డే, మాజీ అటార్నీ జనరల్ ఎం.సి. సెతల్వాడ్ యీసంఘంలో సభ్యులు.

దేశంలో ఏ పౌరుడైనా, ఎక్కడికైనా వెళ్ళి ఉద్యోగం చేసుకునేందుకు రాజ్యాంగం హక్కు యిచ్చినందున ముల్కీ రూల్స్ వంటి నిర్బంధాలు విధించే వీలులేదనీ, ఒక రాష్ట్రంలోని ఉద్యోగాలలో నియామకానికి ఆ రాష్ట్రంవారికే

ప్రాధాన్యత దొరికేటట్టు చట్టం రూపొందించే అధికారం పార్లమెంటుకు ఉన్నప్పటికీ, ఒక ప్రాంతంవారికే ప్రాధాన్యతను పరిమితం చేసే హక్కు పార్లమెంటుకు లేదని వాంఛూ కమిటీ అభిప్రాయపడింది.

ఒకప్రాంతం వారికి కూడా ఈ సౌకర్యం దొరికే విధంగా రాజ్యాంగాన్ని సవరించడం జరిగితే ఉత్తరోత్తరా ఒక జిల్లావారు లేక తాలూకా లేక గ్రామం వారు తమ ప్రాంతంలో ఉద్యోగాలలో తామే నియమింపబడాలనే ప్రమాదం ఏర్పడగలదని వాంఛూసంఘం పేర్కొన్నది. రాజ్యాంగాన్ని సవరించకుండానే స్థానికులకు సహాయపడాలన్న ఉద్దేశం ప్రభుత్వానికి ఉంటే ఆ యా జిల్లాలలో వివిధశాఖల అధికారులకు ఉద్యోగస్తుల నియామకాలపై అధికారాలను యివ్వాలని, రాష్ట్రం మొత్తంలోని కొన్ని తరగతుల ఉద్యోగాలలో అభ్యర్థుల నియమించే అధికారం పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరిధినుండి తొలగించాలని కూడా యీ సంఘం సూచించింది.

## ఉద్యోగస్తులకు కలిగిన యిబ్బందులు

రెండు ప్రాంతాల ఉద్యోగస్తులను విలీనంచేసి ఒక త్రాటిపై తెచ్చేందుకు వారి హోదా, పొందుతున్న వేతనపుస్కేలు, ఉద్యోగధర్మాలు, నిర్దేశించబడిన విద్యాయోగ్యతలు, ఆ పదవి బాధ్యతలు మొదలైనవి పరిగణనకు తీసుకొనవలసి యున్నప్పటికి ఏ ప్రభుత్వశాఖలో కూడ వెంటనే వీటన్నింటినీ సమిష్టిగా పరిగణనకు తీసుకొనడం జరుగలేదు. ఆ మేరకు తెలంగాణా ఉద్యోగులకు నష్టం కలిగింది. అందువలన ఆంధ్రప్రదేశ్ అవతరించి సంవత్సరమైనా తిరుగక మునుపే తెలంగాణా ఉద్యోగులు తమకు జరుగుతున్న ఇబ్బందులను ఢిల్లీకి మోసుకుపోవలసి వచ్చింది.

## భావసమైక్యం లేదు

ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావుగారు 1931 లో ఆంధ్ర బాలికల ఉన్నత పాఠశాలను హైదరాబాద్‌లోని రెసిడెన్సీ బజార్‌లో స్థాపించినప్పుడు దాని పరిగణనకోసం ఉస్మానియా, నాగపూర్, ఆంధ్ర విశ్వవిద్యాలయాలకు వ్రాసినారు. ఉర్దూ తప్ప మరేభాషను ప్రధానభాషగా అంగీకరించ

పోనివ్వండి ఉస్మానియా. తమవద్ద ఆంధ్రభాషకు అలాంటి సౌకర్యములేదన్నది నాగపూర్ విశ్వవిద్యాలయం. తమకు దేశీయరాజ్యాలతో సంబంధం లేదన్నది ఆంధ్ర విశ్వవిద్యాలయం. చివరకు పూనాలోని శాకర్సే భారత మహిళా విశ్వ విద్యాలయం దీన్ని గుర్తించింది.

నిజాం రాష్ట్ర ఆంధ్ర జనసంఘం స్థాపించబడ్డప్పుడు "మేము బ్రిటిష ఆంధ్రులం, మా బ్రిటిషు ఆంధ్ర వ్యక్తిత్వాన్ని వదులుకొనజాలమ"ని ముల్కీ సర్టిఫికేట్లు సంపాదించుకొన్న బ్రిటిషు ఆంధ్రులు ఈ సంఘంలో చేరడానికి నిరాకరించారు. అంతటితోనే ఊరకుండక 'ఆంధ్రజన సంఘం–రాజకీయ సంఘం'అని పత్రికల కెక్కించారు. మాడపాటివారు దీన్ని ప్రతిఘటించినా 'మీ ఆంధ్ర సోదరులే రాజకీయ సంఘమంటుంటే మీరు కాదంటారేమి ?'అని నిజాం ప్రభుత్వ అధికారులు దీన్నొక వ్యవహారంగా చేసుకొని ఆంధ్ర జనసంఘం కార్యాకలాపాలలో అనేక అడ్డంకులు కలిగించారు. ఇలాంటి కొన్ని పాత జ్ఞాపకాలు కొత్త గాయాలను కలిగించినవి.

రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యా, వైజ్ఞానిక రంగాలలో ఆంధ్ర–తెలంగాణా ప్రజలమధ్య కనిపించిన వైవిధ్యం భాషలో కనిపించలేదు. అన్ని బంధాలకన్న భాషాబంధం గొప్పదైంది. ఎన్ని తుఫానులు వీచినా, ఎన్ని ప్రవాహాలు ఎదురైనా రాష్ట్ర సమైక్యతను కాపాడ కలిగింది యీ భాషాబంధమే.

## ప్రకృతి విలయతాండవం

1970 సెప్టెంబరులో ప్రకృతి విలయ తాండవం వల్ల ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరమైన హైదరాబాద్ ప్రజలపై అపార కష్టనష్టాలకు గురిచేసిన దుర్ఘటన ఒకటి సంభవించింది. సెప్టెంబరు 21, 22 రాత్రి నగరంలో కనీ వినీ ఎరుగనటువంటి కుంభవృష్టి కురిసింది. అఫ్జల్ సాగర్ నీరు కట్టలు తెంచుకొని మహోధృతితో వరదల్ని తొక్కడంతో అధిక జననష్టం ఆస్తి నష్టం వాటిల్లింది. భారీవర్షాల మూలంగా పలు భవనాలు కూలిపోయాయి. పల్లపు ప్రాంతాలు జలమయమైనాయి. ఈ భీభత్సంలో 8288 ఇళ్లు కూలిపోయాయి, 42 మంది ప్రాణాలు కోల్పోయారు.

## మంత్రివర్గ విస్తరణ

బెంగుళూరు కాంగ్రెస్ సమావేశానంతరం ముఖ్యమంత్రి 1969 జులైలో

కొత్త మంత్రివర్గాన్ని ప్రకటించారు. నూకల రామచంద్రారెడ్డి, రామభూపాలరెడ్డి చేరలేదు. నూకలవారి నిరాకరణతో ఉపముఖ్యమంత్రి పదవి జె. వి. నరసింగ రావుకు ఇచ్చారు. పి. తిమ్మారెడ్డి, తోటరామస్వామి, పి.వి. నరసింహారావు, కాకాని వెంకటరత్నం, ఎం.ఎన్. లక్ష్మీనరసయ్య, చెంచు రామానాయుడు, కె. విజయభాస్కరరెడ్డి, రుద్రరాజు రామలింగరాజు, శీలం సిద్ధారెడ్డి, ఇబ్రహీం అలీ అన్సారీ, జలగం వెంగళరావు, ఎ. భగవంత రావు, వి. కృష్ణమూర్తి నాయుడు, జి. సంజీవ రెడ్డి, దాసరి పెరుమాళ్ళు (క్యాబినేట్ మంత్రులు) సాగి సూర్యనారాయణ రాజు, ఎ. వాసుదేవరావు, ఏ. సంజీవరెడ్డి, రామచంద్ర రావు కల్యాణి, ఆర్. నారపరెడ్డి. శ్రీమతి రోడామిస్త్రీ (స్టేటు మంత్రులు) మొత్తంలో 28 మంది మంత్రులు. ఆంధ్రప్రదేశ్‌లో ఇంత పెద్దసంఖ్యలో మంత్రి వర్గమేర్పడటం యిదే మొదటిసారి.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ శాసన సభ్యుల సంఖ్య 259. వీరిలో 194 మంది శాసన సభ్యులు, 65 మంది శాసన మండలి సభ్యులు. శాసన సభలోని ప్రతి తొమ్మిదో కాంగ్రెసు సభ్యునికి మంత్రి వర్గంలో ఇప్పుడు స్థానం లభించింది.

మంత్రివర్గ సభ్యుల సంఖ్య పెరగటం 1962 ఎన్నికల తర్వాత ప్రారంభమైంది. పెక్కు రాష్ట్రాలలో ముఖ్యమంత్రులు తమ మంత్రివర్గాలను విస్తృత ప్రాతిపదికమీద నెలకొల్పారు. ఒక్క మద్రాసు ముఖ్యమంత్రి కామ్‌రాజ్ నాడార్ మాత్రమే తొమ్మండుగురున్న మంత్రివర్గాన్ని ఎంచుకొని స్టేటు మంత్రులు, ఉప మంత్రులకు స్థానం కల్పించలేదు.

1962లో మహారాష్ట్ర శాసన సభలోని ప్రతి ఏడవ సభ్యునికి వై. బి. చవాన్ తన మంత్రి వర్గంలో స్థానం లభింపజేసారు. డా॥ బి. సి. రాయ్ పశ్చిమ బెంగాల్ మంత్రివర్గంలో రాష్ట్ర శాసన సభలోని కాంగ్రెసు సభ్యులలో ప్రతి నాలుగో వ్యక్తికి స్థానం కల్పించారు. ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రభాను గుప్త శాసనసభలోని ప్రతి ఆరో వ్యక్తిని మంత్రి వర్గంలో తీసుకున్నారు. విస్తృత మంత్రి వర్గాల నిర్మాణంపై నెహ్రూ కినుక చూపినా వెనుకటి మంత్రి వర్గంలో పన్నెండుగురు క్యాబినెటు హోదా గల వారుంటే ఆయన ఏర్పాటు చేసిన తుది మంత్రివర్గంలో వారి సంఖ్య పద్దెనిమిది.

"నరుము కట్టిన తెలుగు వాలుకు
వెనుక తిరుగం డెన్నడున్,
బాస యిచ్చిన తెలుగు, బాలుడు
పాఱి పోవం డెన్నడున్."

ఎన్నో కష్ట నిష్ఠూరాలను గడ్డు కాలాన్ని అగ్ని పరీక్షలను ఎదుర్కొని నెగ్గుకు వచ్చారు ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి. 1969-70 సంవత్సరాల మధ్య రాష్ట్రాని కేర్పడిన గడ్డుకాలాన్ని ఆయన గడుసు తనంగా సమర్థంగా గట్టెక్కించారు. ఆనాడు తెలుగుదేశం చీలిపోకుండా ఉండటానికి బ్రహ్మానంద రెడ్డి దీక్షాదక్షతలే కారణం.

ఢిల్లీలో పెద్దమనుషుల ఎదుట చేసిన వాగ్దానం ప్రకారం రాష్ట్రసుస్థిరతకు భంగం వాటిల్లని పరిస్థితు లేర్పడగానే ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి 1971 సెప్టెంబరు 24వ తేదీన పదవికి రాజీనామా చేశారు. అసెంబ్లీలో పూర్తి మెజారిటీ ఉన్న ఒక ముఖ్యమంత్రి ప్రజాస్వామ్యం పద్ధతులకు విరుద్ధంగా గద్దె దిగిపోవ డాన్ని చూసి, ప్రజాస్వామ్యామ తల్లి తన బిడ్డకు జరుగుతున్న అన్యాయానికి కంట తడిపెట్టింది. తెలంగాణా నాయకుడైన పాములపర్తి వెంకట నరసింహారావుకు ఆ స్థానం లభించింది.

పి.వి. నిలకడ గల రాజకీయవేత్త. అతివాది కాదు; మితవాది కాదు; అతి భాషి కాదు; మితభాషి కాదు. అవకాశవాది కూడా కాదు ముఖ్యమంత్రిగా ఆయన ఎన్నిక అన్ని వర్గాలకు సంతృప్తి నిచ్చింది.

---

# పి. వి. నరసింహారావు పాలన

"కాకతీయ క్షేత్రంలో
ముక్కాలికలు తెరిన సంజీవి
విస్తారాంధ్రేతిహాసంలో
వేయిపడగల మేధావి."

—సి. నా. రె.

పి. వి. నరసింహారావు పండితుడు. పండితులను నొప్పించకుండా నొప్పించగల సమర్థుడు. అవసర మనుకున్నప్పుడు పరిమితికి తగ్గట్టుగా నొప్పించి కవ్వింపగల చమత్కారం ఆతని కుంది. బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో విద్యామంత్రిగా ఉన్నప్పుడు ఆయన తెలుగు భాషకు చేసిన సేవ అపూర్వమైనది. తెలుగును అధికార భాషగాను, కళాశాల విద్యా బోధనా భాషగాను చేయటానికి ఆయన చేసిన కృషి శ్లాఘపాత్రమైనది. ఇందుకై తెలుగుజాతి ఆయనకెంతో ఋణపడి ఉన్నది. శాసనసభలో యీ విషయమై పి.వి. చేసిన ప్రసంగం - సమర్పించిన శ్వేతపత్రం పండిత పరిశోధకులకు అబ్బురం కలిగించినది. ఈ శ్వేతపత్రం ఆయన పాండిత్యానికి సునిశిత తార్కిక ప్రజ్ఞకు బహుముఖ విజ్ఞానానికి నిదర్శనం. ఆయన చేసిన 'వేయి పడగల' అనువాదం ఆయన సాహిత్య తపస్సుకు తార్కాణం. రచనకు తోడు అనర్గళమైన వాగ్ధార ఆయనది. చెవులకు ఇంపైన రీతిని గంటల తరబడి ప్రసంగించగలరు. చక్కని అనువాదకుడు కూడా. శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ పి. వి. నరసింహారావుకు 1977 జనవరి 1[illegible]న తులనాత్మక సాహిత్యంలో గౌరవ ప్రొఫెసర్‌గా నియమించింది.

## మొదటి మంత్రివర్గం

పి. వి. నరసింహారావు మంత్రివర్గం 1971 సెప్టెంబరు 31న ప్రమాణం చేసింది. పి. వి. నరసింహారావు (ముఖ్యమంత్రి) శ్రీయుతులు బి. వి. సుబ్బారెడ్డి

తోట రామస్వామి, [illegible] రెడ్డి, [illegible] నాయుడు, జె. [illegible] రావు, [illegible] రామలింగరాజు, ఎ. [illegible] రావు, [illegible] రావు, బత్తిన సుబ్బారావు, [illegible] కె. భీంరావు, సి. హెచ్. దేవానందరావు, [illegible] పద్మా భాస్కరరెడ్డి (సహాయ మంత్రులు) [illegible] అమృత రెడ్డి [illegible] మార్చి 21న కార్యక్రమంలో [illegible]. బి.వి. సుబ్బారెడ్డి స్థానంలో వేమారెడ్డి స్పీకరు అయినారు.

## ఇండిపెండెంట్ల విజృంభణ

ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీకి ఐదవ సార్వత్రిక ఎన్నికలు 1972 ఫిబ్రవరిలో జరిగినవి. వెనుకబడిన కులాలకు, మైనారిటీ వర్గాలకు, హరిజనులకు, మహిళలకు వెరసి 60 శాతం సీట్లు కేటాయించ బడ్డాయి. కొత్త పాత కాంగ్రెసు ప్రముఖులలో చాలామందికి యీ సారి ఎన్నికలలో పోటీ చేయడానికి అనుమతి లభించ లేదు. కాంగ్రెసు సీటు లభించని వారిలో శ్రీయుతులు విజయభాస్కర రెడ్డి, నారపరెడ్డి, తిమ్మారెడ్డి, లక్ష్మీనరసయ్య, ఓ. సంజీవిరెడ్డి మున్నగు వారున్నారు. 287 స్థానాలుగల విధానసభలో కాంగ్రెస్ 219. స్వతంత్రపార్టీ 2, సి.పి.ఐ. 7, సి.పి.ఎం. 1, సంపూర్ణ తెలంగాణా ప్రజా సమితి 2, మజ్లిస్ సభ్యులతో కలసి ఇండిపెండెంట్లు 56 స్థానాలు గెలుచుకొన్నారు.

పి.వి. మంత్రివర్గంలోని శ్రీయుతులు అక్కిరాజు వాసుదేవరావు, చెంచు రామానాయుడు, రుద్రరాజు రామలింగరాజు, శ్రీమతి పద్మా భాస్కరరెడ్డి, స్పీకరు శ్రీ వేమారెడ్డి ఓడిపోయారు. మాజీమంత్రులు శ్రీయుతులు కె.వి. నారాయణరెడ్డి, టి. రాఘవులు శ్రీమతి సదాలక్ష్మి, కృష్ణాజిల్లాలో బుచ్చిరామయ్య శ్రేష్ఠి గుంటూరు జిల్లాలో చేబ్రోలు హనుమయ్య సోషలిస్టు పార్టీ నాయకులు శ్రీయుతులు రామచంద్రరావు, బద్రివిశాల్ పిట్టీ, ప్రతిపక్ష నాయకుడు గౌతు లచ్చన్న, ఇండిపెండెంటు నాయకుడు వావిలాల గోపాలకృష్ణయ్య, రిపబ్లికన్ పార్టీ నాయకుడు రమణయ్య. కమ్యూనిస్టు పార్టీ నాయకుడు సి.హెచ్. రాజేశ్వరరావు (చంద్ర రాజేశ్వరరావు కాదు) టి.వి.ఎస్. చలపతిరావు ఓడిపోయిన వారిలో ఉన్నారు.

తెలుగుదేశంలో అనేక ఉద్యమాలు నడిపిన నాయకుడు వావిలాల. స్వాతంత్ర సంగ్రామం నుండి ఆంధ్రోద్యమంవరకు, సంఘ సంస్కరణోద్యమం నుండి శాసన నిర్మాణం వరకు, వయోజన విద్యావ్యాప్తి నుండి గ్రంథాల యోద్యమం వరకు, శాసన సభల నుండి అంతర్జాతీయ సమావేశాలవరకు ఎనలేని కృషిసల్పి ఆంధ్రజాతికి అంకితమై పోయిన వ్యక్తి ఆయన.

అనుభవజ్ఞులైన ప్రతిపక్ష నాయకులు లేని లోపం ఐదవ శాసనసభలో కని పించింది. కాంగ్రెస్‌కు శృంగభంగం కలిగించిన స్థానాలు కూడా లేకపోలేదు. నెల్లూరు జిల్లాలో ఏడుగురు కాంగ్రెసు అభ్యర్థులు తిరుగుబాటు దార్ల చేతుల్లో ఓడి పోయారు. మంథెన నియోజకవర్గం నుంచి ముఖ్యమంత్రితో పోటీచేసిన వేర్పాటు విభాగం నాయకుడు ఇ.వి. పద్మనాభన్, ఆరోగ్యమంత్రి అన్సారీతో మహబూబు నగరు నియోజకవర్గంలో పోటీ చేసిన సంపూర్ణ ప్రజా సమితి అధ్యక్షుడు శ్రీధరరెడ్డిగార్ల డిపాజిట్లు గల్లంతు అయినవి. ప్రజల వేర్పాటు ధోరణులకు బలం ఇవ్వడంలేదని యీ ఎన్నికలు బహిర్గత పర్చాయి.

## వెనుకబడిన తరగతులకు ప్రాధాన్యం

పి.వి. నరసింహారావు నాయకత్వంలో యీసారి ఏర్పడిన మంత్రివర్గంలో వెనుకబడిన తరగతులకు వెనుకబడిన వర్గాలకు అధిక ప్రాధాన్యం లభించింది. ముగ్గురు హరిజనులు, ఐదుగురు వెనుకబడిన కులాలవారు, ఒక గిరిజన సభ్యుడు మంత్రివర్గంలో స్థానం పొందారు. పిడుతల రంగారెడ్డి స్పీకరుగాను తోట రామ స్వామి విధానపరిషత్ అధ్యక్షులుగాను ఎన్నికైనారు. కె.వి. రంగారెడ్డి తర్వాత ఉపముఖ్యమంత్రి పదవి బి.వి. సుబ్బారెడ్డికి లభించింది. శ్రీయుతులు కాకాని వెంకటరత్నం, హయగ్రీవాచారి, అన్సారీ, వెంగళరావు, భగవంతరావు, కృష్ణ మూర్తినాయుడు, మానిక్‌రావు, బత్తిన సుబ్బారావు, మూర్తిరాజు, శ్రీమతి భవనం జయప్రద, సాగి సూర్యనారాయణ రాజు, లుకలాపు లక్ష్మణదాస్, పి. నర్సారెడ్డి, టి. అంజయ్య, ఎం.వి. కృష్ణారావు, కె. ప్రభాకరరెడ్డి (క్యాబినెట్ హోదా మంత్రులు); శ్రీయుతులు చల్లా సుబ్బారాయుడు, జి. రాజారాం, మహేం ద్రనాథ్, కె. గోపాలనాయుడు, ఛాట్టం శ్రీరామమూర్తి, సి.హెచ్. దేవానంద రావు, ఏ. మదన్ మోహన్, ఆర్. శ్యామ్‌రావు, డి. మునిస్వామి వెరసి 29 మంది మంత్రులు.

1972 లో రాష్ట్రానికి సంబంధించిన ముగ్గురు ప్రధానవ్యక్తులు చని పోయారు. జనవరి 22వ తేదీన స్వామీ రామానందతీర్థ, మే 7న సంజీవయ్య, సెప్టెంబరు 4న జె.వి. నరసింహారావు కన్నుమూసారు.

ఏ దృష్టితో చూచినా, సంజీవయ్య విశిష్టవ్యక్తి. మద్రాసులో, కర్నూలులో, హైదరాబాదులో, న్యూఢిల్లీలో ఎన్నోసార్లు ఆయనమంత్రి, ఒకసారి మనకు ముఖ్యమంత్రి, రెండుసార్లు అఖిలభారత కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు. ప్రతి పదవిలో ఆయన రాణించారు; ప్రతి పదవిని రాణింపుకు తెచ్చారు. ఎన్నో పదవులలో ఎంతోకాలంపాటు వున్నా, ఆయన నిర్ధనుడే. ముఖ్యమంత్రినుంచి తప్పుకొన్న తర్వాత ఆయనకు ఒక కారుకూడా లేదు. ఇళ్ళు, వాకిళ్ళు, తక్కిన ఆస్తిపాస్తులు మొదలేలేవు. యాభై ఒకటి వయస్సులో ప్రవేశించగానే మర ణించారు. ఆయన మృత్యువు ఆంధ్రుడైన ప్రతివ్యక్తిని కదిలించివేసింది.

## భూసంస్కరణలు

పి.వి. కీర్తి కిరీటంలో కలికితురాయిగా నిలిచింది, ఆయన హయాంలో రూపొందించిన భూసంస్కరణలు. 18 ఎకరాల మాగాణి భూములపై 54 ఎకరాల మెట్టభూములపై గరిష్ఠ పరిమితి విధించబడింది. ఈ సందర్భంలో భూములు అన్యాక్రాంతం చేయడాన్ని నిషేధించే శాసనం భూసామ్యవర్గాలపై గట్టి దెబ్బ తీసింది. ఆర్థికశక్తి వికేంద్రీకరణ కానిదే రాజకీయ వికేంద్రీకరణ సాధ్యంకాదు. అయితే పార్టీలోని బలమైన శక్తులను పూర్తిగా త్రోసి రాజనడం ఏ ముఖ్య మంత్రికైనా సాధ్యంకాని పని కనుక ఈ సంస్కరణంనుంచి అవసరమైనంత తప్పుకోడానికి సవాలక్ష క్లాజులు రూపొందించక తప్పలేదు. ఇక పేదవర్గాలకు భూమ లెలా లభిస్తాయి ? ఈ సంస్కరణ వలన లాభం మాత్రం ఒకటి జరి గింది. కొందరు భూస్వాములు తమకు గల అదనపు భూములను రైతులకు సులభమైన ధరలకు అమ్మేసుకొన్నారు.

స్వాతంత్ర్య రజతోత్సవాలు, ఆంధ్ర కేసరి ప్రకాశం పంతులు శతజయంతి ఉత్సవాలు రాష్ట్రంలో ఘనంగా జరిగాయి. కేంద్రనీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి డా॥ కె.ఎల్.రావు మంత్రి పదవికి రాజీనామా చేసారు. కాసు బ్రహ్మానందరెడ్డి కేంద్ర హోంమంత్రిగా నియమితులైనారు.

## ప్రత్యేక ఆంధ్రోద్యమం

ఆంధ్రప్రదేశ్ హైకోర్టులోని ముగ్గురు న్యాయమూర్తులు 1970 డిశంబరు 12వ తేదీన ముల్కీరూల్సు చెల్లుతాయని ఇచ్చిన తీర్పును 1972 ఫిబ్రవరి 4వ తేదీన ఐదుగురు న్యాయమూర్తులు రద్దుపరిచారు. దానిపై పి.వి. ప్రభుత్వం సుప్రీంకోర్టుకు అపీలు చేసుకుంది. హైకోర్టు నిర్ణయాన్ని మామూలుగా సుప్రీం కోర్టు బలపరచవచ్చని తద్వారా యీ సమస్య అణగిపోగలదని భావించిన రాష్ట్ర ప్రభుత్వం అభిప్రాయానికి వ్యతిరేకంగా ముల్కీ రూల్సు చెల్లుతాయని 1972 అక్టోబరు 3వ తేదీన సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు రాష్ట్ర ప్రభుత్వానికి అనేక సమస్యలను తెచ్చిపెట్టింది. ఈ తీర్పు తెలంగాణా వారి ఉద్యోగపు హక్కుపై తుది తీర్పు అన్నారు, ముఖ్యమంత్రి పి.వి. నరసింహారావు. ఈ ప్రకటన ఆంధ్రులను కోపోద్రిక్తులను చేసింది. ఇది ముఖ్యంగా ఆంధ్రుల చదువులకు ఉద్యోగాలకు సంబంధించిన సమస్య. ఇది అమలుపరిస్తే ఇంతవరకు ఆంధ్ర విద్యార్థులకు జంటనగరాలలో నూటికి మూడువంతులు లభించే సీట్లు ఇక లభించవు. తెలంగాణా ప్రాంతంలో ఆంధ్రులు ఉద్యోగాలకు అనర్హులౌతారు. కాగా ఆంధ్రేతరులైన మాజీ నిజాం రాష్ట్రవాసులకు యీ ఉద్యోగాలు రావచ్చును. ఈ వైపరీత్యం ఆంధ్ర విద్యార్థులకు మానసికంగా కష్టకారణమైంది. మంత్రులు ఢిల్లీ వెళ్ళారు. ఆంధ్రప్రాంతంలో ఆందోళన పుంజుకొన్నది. బహుశా చరిత్రలో మొదటిసారి ఆంధ్ర అలజడిదార్లు చనిపోయిన మర్నాడు 1972 డిశంబరు 2వ తేదీన ముఖ్యమంత్రి, ఉపముఖ్యమంత్రి రేడియో ఢిల్లీ వార్తలను ఆటంకపరుస్తూ తమ శాంతి సందేశాలు వినిపించారు. అవి ప్రజలపై పనిచేయలేదు.

ఈ సందర్భంలో ముఖ్యమంత్రి ఆంధ్రమంత్రులతోను తెలంగాణా మంత్రులతోను వేరువేరుగా సంప్రదింపులు మొదలుపెట్టారు. ఆంధ్రప్రాంతం అట్టుడికినట్లు ఉడికిపోయింది. తెలంగాణా మంత్రులు ఆంధ్రమంత్రులు ఇచ్చిన వాగ్దానాలను పురస్కరించుకొని ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ పంచసూత్ర పథకాన్ని ప్రకటించారు.

### పంచసూత్ర పథకం

1. ముల్కీ నిబంధనలతో నివాసార్హత తెలంగాణా ప్రాంతంలోని నాన్

గెజిటెడ్ ఉద్యోగాలకు, స్థానిక తరగతివారికే తహసీల్దారు, అసిస్టెంటు సర్జన్ను. జూనియరు ఇంజనీరు వర్గాలకు వర్తిస్తుంది. సచివాలయంలో, శాఖాధిపతుల కార్యాలయాల్లో, ఉమ్మడి సంస్థ కార్యాలయాల్లో ప్రతి మూడు ఖాళీలలో రెండవది ముల్కీ నిబంధన క్రిందకు వస్తుంది.

2. ఈ రక్షణలు తెలంగాణా ప్రాంతంలో 1980 వరకు జంటనగరాలలో 1987 వరకు వుంటాయి.

3. మొదటి లేక రెండవ గెజిటెడ్ గ్రేడ్‌వరకు ప్రమోషన్‌కు సంబంధించిన సర్వీసులను ప్రాంతీయకరణ చేయబడును.

4. ఇప్పుడు తెలంగాణా వారికున్న సాంకేతిక విద్యావకాశాలు పెంచబడతాయి. అదనంగా వచ్చే సదుపాయాలకు నివాసార్హతపై ఆధారపడే ఆంక్షలు ఉండవు.

5. జంటనగరాలలో ఉమ్మడి పోలీసుదళం ఏర్పాటు చేయబడుతుంది.

జూనియరు ఇంజనీర్లు, అసిస్టెంటు సివిల్ సర్జన్లకు యిది వర్తింపచేయటం యీ పంచసూత్ర ప్రత్యేకత. ఇది రాజీ పథకం మాత్రమే కాని శాశ్వత పరిష్కార మార్గం కాదు. దీన్ని ప్రజలామోదించలేదు. ప్రత్యేకరాష్ట్ర డిమాండు ఎక్కువైంది.

## మంత్రుల రాజీనామాలు

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రానికి అనుకూలంగాను, ప్రధాని పంచసూత్ర పథకానికి వ్యతిరేకంగాను ప్రజాభిప్రాయం బలపడటాన్ని చూసి తొమ్మిదిమంది ఆంధ్రమంత్రులు సర్వశ్రీ బి.వి. సుబ్బారెడ్డి, బత్తిన సుబ్బారావు, కృష్ణమూర్తి నాయుడు, కాకాని వెంకటరత్నం, రాజా సాగి సూర్యనారాయణరాజు, పి. బసిరెడ్డి, చల్లా సుబ్బారాయుడు, డి. మునిస్వామి, మూర్తిరాజు కాంగ్రెసు అధ్యక్షునకు తమ రాజీనామా లేఖలందజేసారు. కాల్పులను కళ్ళారాచూసి విపరీతమైన మనస్తాపానికి లోనై 1972 డిశంబరు 24వ తేదీన కాకాని గుండెబద్దలై చనిపోయారు.

1973 జనవరి 11వ తేదీన ముఖ్యమంత్రి ఎనిమిది మంది కొత్త మంత్రు

లను నియమించారు. మంత్రుల పేర్లు:— శ్రీయుతులు మదూరి సుబ్బారెడ్డి, ఆనం వెంకటరెడ్డి, కె. అమరనాథరెడ్డి, జి. సోమశేఖర్, సి. దాస్, వడ్డే నాగేశ్వర రావు, ఆర్. రాజగోపాలరెడ్డి. అదేరోజున రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గాన్ని రద్దు జేస్తూ ఉన్నతాధికార సంఘాన్ని వేసారు. ఈ ఉన్నతాధికార సంఘం రాష్ట్రంలో అధ్యక్ష పరిపాలన సూచించింది. ప్రధాని ఆదేశంపై ముఖ్యమంత్రి పి.వి. నరసింహారావు 1973 జనవరి 17న తమ పదవికి రాజీనామా ఇచ్చారు. రాష్ట్రంలో 1973 జనవరి 18వ తేదీన ప్రవేశపెట్టబడిన రాష్ట్రపతి పరిపాలనలో హెచ్.సి. సరీన్, వి.కె. రావు గవర్నరు సలహాదార్లుగా నియమితులయ్యారు.

## తెలుగు ప్రజల మాగ్నాకార్టా

ఆంధ్రప్రదేశ్ సమగ్రతనూ సమైక్యాన్నీ కొనసాగిస్తూనూ మరింత పటిష్ఠం చేస్తూనూ అదే సమయంలో అన్నిప్రాంతాల ప్రజల సత్వర అవసరాలను దీర్ఘకాలిక అవసరాలను తీర్చడానికోసం, త్వరితంగా నిర్మాణాత్మక చర్యలు తీసుకోవడం గల ప్రాముఖ్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఆంధ్ర తెలంగాణా నాయకులు ఒక షట్సూత్ర పథకం రూపొందించుకొన్నారు. ప్రజల సహకారంతో అన్నిప్రాంతాలలో సమాభివృద్ధిని సాధించడానికి అవకాశాలు కల్పించడం యీ సూత్రంలోని ముఖ్యాంశం.

ఈ సూత్రంతో తెలంగాణాకు ప్రాంతీయసంఘం ముల్కీరూల్సు అవసరం లేకుండా పోయాయి. ముల్కీ నిబంధనలు పేరుకు మాత్రమే రద్దయినా ప్రాంతీయసంఘం లేకపోయినా తెలంగాణా ప్రజల హక్కులకు ఏలాంటి హాని జరుగలేదు. నాన్ గెజిటెడ్ ఉద్యోగాలను తహసీల్దార్లు జూనియరు ఇంజనీర్లు అసిస్టెంటు సర్జన్లను వేరుగా నియమించేటప్పుడు స్థానిక సభ్యులకే ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. వారికి మొదటి రెండవ ప్రమోషన్లు ప్రాంతీయ సీనియారిటీ ప్రకారమే లభిస్తాయి. మూడు ప్రాంతాలకు మూడు ప్రాంతీయ అభివృద్ధి మండలా లేర్పడ్డాయి. రాష్ట్ర ప్రజల విద్యా సౌకర్యాలను వృద్ధిపరచడానికి కొన్ని కోట్ల రూపాయల ఖర్చుతో హైదరాబాద్‌లో కేంద్ర విశ్వవిద్యాలయం ఏర్పడింది. ఉద్యోగుల సాధక బాధకాలను పరిశీలించడానికి ఉన్నతాధికారాలు గల ఒక ట్రిబ్యునల్ ఏర్పడింది ఈ ట్రిబ్యునల్ తీర్పును ఖాయమైనదిగా పరి

గణిస్తారు. దీనితో ఉద్యోగులలో అలుముకొన్న అనిశ్చిత పరిస్థితి తొలగి పోయింది.

రాజధాని నగరాన్ని ప్రణాళికాబద్ధంగా వృద్ధిపరుస్తారు. ఈ అభివృద్ధి పథంలో జంటనగరాల పౌరులకు తగు మేర ప్రాధాన్యం ఇచ్చి వారికి ఉద్యోగాలు లభించే విధంగా చేస్తారు. రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వం నుంచి విరివిగా ఆర్థిక సహాయం లభిస్తుంది. ముఖ్యతరహా, నీటిపారుదల పనులకు మరింత ప్రాముఖ్యమిచ్చి గ్రామీణ విద్యుదీకరణ పథకాల ఎడల ఉదారవైఖరిని అవలంబించడానికి వీలు కలుగుతుంది. ఒక నిర్ణీతకాలంలో రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలు సమానస్థాయికి చేరుకోవడానికి జరిగే కృషిలో తెలంగాణా ప్రాంతాన్ని త్వరితంగా అభివృద్ధికి తేవడం జరుగు తుంది

## ప్రాంతీయాభివృద్ధి సంఘాలు

ఈ షట్సూత్ర పథకం క్రింద ఏర్పడ్డ తెలంగాణా, రాయలసీమ, ఆంధ్ర ప్రాంతీయాభివృద్ధి మండలాల ఖర్చుకై కేంద్ర ప్రభుత్వం నుండి నూరు కోట్ల నిధులు లభించినాయి. ఇందులో హైదరాబాదు నగరాభివృద్ధికై కేటాయించిన పదికోట్లు కలసి ఉంది. ఈ నిధులను తెలంగాణా, రాయలసీమ, ఆంధ్ర ప్రాంతాలలోని 162 వెనుకబడిన తాలూకాలలో అభివృద్ధి కార్యక్రమాలకై 5 : 3 : 2 నిష్పత్తిలో వెచ్చించబడుతున్నది. 1979 మార్చి 31 వ తేదీతో దీని గడువు పూర్తి అవుతుంది.

ఒక్కొక్క ప్రాంతీయ సంఘంలో 16 మంది శాసన సభ్యులు 4 గురు విధానపరిషత్ సభ్యులు ముగ్గురు సాంకేతిక నిపుణులు సభ్యులుగా ఉంటారు. ప్రాంతీయసంఘం అధ్యక్షులకు మంత్రిహోదా ఇచ్చారు.

ఈ షట్సూత్రపథకం ఆంధ్రప్రదేశ్ సమైక్యానికి మార్గాన్నికార్డాగా నిలిచిందని తర్వాత ముఖ్యమంత్రి అయిన శ్రీ జలగం వెంగళరావు రుజువు పరిచారు. ఈ పథకాన్ని రూపొందించడంలో పి. వి. పాత్ర ప్రధానమైనది.

## పి.వి. రాజీనామా

ఆంధ్ర కార్యాచరణసమితి 1973 నవంబరులో శ్రీ పి. వి. నాయకుడుగా

ఉండరాదని నిర్ణయించింది. తదనుగుణంగా పి. వి. నాయకత్వంనుండి విరమించు కొని కొత్త నాయకుని ఎన్నికకు మార్గం సుగమం చేశారు. రాష్ట్ర సమగ్రత పరిరక్షణకు తమ పదవీత్యాగం చేసిన ముఖ్యమంత్రులలో పి. వి. నరసింహా రావు రెండవవారు.

"వీరగంధము దెచ్చినారము
వీరు డెవ్వడో దెల్పుడీ!
పూసిపోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో !!"

ఆ వీరుడు శ్రీ జలగం వెంగళరావు అయినారు. ఆ పూలదండ వెంగళ రావు మెడలో పడింది. ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన 320 రోజుల తర్వాత 1973 డిసెంబరు 10 వ తేదీన సోమవారం సాయంత్రం 5 గంటలకు ఎత్తి వేయ బడింది. తిరిగి ప్రజాప్రభుత్వం నెలకొన్నది.



# వెంగళరావు నాయకత్వం

"తెలుగు వార మొక వెలుగువాకలా
కలసిమెలసి జీవించినప్పుడే
భారతమ్ములో ప్రతిష్ఠ నిలుపుప
భవిష్యత్తులో భాగ్యము పెపపపు.
సమైక్య శక్తికి నిదర్శనంగా
సమాన దృష్టికి దృష్టాంతంగా
తెలుగు వార మొక బాటన నడిచీ
తెలుగుభాషలో రాజ్యం నడిపీ
కష్టజీవులకు కలిమిని పెంచీ
కళామతల్లికి కానుకలిచ్చీ
ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్నంతా
అఖిల విశ్వమున, భరత ఖండమున
ఆంధ్రజాతినే అమరం చేద్దాం !"

హైదరాబాద్ సంస్థాన రాజకీయాలలో 1940లో ప్రవేశించిన శ్రీ జలగం వెంగళరావు స్వయంకృషితో పైకొచ్చిన వ్యక్తి. ఖమ్మం జిల్లా పరిషత్తు అధ్యక్షుడుగా, రాష్ట్ర పంచాయతీ చేంబరు అధ్యక్షుడుగా పనిచేసారు. 1969లో బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో హోం మంత్రిగా పదవి స్వీకరించిన కొద్ది రోజులలోనే సమర్థుడైన హోం మంత్రిగా పేరు పొందారు. ముఖ్యంగా నక్సలైట్ల, నేర్పాటువాదుల పేర జరిగిన దౌర్జన్య చర్యలను 'ఇనుపహస్తం'గా వ్యవహరించి హోంమంత్రిగా తమస్థానాన్ని సుస్థిరం చేసుకొన్నారు. 1972లో సాధారణ ఎన్నికల తర్వాత పి.వి. నరసింహారావు మంత్రివర్గంలో పరిశ్రమల మంత్రిగా చేరి రాష్ట్ర పారిశ్రామిక పురోభివృద్ధికి తోడ్పడ్డారు. చదువుకొన్న నిరుద్యోగులకు దీర్ఘకాలిక వాయిదాలలో తీర్చుకొనే ఋణాల నిచ్చి, చిన్నతరహా పరిశ్రమలను నెలకొల్పుకొని స్వయం ఉపాధిని కల్పించుకొనే అవకాశాలను చూపించారు.

అరాచక వాదం గిట్టని వెంగళరావు త్వరితంగా నిర్ణయాలు చేయడంలో దిట్ట. ఆయనకు రాష్ట్రాభివృద్ధి, రాష్ట్ర రాజకీయాలను మించి వేరే వ్యాపకాలు లేవు. లేని పాండిత్యం ఉన్నదని, రాని కవిత్వం వ్రాయగలనని అనరు. ఉపన్యాసాలు సూటిగా గట్టిగా కుండ బద్దలు కొట్టినట్లు ఉంటాయి. అసాధారణ కార్య సాధనా శక్తిగల నిజాయితీ పరునిగా రాష్ట్ర ప్రజల హృదయాలపై చెరుగని అనేక ముద్రలువేసిన ముఖ్యమంత్రి వెంగళరావు.

## ముఠాలను కట్టలేదు; ప్రోత్సహించలేదు

శ్రీ జలగం వెంగళరావు ముఠాలకు అతీతుడు. ముఠాలను కట్టలేదు. ముఠాలను ప్రోత్సహించలేదు. తెలుగు ప్రజల సమైక్యత కోరి వారి అభివృద్ధికి కృషి చేసేవారంతా ఆయన ముఠాకు చెందినవారే. వివిధ దశలలో ఆయన నిర్మించిన మంత్రివర్గాలే ఇందుకు తార్కాణాలు.

1973 డిశంబరు 10న వెంగళరావు ముఖ్యమంత్రి పదవి స్వీకారం చేసి నప్పటి మంత్రులు: జలగం వెంగళరావు (ముఖ్యమంత్రి) శ్రీయుతులు బి.వి. సుబ్బారెడ్డి (ఉపముఖ్యమంత్రి), నూకల రామచంద్రారెడ్డి, పి. బసిరెడ్డి, జె. చొక్కారావు, జె. రాజమల్లు, సాగి సూర్యనారాయణరాజు, మహమ్మద్ ఇబ్రాహిం అలీ అన్సారీ, కృష్ణమూర్తినాయుడు, బత్తిన సుబ్బారావు, ఎల్. లక్ష్మణదాస్, జి. రాజారాం (మంత్రులు)* నూకల రామచంద్రారెడ్డి. * బి.వి. సుబ్బారెడ్డి మరణంతో 1974 సెప్టెంబరులో మంత్రివర్గ విస్తరణ జరిగి శ్రీయుతులు పి. రంగారెడ్డి, టి. అంజయ్య, పి. నర్సారెడ్డి, చల్లా సుబ్బారాయుడు, ఎం.వి. కృష్ణారావు, చనమోలు వెంకటరావు, భాట్టం శ్రీరామమూర్తి, ఆనం వెంకటరెడ్డి, సి.హెచ్. దేవానందరావు, వి. పురుషోత్తమరెడ్డి, పి. మహేంద్రనాథ్, డి. మునుస్వామి, ఎన్. వెంకట్రామరెడ్డి, సి.హెచ్. దేవానందరావు, ఆసిఫ్ పాషా, కె. వి. కేశవులు, శ్రీమతి లక్ష్మీదేవి మంత్రివర్గంలో చేరడంతో వీరి సంఖ్య 26కు పెరిగింది.

*శ్రీ ఎన్. వెంకట్రామారెడ్డి మరణం, *పి. బసిరెడ్డి రాజీనామాతో 1976 ఆగష్టు 13న మూడవసారి మంత్రివర్గ విస్తరణ జరిగి సర్వశ్రీ చేబ్రోలు హనుమయ్య, కె.బి. నరసప్ప, పరకాల శేషావతారం, ఎజ్జా నారాయణస్వామి,

పి. ధర్మారెడ్డి శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య మంత్రివర్గంలో తీసుకొనబడ్డారు. శ్రీ నరసప్ప స్థానంలో రాయలసీమ ప్రణాళికాభివృద్ధి బోర్డు అధ్యక్షులుగా చిత్తూరు జిల్లాకు చెందిన వీరరాఘవులు నాయుడును నియమించారు. కొత్త మంత్రుల నియామకంతో వీరిసంఖ్య 31కి పెరిగింది. 16 మంది క్యాబినెటు మంత్రులు 15 మంది సహాయ మంత్రులు. వీరిలో ఆరుగురు హరిజనులు. ఒకరు హరిజన క్రిస్టియన్, ఇద్దరు ముస్లింలు, ఆరుగురు వెనుకబడిన తరగతుల వారు. ఇద్దరు మహిళలు. మంత్రివర్గంలో హరిజనులకు, వెనుకబడిన వర్గాలకు ఇచ్చిన ప్రాతినిధ్యం ఇతర రాష్ట్రాలకన్న ఎక్కువ. పిడతల రంగారెడ్డి స్థానంలో రేబాల దశరథరామారెడ్డి స్పీకరు అయినారు.

## ప్రపంచ తెలుగు మహాసభలు

తెలుగు ప్రజల భావ సమైక్యత మెరుగుపరచడానికి, అంతర్జాతీయ సంబంధాలను అభివృద్ధి పరచడానికి ముఖ్యమంత్రి జలగం వెంగళరావు సారధ్యంలో విద్యామంత్రి మండలి వెంకటకృష్ణారావు కార్యనిర్వాహక అధ్యక్షతన హైదరాబాద్‌లో 1975 ఫిబ్రవరి 12వ తేదీనుంచి 18వ తేదీవరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపక్షాన ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించబడ్డాయి. వైవిధ్య పూరితమైన భారతీయ సంస్కృతిలో తెలుగు సంస్కృతికి గల వ్యక్తిత్వాన్ని వెంగళరావు యీ మహాసభల ద్వారా జయప్రదంగా ప్రదర్శించగలిగారు.

ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలను సంక్షిప్తంగా ఇలా చెప్పవచ్చు:

1. ప్రపంచవ్యాప్తంగా ఉన్న తెలుగుప్రజలు, భాషాభిమానులు ఒక వేదిక మీద కలుసుకొని పరస్పరం సంప్రదింపుల, చర్చలద్వారా సాంస్కృతిక భాషా విషయక సంబంధాలను ధృఢపరచుకోవడానికి అవకాశం కల్పించడం.

2. తెలుగుభాష, సాహిత్యం, సంస్కృతి, కళలు మొదలగు వాటి అభివృద్ధిని సాధించటం కోసం తెలుగుప్రజలలో భాషాభిమానులలో సహకార సుహృద్భావాలను పెంపొందించటం.

3. ప్రజలలో ప్రచారంకోసం తెలుగు ప్రజా జీవితానికి, సాహిత్యానికి సంబంధించిన గ్రంథాలను ప్రచురించడం.

4. తెలుగుభాషాధ్యయనం చేయడానికీ, చరిత్ర, కళలు, సాహిత్యంలో పరిశోధనలు చేయడానికీ విశ్వవిద్యాలయాలకు, సంస్థలకు, పరిశోధనలకు సౌకర్యాలను కల్పించడం.

5. పరిశీలక బృందాలను, మేధావుల, రచయితల, కళాకారుల బృందాలను ఆయా ప్రాంతాలమధ్య మార్పిడి చేసుకొంటూ సాంస్కృతిక సంబంధాలద్వారా సదవగాహన పెంపొందించడం.

6. తెలుగువారి భావసమైక్యతను సాధించి, దానిద్వారా భారత జాతీయ అభ్యుదయానికీ, సాత్వికమైన సాంఘిక విప్లవానికీ తెలుగువారు నిర్మాణాత్మకంగా కృషిచేసే అవకాశాలను కల్పించడం.

తెలుగు మహాసభలలో తీసుకున్న నిర్ణయం ప్రకారం ప్రభుత్వం ఒక అంతర్జాతీయ తెలుగుసభను నెలకొల్పింది. అంతర్జాతీయ స్థాయిలోను, దేశీయావసరాలను ప్రత్యేకంగా దృష్టిలో పెట్టుకొని పరిశోధన అధ్యయనాలు నిర్వహించడం యీ సంస్థ ప్రధానాంశం.

## గోదావరి నీటిజలాల ఒప్పందం

ముఖ్యమంత్రి జలగం వెంగళరావు సాధించిన ఘనవిజయాలలో మన పొరుగు రాష్ట్రాలైన మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, కర్నాటక ప్రభుత్వాలతో గోదావరీ నీటిజలాల పంపకం విషయంలో చేసుకొన్న ఒప్పందం ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తుంది. ఈ నదీజలాల వివాదం ఎన్నో సంవత్సరాలనుండి సాగుతూనే ఉంది. దీనివల్ల అనేక నీటిపారుదల ప్రాజెక్టులు ఆగిపోయాయి. నూటకి తొంభై వంతుల నీరు సముద్రం పాలు కాగా అన్నిరాష్ట్రాలు కలిసి కేవలం 10 శాతం నీటిని మాత్రమే ఉపయోగించుకుంటున్నాయి. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వెంగళరావు మహారాష్ట్ర ముఖ్యమంత్రి ఎస్.బి. చవాన్ హైదరాబాద్‌లో 1975 అక్టోబరు 6వ తారీఖున కలిసికొని ఒక చారిత్రాత్మకమైన ఒప్పందం కుదుర్చుకున్నారు.

అంతకుముందు సెప్టెంబరు 18వ తేదీన బెంగుళూరులో కర్నాటక ముఖ్యమంత్రి దేవరాజ్ అర్స్‌ను కలుసుకొని వెంగళరావు గోదావరీ జలాల విషయంలో ఒక తాత్కాలిక ఒప్పందం కుదుర్చుకొనటం జరిగింది. అటు తరువాత 1975

నవంబరు 7వ తేదీన మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి సేథీని కలుసుకొని వెంగళరావు 15 నిమిషాల కాలంలోనే గోదావరీ నదీ జలాలకు సంబంధించిన ఒప్పందం కుదుర్చుకున్నారు. ఈ ఒప్పందం వలన మన రాష్ట్రానికి పోచంపాడు ప్రాజెక్టులో 194 టి.ఎమ్.సి. నీరు లభిస్తుంది. రిజర్వాయరు నీటి మట్టం ట్రిబ్యునల్ ఆంక్ష ప్రకారం 1040 అడుగులు మాత్రమే వుంటే ఈ ఒప్పందం వల్ల అది 1071 అడుగులు వుంటుంది. అత్యధికంగా 1073 వరకు కూడా వుంటుంది. ఇదిగాక పోచంపాడు దిగువన ఒప్పందం ప్రకారం మహారాష్ట్ర ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు 800 టి.ఎమ్.సి. నీటిని వాడుకోవచ్చు. ఈ నిర్ణయంవలన ఇంతవరకు నీటి తగాదాల కారణాలవలన మన రాష్ట్రంలో ఆగిపోయిన ముఖ్యమైన 9 మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టులను మరలా చేపట్టవచ్చు.

కర్నాటక రాష్ట్రంతో నేర్పరచుకొన్న ఒప్పందం ఫలితంగా నిజాంసాగరు కింది ఆయకట్టుకు ఇప్పుడు నీరు నిలకడగా లభిస్తుంది. ఇదీగాక సింగనూర్ ప్రాజెక్టు నిర్మాణానికి ఇప్పుడు ఆటంకం తొలగింది. మంజీరానది నీరు 4 టి.ఎమ్.సి.ల మేరకు లభిస్తుంది.

ముఖ్యమంత్రి వెంగళరావు 1975 సెప్టెంబరు 24వ తేదీన భువనేశ్వర్‌లో ఒరిస్సా ముఖ్యమంత్రి శ్రీమతి నందినీ సత్పతిని కలుసుకొని పరస్పరం లాభసాటిగా వుండే కొన్ని నిర్ణయాలు తీసుకొన్నారు. దీనివల్ల నాగావళినదికి సంబంధించిన కొన్ని సంవత్సరాలుగా వున్న సమస్య కొంతవరకు పరిష్కరించబడింది. మన రాష్ట్రంలో రాజలక్ష్మీపురము వద్ద ఒక మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టును కట్టుకోవడానికి వీలు కలుగుతుంది. ఈ ప్రాజెక్టువల్ల 45 వేల ఎకరాలు అధికంగా సాగుబడిలోనికి వస్తాయి.

నాగార్జునసాగర్, పోచంపాడు ప్రాజెక్టులకు మునుపెన్నడు లేనంతగా వెంగళరావు హయాంలో ఎక్కువ డబ్బు కేటాయించబడింది.

## ఆర్యభట్టు

ఆర్యభట్టు గురించి తెలుసుకొనడం చాలా అవసరం. రోదసీ రంగంలో మనదేశ పురోగతికిది తార్కాణం. 1975 ఏప్రిల్‌లో ఆర్యభట్టు ఉపగ్రహాన్ని సోవియట్ కాస్మోడ్రోమ్ నుండి రోదసీలోకి పంపారు. దీన్ని భారతదేశంలో

విదేశాల సాంకేతిక సహాయం తీసుకొనకుండా తయారు చేసారు.

స్వంత ఉపగ్రహాలను అంతరిక్షంలో పంపిన దేశాలలో భారతదేశం ఆరవస్థానాన్ని ఆక్రమించినది. ఇంతవరకు అమెరికా, ఫ్రాన్సు సోవియెటు యూనియన్, చైనా, జపాన్ మాత్రమే తమ ఉపగ్రహాలను రోదసీలోనికి పంపాయి.

## బలహీనవర్గాలవారి సంక్షేమం

మన రాష్ట్రంలో వెనుకబడిన వర్గాలవారు 48 శాతం మేరకు వున్నారు. 1974 సం॥లో రాష్ట్ర ప్రభుత్వం షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తరగతులు మొదలైనవారికి ప్రత్యేకించబడిన ఉద్యోగాలకు ఆ వర్గాల అభ్యర్థులు లభ్యము కాలేదనేకారణాన బయట అభ్యర్థులను నియమించరాదనీ, కాగా ఆ ఖాళీలను మరుసటి సంవత్సరం భర్తీచేయాలని ఉత్తరువులను జారీచేసింది. 1975 నవంబరు 14వ తేదీనుంచి ఈ రిజర్వేషను అనగా 14 శాతం షెడ్యూల్డు కులాల వారికి, 4 శాతం షెడ్యూల్డు తెగలవారికీ 25 శాతం వెనుకబడినవారికి తప్పని సరిగా ప్రత్యేకించాలని ప్రభుత్వం గట్టిగా ఆజ్ఞాపించింది.

రాష్ట్రంలో హరిజనులకు, గిరిజనులకు తదితర బలహీనవర్గాలవారికి ఇండ్ల స్థలాలు కేటాయించే కార్యక్రమాన్ని వెంగళరావు ప్రభుత్వం భారీఎత్తున చేబట్టింది. బలహీనవర్గాల సంక్షేమంకోసం ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డు కులాల ఆర్థిక కార్పొరేషన్, ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన కులాల ఆర్థిక కార్పొరేషన్, ఆంధ్రప్రదేశ్ గిరిజన కులాల కార్పొరేషన్ మున్నగు సంస్థలు స్థాపించబడ్డాయి.

## ప్రభుత్వోద్యోగుల సంక్షేమ పథకాలు

రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు చిరకాలం జ్ఞాపకముంచుకొనే వారి అనేక సంక్షేమ పథకాలను వెంగళరావు ప్రభుత్వం చేబట్టింది. సమ్మె చేయకుండానే అలజడి లేకుండానే కేంద్ర ప్రభుత్వోద్యోగులతో సమానంగా కరువుభత్యం పెంచుతూ వచ్చారు ముఖ్యమంత్రి. వెంగళరావు ప్రభుత్వం తీసుకున్న నిర్ణయా లలో రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల కుటుంబ సంక్షేమ పథకం ఒక నిష్ఠవాత్మకమైన నిర్ణయమని చెప్పక తప్పదు. ఇది క్లిష్టమైన ఆర్థికపరిస్థితులతో సతమతమౌతున్న ఉద్యోగులందరికి మహాప్రసాదం. ఈ పథకం ప్రకారం ఉద్యోగాలలో ఉంటూ

అకాలమరణం పొందే ఉద్యోగుల కుటుంబాలకు ఆర్థిక సహాయం లభిస్తుంది. అకాల మరణం పొందే నాల్గవ తరగతి ఉద్యోగి కుటుంబానికి రూ. 7500. ఇతర ఉద్యోగుల కుటుంబాలకు రూ. 16 వేలు ఇస్తారు. ఉద్యోగి మరణంతో వెంటనే యీ మొత్తాన్ని ఇచ్చివేస్తారు. మృతి చెందిన కుటుంబ సభ్యునికి నేరుగా ఉద్యోగం లభించే పథకాన్ని కూడా వెంగళరావు ప్రభుత్వం ప్రవేశపెట్టింది.

## నక్సలైట్ ఉద్యమం

తెలంగాణా సాయుధ పోరాటం జరిగిన ఇరవై సంవత్సరాలకు ఆంధ్ర ప్రదేశ్‌లో నక్సలైట్ ఉద్యమం తలెత్తింది.

మూడు చెక్కలైన కమ్యూనిస్టు పార్టీలోని ఒక భాగమే మార్క్సిస్టు—లెనినిస్టు పార్టీ. ఈ పార్టీ దృక్పథంలో కమ్యూనిస్టు పార్టీలోని ఇతర రెండు పక్షాలైన సి పి.ఐ.; సి.పి.ఎం, విప్లవ వ్యతిరేకులు. సి.పి ఐ. కాంగ్రెస్‌తో ఎన్నికల పొత్తు కుదుర్చుకొన్నందుకు వారిని వీరు కాంగ్రెసు భక్తులంటారు. పార్లమెంటరీ పంథాకు సి.పి.ఎం. కట్టుబడి ఉన్నట్లు చెబుతారు. మార్క్సిస్టు—లెనినిస్టుల దృష్టిలో వారి దొక్కటే విప్లవ పార్టీ. అందుకు వ్యవసాయ విప్లవ పోరాటాన్ని పోరాట మార్గంగా ఎంచుకుంది. ఈ లక్ష్యంతోనే 1967–69లో పార్లమెంటరీ పంథాను త్రోసిపుచ్చింది. రివిజనిస్టులు, నయా రివిజనిస్టులతో సిద్ధాంత రీత్యా, నిర్మాణ రీత్యా తెగత్రెంపులు చేసుకుంది.

1968 నవంబరు నుండి శ్రీకాకుళం జిల్లాలో సాయుధ పోరాటం ప్రారంభించారు. ఇది కొంత విజయవంతమైనది. ఆ ఊపుతో ఖమ్మం, వరంగల్, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల ఫారెస్టు ప్రాంతాలలో తీవ్రమైన పోరాటాలు సాగించారు. అయితే ఒక్క శ్రీకాకుళం జిల్లాలో తప్ప అనతి కాలంలోనే ఇతర జిల్లాలలో సన్నాహాలు నామరూపాలు లేకుండా పోయాయి.

నక్సలైట్లు కార్యకర్తలు దాదాపు అంతా యువకులే. వీరిలో ఎక్కువ మంది చదువులు మధ్యలో ఆపివేసిన వారో, చదువుకొని నిరుద్యోగులుగా ఉన్న వారో కన్పిస్తారు. వీరందిరు ఎప్పుడూ, ఎక్కడా వర్గ పోరాటాలలో నలిగిన వారుకాదు.

వెంగళరావు ప్రభుత్వం గిరిజన ప్రాంతాలలో ఒక వంక శాంతి భద్రత

లను కాపాడటానికై ఈ ప్రాంతాలన్నిటిని కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించి గట్టి పోలీసు బందోబస్తు చేసింది. మరొకవంక గిరిజన సంక్షేమాలకు పెక్కు చర్యలను తీసుకుంది. స్వలాభేక్షతో గిరిజనులకు ఋణాలిచ్చి వారి భూములను కాజేసే గిరిజనేతరుల తంత్రాలను వమ్ము జేయటానికి రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్ర ప్రదేశ్ భూమి బదిలీ నిబంధనను రూపొందించింది. దీని ప్రకారం గిరిజనులు కాని వారికి గిరిజనుల భూమిని బదిలీ చేయించడం బహిష్కరించబడింది. గిరి జనులను ఋణవిముక్తులను చేయడానికి, వారి ఋణ భారాన్ని తగ్గించడానికి చర్యలు తీసుకొన బడ్డాయి. ఆర్థికరంగంలో మార్పులు రానిదే ఇలాంటి విప్లవాలు తగ్గవు.

రాష్ట్రంలో విశాఖపట్నం, ఖమ్మం, వరంగల్, ఆదిలాబాద్, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, మహబూబ్ నగర్ జిల్లాలలో ఇంటిగ్రేటెడ్ గిరిజన అభివృద్ధి సంస్థల ద్వారా ఈ ప్రాంతాల అభివృద్ధికి కృషి జరుగుతున్నది.

పోతే, మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ తన ఎన్నికల ప్రణాళికలో శ్రీకాకుళం గోదావరి లోయ ప్రాంతంలో ఫారెస్టు ప్రాంతం బంజర్లను దాదాపు మూడు లక్షల ఎకరాలను ఆక్రమించి పేద ప్రజలకు పంచి పెట్టినట్లు ప్రకటించుకుంది. ఈ పోరాటంలో 300 మంది నక్సలైట్లు చనిపోయినట్లు పేర్కొన్నది. ఇది యిలా ఉండగా గత రెండు సంవత్సరాల కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో 11 చోట్ల పోలీసులతో జరిగిన ఘర్షణలో 10 మంది నక్సలైట్లు మరణించినట్లు కేంద్ర ప్రభుత్వం 1978 మే 27న అధికారికంగా ప్రకటించింది.

## కవిసామ్రాట్ కాలధర్మం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి, కవిసామ్రాట్, కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణ 1976 అక్టోబరు 18వ తేదీన దివంగతులైనారు. జ్ఞానపీఠం అవార్డు పొందిన ఏకైక తెలుగు కవి విశ్వనాథ. నాలుగైదు దశాబ్దాలలో కానీ ఇలాంటి కవి ఒకరు పుట్టరని డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారన్నారు.

1949లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం భాషలను గౌరవించి పోషించటానికి ఆస్థాన కవులను సృష్టించింది.

తిరుపతి వెంకట కవులలో ఒకరైన చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు తెలుగు భాషకు మొదటి ఆస్థానకవి. వేంకటశాస్త్రిగారు 1950 ఫిబ్రవరి 15వ తేదీన శివ సాయుజ్యం పొందారు.

ఆటు పిమ్మట అవిభక్త మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారినిఆస్థానకవిగా నియమించింది.ఆయన యీపదవిలో పదిసంవత్సరాలుండి ఆంధ్రరాష్ట్రాన్ని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని దీవించి 1961లో పరమపదించారు.

తరువాత కాశీ కృష్ణాచార్యుల వారిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆస్థాన కవిగా నియమించింది. ఆయన మరణానంతరం యీ పదవి కొంతకాలం ఖాళీగానే ఉండిపోయింది.

పి వి. నరసింహారావు ముఖ్యమంత్రి అయిన పిమ్మట 1971లో విశ్వనాథ వారితో ఆ స్థానం భర్తీ చేయబడింది.

విశ్వనాథ వారు దివంగతులైన పది మాసాలకు 1977 ఆగస్టు 15న ముఖ్యమంత్రి జలగం వెంగళరావు డాక్టర్ దాశరథిని ఆస్థాన కవులుగా ప్రకటించారు.

## భూసంస్కరణలు.

కేంద్ర భూ సంస్కరణల సంఘం చేసిన సిఫారసులను పురస్కరించుకొని 1972లో పి.వి. నరసింహారావు ప్రభుత్వం చేసిన భూసంస్కరణల చట్టం 1975 జనవరి 1వ తేదీ నుండి ముమ్మరంగా అమలుకు వచ్చింది.

ఒక అంచనా ప్రకారం మన దేశంలో పరిమితికి మించిఉన్న మిగులు భూమి 88 లక్షల ఎకరాలు కాగా ఒక్క మన రాష్ట్రంలోనే పదిలక్షల ఎకరాల వరకు పరిమితికి మించి భూమి ఉండవచ్చునని అంచనా. ఈ చట్టం ప్రకారం అదనపు భూములు వదులుకొనేవారికి నగదు రూపంలోనో వడ్డీరూపంలోనో ఇచ్చే నష్ట పరిహారం నామమాత్రమైనది. అయితే ప్రభుత్వ భూవసతులు ఉచితంగా లభించవు. ప్రభుత్వానికి 10 నుంచి 100 రెట్ల రెవిన్యూ చెల్లించవలసి ఉంటుంది. మాగాణి అయితే హెక్టారుకి 1250 రూపాయలు మెట్టకయితే 875 రూపాయలు చెల్లించి నట్లయితే అతనికి పట్టా మంజూరు చేయబడుతుంది. భూకమతాల పరిమితి చట్టం క్రింద మిగులు భూములుగా ప్రకటింపబడిన వాటిలో 50 శాతంవరకు షెడ్యూల్డు

కులాల, షెడ్యూల్డు తెగల ప్రజలకు పంపిణీ చేసారు. ప్రతి పౌరునికి ఇల్లు కట్టుకునే స్థలం కల్పించడం వెంగళరావు ప్రభుత్వం చేసిన గొప్ప కార్యాలలో మొదటిదిగా చెప్పవచ్చు.

## కారుమబ్బులు తొలగిపోయాయి.

1975లో జూన్ 20వ తేదీన అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ హఠాత్తుగా ఎమర్జెన్సీ ప్రకటించారు. ఆ తర్వాత దేశంలో స్వాతంత్ర్యం అన్నది పౌరునికి క్రమేపీ అర్థహీనమయినది. పౌరుల ఓటు ద్వారా అధికారంలోకి వచ్చిన నాయకులు స్వాతంత్ర్యాన్ని పునర్ నిర్వహించారు. సెన్సార్‌షిప్పు విధించి పత్రికలను నోరెత్తకుండా చేసారు. వ్యక్తిగత స్వేచ్ఛలను తొలగించారు. న్యాయశాఖకు అధికారం తగ్గింది. హెబియస్ కార్పస్ పనిచేయలేదు. ఈ సంఘటనల గమనవేగంతో పౌరుడు దిగ్భ్రాంతి చెందాడు. అమాయకుల ముఖ కవళికల్లో భయం కనపడింది. అవకాశవాదులకు ఎమర్జెన్సీ ప్రయోజనం కనబడింది. దిగ్భ్రాంతి చెందిన మేధావులు నాయకత్వం వహించలేకపోయారు. (నాయకత్వం వహించగలవారు జైళ్ళలో ఉన్నారు) ప్రజలలో ఆగ్రహం క్రమేపీ పెరుగుతూ వచ్చింది. వోటువేసి అధికారంలోకి తెచ్చినప్పుడు తమ ప్రతినిధులనుండి ప్రజలు నిరంకుశతను కోరలేదు. భారతీయ సంప్రదాయ పద్ధతిన సమయం కోసం వేచి ఉన్నారు.

అయితే ప్రధాని మరోవిధంగా చెప్పారు. విధిలేని పరిస్థితులలో రాజకీయ కార్యకలాపాల నిర్వహణకై కొన్ని ఆంక్షలు విధించవలసి వచ్చిందని అన్నారు. ఎమర్జెన్సీలో ఉద్దేశించిన ప్రగతి పథకాలను, విధానాలను అమలు పరచడం కోసం, ప్రజల అనుమతి పొందడం ద్వారా రాజకీయ రంగాన్ని ఆవరించుకొన్న గందరగోళ పరిస్థితిని తొలగించడం కోసం లోక్‌సభను రద్దు చేస్తున్నట్లు 1977 జనవరి 18న రాత్రి రేడియోలో ప్రసంగిస్తూ ప్రధాని ప్రకటించారు.

1977 ఫిబ్రవరి 11వ తేదీన రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహమద్ గుండెపోటు వల్ల మరణించారు. తాత్కాలిక రాష్ట్రపతిగా బి.డి. జట్టీ ప్రమాణ స్వీకారం చేసారు.

## జనతా పార్టీ ఆవిర్భావం

1977 మార్చిలో లోక్‌సభకు జరిగిన ఎన్నికల్లో పాత కాంగ్రెసు, జన

సంఘ్, భారతీయ లోక్‌దళ్, సోషలిస్టు పార్టీలు కలసి ఏకైక పక్షంగా ఏర్పడ టానికి జనతాపార్టీ ఆవిర్భవించింది.

పార్లమెంటరీ డెమాక్రసీపై ఆధారపడిన సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం దీని ప్రధానలక్ష్యం. అధికార వికేంద్రీకరణ, న్యాయవ్యవస్థకు మునుపటి అధికారాల పునరుద్ధరణ, పత్రికలకు పూర్తి స్వేచ్ఛ. జనతా ఎన్నికల ప్రణాళికలో ప్రధా నాంశాలు.

1977 ఫిబ్రవరి 2వ తేదీన ప్రముఖ కాంగ్రెసు నాయకుడు, కేంద్ర మంత్రి వర్గంలో సీనియరు సభ్యుడైన జగజీవన్‌రాం పార్టీ సభ్యత్వానికీ, కేంద్ర మంత్రి పదవికీ రాజీనామా చేసి 'ప్రజాతంత్ర కాంగ్రెసు' స్థాపించారు. ఆయనతోపాటు హేమవతినందన్ బహుగుణ, శ్రీమతి నందనీశతపథి, శ్రీయుతులు కె. ఆర్. గణేశ్, ద్వారకనాథ తివారీ, రాజ్ మంగళ్ పాండే కాంగ్రెసుపార్టీ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు.

"సులభాః పురుషారాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్యచ పథ్యస్య వక్తాశ్రోతాచ దుర్లభః"

రాజులు దురదృష్టవంతులు. మంచికాలాన వారివలన మేలు పొందిన మంత్రులు, మిత్రులు ఆపదలోనున్న ప్రభువునకు ఏదిమంచిదో బోధించే సాహసం లేక రాజును ముఖప్రీతికరమైన మాటలతో ధ్వంసం చేస్తారని సీతాపహర ణంలో తనకు సహాయపడవలసిందిగా అడిగిన రావణునికి మారీచుడు రామాయ ణంలో బోధించిన హితబోధ ఇది. ఎమర్జెన్సీ అత్యాచారాలను ముఖప్రీతి స్తోత్రాలుగా వర్ణించి 'కాకస్' బృందం సభ్యులు శ్రీమతి ఇందిరాగాంధీ ఓటమికి కారకులైనారు.

1977 మార్చి 31న రాష్ట్రంలో జనతాపార్టీ శాఖ ఏర్పడింది. శాసన సభలో జనతాపార్టీ తొలిసభ్యులు :- శ్రీయుతులు పి. బసిరెడ్డి, ఎం. నానాదాస్, జి. సూర్యనారాయణ, చేకూరి కాశయ్య, జె. దామోదరరావు, పి. జనార్ధనరెడ్డి, ఎం. కొండలరెడ్డి, ఎస్. విఠల్‌రెడ్డి.

వెంగళరావు పరిపాలనా కాలంలో నలుగురు గవర్నర్లు మారినారు. 1975 చివరి వరకు ఖండూబాయ్ దేశాయ్, 1976 జనవరి 1 నుండి జూన్ 15

వరకు మోహన్‌లాల్ సుఖాడియా, 1976 జూన్ 16 నుంచి 1977 మార్చి వరకు ఆర్. డి. భండారే, 1977 మే 5 నుంచి శ్రీమతి శారదాముఖర్జీ యీ పదవిలో ఉండిపోయారు.

## కేంద్రంలో కాంగ్రెస్‌కు ఘోర పరాజయం

ఈ ఎన్నికల్లో కాంగ్రెస్ పరాజయం మామూలు పరాజయం కాదు. ఘోర పరాజయం. 1971 లోక్‌సభ ఎన్నికలలో 350 స్థానాలు సాధించి అఖండ విజయం పొందిన కాంగ్రెస్ ఈసారి 153 స్థానాలు మాత్రమే గెలుచుకొన గలిగింది. జనతాపార్టీ, దాని అనుబంధ పార్టీ ప్రజాస్వామ్య కాంగ్రెస్ 29: స్థానాలు సాధించాయి. కాంగ్రెస్‌కు ఉత్తరప్రదేశ్‌లో 84 స్థానాలలోను, బీహార్‌లో 54 స్థానాలలోనూ, పంజాబులో 13 స్థానాలలోనూ, హర్యానాలో 11 స్థానాలలోను, ఢిల్లీలో 6 స్థానాలలోనూ ఒక్క స్థానం కూడా దక్కలేదు. మధ్యప్రదేశ్‌లో ఒక స్థానం, రాజస్థాన్‌లో ఒక స్థానం, పశ్చిమ బెంగాల్‌లో 3 స్థానాలు, ఒరిస్సాలో 4 స్థానాలు అస్సాం, గుజరాత్‌లలో 10 స్థానాల వంతున కాంగ్రెస్‌కు కైవసమైనాయి.

ఉత్తరప్రదేశ్‌లోని రాయ్‌బరేలీ నియోజకవర్గంలో శ్రీమతి ఇందిరాగాంధీ 55 వేల తక్కువ ఓట్లతో ఓడిపోయారు. 1964 జనవరి 24న అధికారంలోకి వచ్చిన శ్రీమతి ఇందిరాగాంధీ పదకొండేళ్ళ పాటు ప్రధానిగా కొనసాగి ఎన్నికలలో ఓడిపోవడం వలన 1977 మార్చి 23వ తేదీన ప్రధానమంత్రి పదవికి రాజీనామా చేసారు. జనతాపార్టీ పక్షాన మురార్జీ దేశాయి మొదటిసారి కేంద్రంలో కాంగ్రెసేతర ప్రభుత్వాన్ని నెలకొల్పారు. ఉత్తర భారతాన్ని జనతా ప్రభంజనం కుదిపివేయగా దక్షిణ భారతంలో పెక్కుచోట్ల కాంగ్రెస్ విజయం సాధించుకుంది.

## వింధ్య దాటని జనతా

1977లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో ఆంధ్రప్రదేశ్‌కు అమిత ప్రాధాన్యం ఉన్నది. కాంగ్రెస్‌కు పెట్టని కోటగా కేంద్రం ఆంధ్రప్రదేశ్‌ను పరిగణించింది.

ఈ ఎన్నికల్లో నియోజకవర్గాల పునర్విభజనతో 41 నియోజకవర్గాల

సంఖ్య 42కి పెరిగింది. (వరంగల్ జిల్లాలో హనుమకొండ నియోజక వర్గం కొత్తగా ఏర్పడింది. ఎన్నికల ముందు 41 సీట్లలోను కాంగ్రెసు పార్టీ సభ్యులు 39 మంది ఉన్నారు. కమ్యూనిస్టు పార్టీకి ఒక సీటు (కడప) మార్క్సిస్టు పార్టీకి ఒక సీటు (మిర్యాలగూడెం) ఉన్నాయి. దాదాపు 42 లోక్‌సభ స్థానాలను సంపాదించుకోవాలనే దీక్షతో ముఖ్యమంత్రి వెంగళరావు అన్ని వర్గాలకు యీ ఎన్నికలలో ప్రాతినిథ్యమిన్చారు. ఒక్క నంద్యాల మినహా అన్ని నియోజక వర్గాలలో కాంగ్రెస్ విజయం సాధించి రికార్డు సృష్టించింది. నంద్యాలలో జనతాపార్టీ విజయం శ్రీసంజీవరెడ్డి వ్యక్తిగతవిజయంగానే భావించాలి. ఎందుకంటే ఆయనతో పోటీచేసిన కాంగ్రెస్‌అభ్యర్థి పెండేకంటి వెంకటసుబ్బయ్య 1972 ఫిబ్రవరిలో యీ నియోజకవర్గంలో జరిగిన ఉప ఎన్నికలలో ఇందిరాకాంగ్రెస్ అభ్యర్థిగా గెలుపు సాధించారు. 29 స్థానాలకు పోటీ చేసిన జనతాపార్టీ ఒక స్థానాన్ని గెలుచుకోగా ఆరు స్థానాలకు పోటీ చేసిన ప్రజాస్వామ్య కాంగ్రెస్ ఒక్క సీటూ గెలుచుకోలేకపోయింది. ఈసారి ఎన్నికలలో పోటీ చేసిన ఇండిపెండెంటు అభ్యర్థులందరికి డిపాజిట్లు పోవడం విశేషం.

ఆంధ్రప్రదేశ్‌తో పాటు తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలలో జనతాపార్టీ ఒక్కొక్క స్థానాన్ని మాత్రమే గెలుచుకొనగలిగింది. వింధ్య పర్వతాలను దాటి జనతా ప్రభంజనం వీచలేదనే చెప్పాలి.

## వెరసి 35 మంది మంత్రులు

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి 1977 మే 6 వ తేదీన అఖిలభారత కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడుగా ఎన్నిక కావటంతో ముఖ్యమంత్రి పదవికి రాజీనామా ఇస్తానని ప్రకటించిన వెంగళరావు తర్వాత బ్రహ్మానందరెడ్డితో రాజీ పడ్డారు. కాసు బ్రహ్మానందరెడ్డి శ్రీమతి ఇందిరాగాంధీ విభేదాల సమయంలో వెంగళరావు బ్రహ్మానందరెడ్డి పక్షం వహించడంతో రాష్ట్రకాంగ్రెసులోను, మంత్రివర్గంలోను ముసలం పుట్టింది. తమ స్థానాలను పదిలపరచుకొనడానికి శ్రీ బ్రహ్మానందరెడ్డి శ్రీ వెంగళరావు తదనుకూలంగా ప్రదేశ్ కాంగ్రెసును పునర్వ్యవస్థీకరించ తలచి రహమతుల్లాను తాడేపల్లి మునలయ్య స్థానంలో ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడుగా నియమించి, మంత్రివర్గాన్ని విస్తృత పరిచారు. 12 మంది మంత్రులతో ప్రారంభ

మైన వెంగళరావు మంత్రివర్గం 1977 సెప్టెంబరు 4న నాల్గవసారి విస్తరణతో 36 మందికి పెరిగింది. శ్రీయుతులు రొండా నారపరెడ్డి, ఎం. మాణిక్‌రావు, కె. అప్పుడు దొరకు క్యాబినెటు హోదా శ్రీయుతులు కె. రాంరెడ్డి, కె. లక్ష్మి నారాయణ యాదవ్, పల్లా వెంకటరావును సహాయమంత్రులుగా నియమించారు. మంత్రివర్గ విస్తరణతో పోర్టు ఫోలియోల మార్పులు చేయవలసి వచ్చింది. ముఖ్యంగా సీనియరు మంత్రులైన శ్రీ పిడతల రంగారెడ్డి, శ్రీ చొక్కారావు, శ్రీ టి. అంజయ్య శాఖల్లో మార్పులు జరిగాయి.

రాష్ట్రంలో సంజయ్‌గాంధీ పర్యటించినపుడు రాష్ట్రప్రభుత్వం ఆయనకు ఘనంగా స్వాగతం పలికింది. కేంద్రప్రభుత్వ ఆదేశానుసారం తామీపని చేసినట్లు వెంగళరావు* విమద్‌లాల్ కమీషన్ ఎదుట సాక్ష్యమిచ్చారు. నక్సలైట్లు మున్నగు తీవ్రవాదులపై జరిగిన అత్యాచారాలను విచారించడానికి కేంద్ర ప్రభుత్వం సూచనపై ముఖ్యమంత్రి భార్గవా కమీషన్ నియమించి ప్రజాస్వామ్య విధానంపై గల తమ ప్రగాఢ విశ్వాసాన్ని ప్రకటించుకున్నారు. ఇక్కడ ఒక మాట చెప్పడం చాలా అవసరం.

ఎమర్జన్సీ కాలంలో ముఖ్యమంత్రి వెంగళరావు కుటుంబ శస్త్ర చికిత్సలను హింసాత్మకంగా జరిపించలేదు. తమ రాజకీయ ప్రత్యర్థులను మూక ఉమ్మడిగా కారాగారాలకు పంపలేదు. శ్రీమతి ఇందిరాగాంధీ నిర్దేశించిన ఇరవై అంశాల ఆర్థిక కార్యక్రమాన్ని రాష్ట్రంలో పగడ్బందీగా జరిపించి రాబోయే అసెంబ్లీ ఎన్నికల్లో ఇందిరాకాంగ్రెసు విజయానికి పరోక్షంగా ముఖ్యమంత్రి తోడ్పడ్డ వారైనారని ఎన్నికల ఫలితాల ప్రకటనానంతరం రాజకీయ వ్యాఖ్యాతలు పేర్కొన్నారు.

## అ. భా. కాం. అధ్యక్షుడుగా కాసు

తొంభై రెండు సంవత్సరాల కాంగ్రెసు చరిత్రలో దక్షిణాది రాష్ట్రాలకు చెందినవారు ఎనిమిది మంది మాత్రమే అఖిల భారత జాతీయ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులైనారు. సి. ఆనందాచార్లు (1891) సి. శంకరన్ నాయర్ (1897) చక్రవర్తి విజయరాఘవాచారి (1920) శ్రీనివాస అయ్యంగార్ (1924) సరోజినీ నాయుడు (1925) డా॥ పట్టాభి సీతారామయ్య (1948) నీలం సంజీవరెడ్డి (1961) దామోదరం సంజీవయ్య (1963) అందులో ఐదుగురు ఆంధ్రులు.

ఇరవై ఏడు సంవత్సరాల కాలంలో కాంగ్రెసు పార్టీ అత్యున్నత పదవికి 1977 మే 7వ తేదీన పోటీ జరిగినది. (1950లో నాసిక్ మహాసభలో నెహ్రూ అభిమతానికి విరుద్ధంగా పురుషోత్తం దాస్ టాండన్ ఎన్నికైనారు) కాసు బ్రహ్మానంద రెడ్డికి 317 ఓట్లు ఆయనతో పోటీ చేసిన సిద్ధార్థ శంకర రాయ్‌కు 160 ఓట్లు వచ్చాయి. కాసు శ్రీమతి ఇందిరాగాంధీ రబ్బరు స్టాంపుగా ఉండటాని కంగీకరించ లేదు. అధికార దుర్వినియోగం జరిపిన, అధికార దుర్వినియోగానికి బాధ్యులైన ఒకవ్యక్తిని లేక వ్యక్తులను కప్పిపుచ్చే ఉద్దేశం కాంగ్రెసుకు లేదని కాంగ్రెసు ప్రణాళికను విడుదలచేస్తూ ప్రకటించారు. కాంగ్రెసు మహాసంస్థయే ఒక వ్యక్తి, వ్యక్తుల వ్యవస్థ కాదని రుండబద్దలు కొట్టునట్లు చెప్పారు. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికను శ్రీమతి ఇందిరా గాంధీకి చూపలేదని కార్యవర్గం ఏర్పాటు చేసిన కమిటీ ఎన్నికల ప్రణాళికను తయారు చేసిందని వెల్లడించారు. రాజకీయ అరణ్యవాసం భరించని శ్రీమతి ఇందిరాగాంధీ కాంగ్రెసును రెండవసారి చీల్చడానికి పూనుకున్నారు. గడచిన ఎనిమిదేళ్ళలో ఎనిమిదిమంది కాంగ్రెసు అధ్యక్షులు మారారు. శ్రీమతి గాంధీ తనకు నచ్చనివారిని చెప్పుచేతల్లో ఉండనివారిని అధికారంలో ఉండనీయరని తాము కాంగ్రెసు అధ్యక్షులైన మూడు నెలల్లోనే ఉద్వాసన చెప్పించడానికి ఆమె ఉద్యమం ప్రారంభించారని శ్రీ కాసు అన్నారు.

## చెన్నారెడ్డి ప్రవేశం

1977 అక్టోబరు 1వ తేదీన ఉత్తరప్రదేశ్ గవర్నరు పదవికి రాజీనామా చేసి వచ్చిన డాక్టర్ మర్రి చెన్నారెడ్డి యీసారి రాష్ట్ర రాజకీయాలలో ఝంఝామారుతంలా ప్రవేశించలేదు. ఉన్నపార్టీని సమర్థించడంలో కొత్తపార్టీని పెట్టడంలో సమర్థుడైన డా॥ చెన్నారెడ్డి ఒక కొత్తపార్టీ పెట్టేముందు ప్రజలు తమ నెంతవరకు అనుసరిస్తారో తెలుసుకుంటారు. ఆయన పట్టిన పక్షం నెగ్గడం ఆయన దీక్ష. ఆయన ఒక సిద్ధాంతానికి పూనుకుంటే దాని అంతు చూస్తారని రాష్ట్రంలో ప్రతిష్ఠ ఉన్నది. ఉభయ ప్రాంతాల మిత్రులతో సంభాషణలు ప్రారంభించారు. గతంలో ఆంధ్రకేసరి ప్రకాశం, ప్రొఫెసర్ రంగా ప్రాంతీయ పార్టీలు పెట్టి నష్టపోయిన సంగతిని శ్రీ కందుల ఓబులరెడ్డి ప్రభృతులు గుర్తుకు తెచ్చినప్పుడు, ప్రాంతీయపార్టీ ఒకటి పెట్టాలని తీవ్రంగా ఆలోచిస్తున్న డా॥ చెన్నారెడ్డి ఆ ఆలోచనకు స్వస్తిచెప్పారు. శ్రీమతి గాంధీ కొత్తపార్టీ కనుక పెడితే

అందుకు తమ ద్వారా ఎంత మద్దతు లభిస్తుందో బేరీజు వేసుకోవడం మొదలు పెట్టారు. నవంబరు 13 వ తేదీన కర్నాటక ముఖ్యమంత్రి దేవరాజ్ అర్స్ హైదరాబాద్‌కు వచ్చి డా॥ చెన్నారెడ్డితో మంతనాలు జరిపారు. ఇందిరాగాంధీ కొత్తపార్టీకి దేవరాజ్ అర్స్, చెన్నారెడ్డి సవ్యసాచిసారథులుగా నిలవడానికి నిర్ణయం తీసుకున్నారు.

## తుఫాన్ రాజకీయాలు

గత వందసంవత్సరాలలో కనీవినీ ఎరుగని ఘోర ప్రమాదం 1977 నవంబరు 20 వ తేదీ శనివారంనాడు ఆంధ్రప్రదేశ్ కోస్తా జిల్లాలకు సంభవించింది. ఆ రోజు సాయంత్రం కొద్దిగంటల కాలంలోనే తుఫాను విలయతాండవం చేసి రాష్ట్రమంతటిలో సౌభాగ్యవంతమైన ఈ జిల్లాలను మరుభూములుగా మార్చి వేసింది. అన్నిటికంటె ఎక్కువ నష్టం సంభవించిన కృష్ణాజిల్లా, దివి సీమలోని గ్రామాలలో పదివేలమంది నిర్భాగ్యులు తుఫానుకు బలి అయి పోయారు. తుఫాను భీభత్సానికి గురైన మరొక జిల్లా గుంటూరులో రెండువేలమంది ప్రాణాలు కోల్పోయారు. ఆస్తికి పశుసంపదకు విపరీతమైన నష్టం సంభవించింది. నష్టం గురించి ఎవరి ప్రకటనలు వారివి. మృతుల సంఖ్య 13 వేలవరకుంటుందని ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రకటించారు. రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి నవంబరు 23 వ తేదీన తుఫాను బాధిత ప్రాంతాలను పర్యటించి ప్రాణనష్టాన్ని గురించి ఊహాతీతమైన అంచనాలు వేసి ప్రజల్లో భయాన్ని కలగచేయరాదని విజ్ఞప్తి చేసారు ప్రధాని మురార్జీదేశాయి విమానం నుండి తుఫాను గురైన ప్రాంతాలను పర్యటించారు.

తరువాత ఒకరి వెంట ఒకరు కేంద్ర మంత్రులు జనతాపార్టీ నాయకులు వచ్చారు. రాష్ట్ర ప్రభుత్వాన్ని విమర్శించడానికే వారు పనికట్టుకొని ఇంత దూరం వచ్చినట్లు చేశారు. రాష్ట్రప్రభుత్వం తన 'అసమర్థత'ను ప్రకటిస్తే, కేంద్రం సహాయానికి దిగుతుందని రక్షణమంత్రి జగజీవన్‌రాం ప్రకటించారు. రాష్ట్రంలో తుఫాను వచ్చినప్పుడు హైదరాబాద్‌లోనే ఉన్న కేంద్రహోంమంత్రి చరణ్‌సింగ్ దృష్టికి యీ సంగతి తేగా సహాయకచర్యలు చేపట్టవలసిన బాధ్యత రాష్ట్రప్రభుత్వానికున్నదని, ఇది రాష్ట్రప్రభుత్వానికి సంబంధించిన విషయమని,

కేంద్రాన్ని సహాయం కోరడం జరిగితే కేంద్రం అవసరమైన సహాయం అందించ గలదని అన్నారు.

అప్పటి కప్పుడే కేంద్ర హోంమంత్రి చిపీసీపు పర్యటించగలిగితే రాష్ట్రంలో ఆయన ప్రతిష్ఠతోపాటు జనతాపార్టీ ప్రతిష్ఠ పెరిగేది. ఇదే రోజులలో తమిళనాడులో సంభవించిన స్వల్పమైన తుఫానుకు ఆ రాష్ట్రానికి చెందిన కేంద్ర ఇంధనం మంత్రి శ్రీ రామచంద్రన్‌ద్వారా తమిళనాడుకు తక్షణ సహాయం లభించింది. ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించిన వారెవరూ కేంద్రంలో లేకపోవడం వలన యీ లోటు ఇప్పుడు కొట్టొచ్చినట్లు కనిపించింది.

కేంద్రంలో జనతాపార్టీ ప్రభుత్వం ఏర్పడగానే కేంద్రప్రభుత్వంలో ఆంధ్రులకు ప్రాతినిధ్యం పోయింది. నంద్యాల, వరంగల్ నియోజకవర్గాల లోక్‌సభ ఉప ఎన్నికలలో జనతా అభ్యర్థులు ఓడిపోయి వీటిని కాంగ్రెస్ (ఐ) కైవశం జేసుకొన్నది. [రాష్ట్రపతి సంజీవరెడ్డి రాజీనామావలన, ఎన్. బి. గిరి మరణంవలన ఈ స్థానాలలో ఖాళీ ఏర్పడింది.]

ఇక్కడ జనతాపార్టీ ఘోరమైన తప్పు చేసింది. ఆంధ్రప్రదేశ్, కర్నాటక వంటి పెద్ద రాష్ట్రాలకు కేంద్రంలో స్థానం ఇవ్వకపోవడంవలన దక్షిణాదిలో ఆ పార్టీ ముందుకూడా బలపడక పోయింది. యుక్తిగా కొందరిని గవర్నరులుగా నియమించవలసినది. రాజ్యసభ స్థానాలనుంచి జనతాపార్టీ టికెటుపై ఎన్నికైన వారిలో ఒకరిద్దరిని మంత్రులుగా నియమించవలసినది. గతంలో రెండుసార్లు ప్రధాని పదవికి పోటీ చేసినప్పుడు ఆంధ్రప్రదేశ్ నాయకత్వం మురార్జీని వ్యతిరే కించింది. ఇప్పుడు ప్రధాని అయ్యాక మురార్జీ ఆంధ్రప్రదేశ్‌పై పాతపగ తీర్చు కుంటున్నారనే విమర్శకు తావు కల్పించారు.

## తుఫానులో ప్రళయం

రాష్ట్ర రాజకీయాలు కింకర్తవ్యమ్ అనే జిజ్ఞాసలో ఉండగా ఒక ప్రళయం వలె తుఫాను వచ్చింది. దీన్ని మహదవకాశంగా శ్రీమతి ఇందిరాగాంధీ మొదలు కొని అందరు రాజకీయనాయకులు తీసుకొన్నారు. పునరావాస చర్యలగూర్చి ముఖ్యమంత్రి సీనియరు మంత్రులతోనైనా సంప్రదించడంలేదని, మంత్రివర్గ సమిష్టి బాధ్యతను ముఖ్యమంత్రి గౌరవించడంలేదని చెప్పి మంత్రులు సర్వశ్రీ పి. రంగారెడ్డి, జె. చొక్కారావు, టి. అంజయ్య, ఆనం వెంకటరెడ్డి, పి. ధర్మా

రెడ్డి తెలంగాణా అభివృద్ధి ప్రణాళికాసంఘం అధ్యక్షుడు సి. జగన్నాధరావు, హైదరాబాద్ నగరాభివృద్ధి సంఘం అధ్యక్షురాలు శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి డిసంబర్ 2వ తేదీన రాజీనామా చేసారు. ముఖ్యమంత్రితో సంప్రదించకుండా మంత్రులు కె. రాజమల్లు టి. అంజయ్య ఢిల్లీకిపోయి శ్రీమతి ఇందిరాగాంధీని తుఫానుబాధిత ప్రాంతాలను పర్యటించవలసినదిగా ఆహ్వానించారు. దానిపై ముఖ్యమంత్రి రాజమల్లును రాజీనామా కోరారు.మంత్రులు లుకలాపు లక్ష్మణదాసు, పురుషోత్తమరెడ్డి డిసంబరు 30వ తేదీన, స్పీకరు రేబాల దశరథరామిరెడ్డి 1978 జనవరి 14వ తేదీన రాజీనామా చేసి జనతాపార్టీలో చేరిపోయారు. మాజీ మంత్రులు జువ్వాది చొక్కారావు, పిడతల రంగారెడ్డి జనతాలో ప్రవేశించారు. ఒక వంక ప్రకృతి తెచ్చిన బీభత్సం, మరొకవంక రాజకీయ ప్రళయం ముఖ్యమంత్రిని మహా ఇరకాటంలో పెట్టాయి. కానీ ముఖ్యమంత్రి వీటిని లెక్కపెట్టక మేరునగధీరుడుగా నిలిచి పునరావాస కార్యక్రమాలను నడిపించారు. ఈ ఆపత్సమయంలో రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగమంతా ముఖ్యమంత్రికి అండగా నిలిచింది. సహజమైన తండ్రి తన పిల్లలను ప్రేమిస్తాడు. సంస్కృతి గల ప్రభుత్వం తన సిబ్బందిని విశ్వసిస్తుంది. కానీ విధి నిర్దాక్షిణ్యమైనది. దాని మంచి చెడ్డల గురించి ఆలోచించడం మన పరిధిలో లేని పని.

హం ఆహ్ః భి భర్తే హైం తో
హోజాతే హైం బద్నామ్
వో కతల్ భి కర్తేహైః తో—
చర్చా నహీ హోతా"

మేము నిట్టూర్చినా మహాచెడ్డపేరు వస్తుంది. వాళ్లు ఖూనీ చేసినా చర్చకు రాదని అన్నాడు మహాకవి గాలిబ్.

## ఇందిరా కాంగ్రెసు ఆవిర్భావం

1978 జనవరి 2వ తేదీన శ్రీమతి ఇందిరాగాంధీ అఖిలభారత జాతీయ కాంగ్రెసు నుండి విడిపోయి తన అధ్యక్షతన ఇందిరా కాంగ్రెసును స్థాపించినట్లు ప్రకటించారు. 21 మంది కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులలో సర్వశ్రీ కమలాపతి త్రిపాఠీ, సయ్యద్ మీర్ ఖాసిమ్, పి.వి. నరసింహారావు, వీరేంద్రవర్మ, బూటాసింగ్, ఏ.పి. శర్మ, శ్రీమతి మరగతం చంద్రశేఖరం శ్రీమతి ఇందిరా

గాంధీ వర్గంలో చేరిపోయారు. అఖిలభారత జాతీయ కాంగ్రెసు కమిటీ జనవరి 3వ తేదీన శ్రీమతి ఇందిరాగాంధీని కాంగ్రెస్‌నుండి భర్తరఫ్ చేసింది. కాంగ్రెస్‌లో కలతలు పనికిరావని, శ్రీమతి గాంధీ బ్రహ్మానందరెడ్డి కలసి పనిచేయాలని తాము కోరుతున్నామని కాంగ్రెస్‌లో కలతలువస్తే జనతా లాభిస్తుందని ముఖ్యమంత్రి వెంగళరావు బాధపడ్డారు. రాజారాం వర్గంవారు ముఖ్యమంత్రి శ్రీమతి గాంధీ పట్ల విధేయత ప్రకటించాలని వొత్తిడి తెచ్చినా పి.వి., డా॥చెన్నారెడ్డి అటు వైపుగా, ఉన్న దృష్ట్యా తనకు అక్కడ హార్దిక స్వాగతం లభించదని వెంగళ రావుకు తెలుసును. మంత్రులు జి. రాజారాం, మాణిక్‌రావు, నరసప్ప, పరకాల శేషావతారం రాజీనామా చేసి ఇందిరా కాంగ్రెసులో చేరిపోయారు. జనవరి 18న హైదరాబాద్‌లో ఇందిరాకాంగ్రెస్ సదస్సు జరిగింది. డా॥ చెన్నారెడ్డి ఇందిరా కాంగ్రెస్ రాష్ట్రశాఖ అధ్యక్షులుగా నియమించబడ్డారు. పార్టీ కార్యకర్తలకు హితవు చెబుతూ శ్రీమతి గాంధీ 'నా సందేశం ప్రజలకు వినిపించండి. జయం మనదే' అన్నారు.

## ఎన్నికలు—అనూహ్యమైన ఫలితాలు

1978 ఫిబ్రవరి నెలలో అస్సాం, మహారాష్ట్ర, కర్నాటక, మేఘాలయ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు, కేంద్ర పాలిత ప్రాంతమైన అరుణాచల్ ప్రదేశ్‌కు మాత్రమే ఎన్నికలు జరిగినవి. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలోని 294 స్థానాలకు మొత్తం 1538 మంది అభ్యర్థులు పోటీచేసారు. అధికార కాంగ్రెసు 257 స్థానాలకు, ఇందిరా కాంగ్రెసు 290 స్థానాలకు, జనతా 271 స్థానాలకు, సి పి.ఐ. 31 స్థానాలకు, మార్క్సిస్టులు 22 స్థానాలకు అన్నాడి.ఎం.కె. 2 స్థానాలకు, వెనుకబడిన తరగతులు - మైనారటీపార్టీ 2 స్థానాలకు రామరాజ్య పరిషత్ 1 స్థానిక రిపబ్లికన్‌పార్టీ (ఖోబర్‌గాడేవర్గం) 15 స్థానాలకు పోటీచేయగా 658 మంది ఇండిపెండెంట్లు ఎన్నికలరంగంలో దిగారు. అధికారం కైవసం చేసుకోవాలన్న విపరీతమైన కాంక్షతో జనతా, కాంగ్రెసు, ఇందిరా కాంగ్రెసు మహాతీవ్రంగా ఎన్నికల్లో పోటీచేసాయి.

ఏ పార్టీకి రాష్ట్రంలో మెజారిటీ రాదనుకున్న రాజకీయ అతిరథ జ్యోతిష్కులందరికి ఈ ఎన్నికల ఫలితాలు సంభ్రమాశ్చర్యాలను కలిగించాయి. ఇందిరా కాంగ్రెసు నిర్మాణరీత్యా కొత్తదే అయినా ప్రజలు ఆ పార్టీని శ్రీమతి

ఇందిరాగాంధీ పేరున గెలిపించారు. ఇందిరా కాంగ్రెసు అభ్యర్థులలో చాలామంది కొత్తవారే అయినా ఇందిరకు ఓటు చేసినట్లుగా భావించి వారిని గెలిపించారు. ఇందిరా గాలికి మహావృక్ష మనుకున్న అఖిలభారత జాతీయ కాంగ్రెసు సునాయాసంగా నేలకొరిగింది. ఉరకలు వేసే ప్రజాశక్తి ఊహించనంతగా ఇందిర పక్షాన విజృంభించడంతో బలవత్తరమైనదనుకొన్న జనతాపార్టీ ఆ దాడికి తట్టుకోలేక పోయింది. 'నా నుంచి ఎప్పుడూ అనూహ్యమైన ఫలితాలు స్వీకరించడానికి యీ ప్రపంచం సిద్ధంగా ఉండాలి' అని శాసించగల శక్తి ఇంకా తనకు ఉన్నట్లు శ్రీమతి గాంధీ యీ ఎన్నికల్లో నిరూపించుకొన్నారు.

కర్నాటకలోనైతే అధికార కాంగ్రెసుకు రెండే రెండు స్థానాలొచ్చాయి. ఈ ఎన్నికలకు రెండు మాసాల ముందు శ్రీమతి ఇందిరాగాంధీ కర్నాటక పర్యటన సల్పగా ప్రజలు ఆమెపై రాళ్లు విసిరారు. ఇప్పుడామె అభ్యర్థులపై పూలుజల్లారు. రాళ్ళను, పూలను సరిసమానంగా ప్రేమించిన నాయకురాలు శ్రీమతి ఇందిరాగాంధీ. కర్నాటకలో తనపార్టీకి జరిగిన ఘోర పరాజయాన్ని తనదిగా తీసుకొని కాంగ్రెసు అధ్యక్షుడు బ్రహ్మానందరెడ్డి తన పదవికి రాజీనామా ఇచ్చారు.

రాష్ట్రంలో ఎన్నికల ఫలితాలు :- ఇందిరాకాంగ్రెస్ 175, జనతా 60, అధికార కాంగ్రెసు 30, సి.పి.ఐ. 6, సి.పి.ఎం. 8, ఇండిపెండెంట్లకు 15 స్థానాలు లభించాయి. 280 మంది కొత్త అభ్యర్థులు ఎన్నికైనారు. రెండు కాంగ్రెసులు ఏకం కావాలన్న నినాదం వినిపించింది. అధికారం అయస్కాంతం వంటిది. దాని పని అది చేస్తుంది. మహారాష్ట్రలో అధికార కాంగ్రెసు, ఇందిరా కాంగ్రెసు మిశ్రమ ప్రభుత్వం ఏర్పడటంతో అది జనతాపార్టీని వింధ్య పర్వతాలను దాటకుండా అడ్డుకొన్నది.

## ప్రముఖుల ఓటమి-అటుఇటు సమానం

వెంగళరావు మంత్రివర్గంలోని శ్రీయుతులు ఆసిఫ్‌పాషా; ఇబ్రాహీం అలీ అన్సారీ, పి. నరసారెడ్డి, యర్రా నారాయణస్వామి, బత్తిన సుబ్బారావు పి. మహేంద్రనాథ్, వానిరెడ్డి కృష్ణమూర్తినాయుడు, పల్లా వెంకటరావు, శ్రీమతి లక్ష్మీదేవి ఓడిపోయారు. ముఖ్యమంత్రి వెంగళరావు, మంత్రులు బాట్టం శ్రీరామ

మూర్తి, మండలి వెంకటకృష్ణారావు, కె.వి. కేశవులు, డి. మునుస్వామి, అప్పుడు దొరమాత్రమే గెలిచారు. జనతాపార్టీ ప్రముఖులలో సర్వశ్రీ జె. చొక్కారావు, ఆనం వెంకటరెడ్డి (మాజీమంత్రులు) కోట పున్నయ్య, ఎ.ఎన్. చౌదరీ (రాజ్య సభ సభ్యులు) రేబాల దశరథరామరెడ్డి (మాజీ స్పీకరు) లెజిస్లేచర్‌పార్టీ ఉప నాయకుడు ఎస్. శ్రీరాములు, ఓడిపోయారు ఇందిరా కాంగ్రెసు ప్రముఖ నాయకులైన సర్వశ్రీ టి. అంజయ్య, కె. రాజమల్లు, ధర్మారెడ్డి, సి. జగన్నాథ రావు, శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి ఓడిపోయారు. కమ్యూనిస్టు పార్టీ నాయకులైన వేములపల్లి శ్రీకృష్ణ, వంకా సత్యనారాయణ, రిపబ్లికన్ పార్టీ ఏకైక సభ్యురాలు శ్రీమతి జె ఈశ్వరీబాయి పరాజయం చెందారు. ఈ ఎన్నికల్లో రిపబ్లికన్‌పార్టీ, (ఖోబర్‌గాడే వర్గం) డి.ఎం.కె., అఖిలభారత అన్నాడి.ఎం.కె. వెనుకబడిన తరగతుల మహాసభవంటి ప్రాంతీయ పార్టీలకు ఒక్క స్థానమైనా లభించలేదు. అనేకచోట్ల రద్దయిన శాసనసభ అధికార కాంగ్రెసు శాసనసభ్యులు డిపాజిట్లు కోల్పోగా ఆ స్థానంలో జనతాపార్టీ గెలుపొందడంతో జనతాపార్టీ రెండవ పెద్ద పార్టీ అయింది.

"ఇలాతలంలో ఏ ప్రాంతంలో
ఎక్కడనున్నా ఎన్నాళ్లున్నా
తెలుగుభాషనూ తెలుగు సంస్కృతినీ
మరువలేరు మన సోదరులెప్పుడు"

అని చాటిచెప్పిన తెలుగు వెలుగు జలగం వెంగళరావు ఒకదేశం లేక రాష్ట్ర చరిత్రలో నాలుగున్నర సంవత్సరాలు చాలా స్వల్పమైన కాలం. కాని మన రాష్ట్ర చరిత్రలో వెంగళరావు రాజ్యం చేసిన కాలం అన్నివిధాలా మహోత్తరమైనది. ఎన్నికలలో తమపార్టీకి సంభవించిన ఓటమివలన వెంగళరావు మంత్రివర్గం 1978 ఫిబ్రవరి 26న రాజీనామా చేసింది.

## ఎవరికి పూర్తికాలం లేదు

మన ముఖ్యమంత్రులలో ఇంతవరకు ఒక సాధారణ ఎన్నికలనుంచి మరొక సాధారణ ఎన్నికల వరకు పూర్తికాలం పదవిలో కొనసాగినవారు ఒక్కరైనా లేరు.

ఆంధ్రరాష్ట్ర తొలిముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశం ప్రభుత్వం కొనసాగింది పదమూడు నెలలు మాత్రమే.

శ్రీ ప్రకాశం తర్వాత ముఖ్యమంత్రిపదవికి వచ్చిన డా॥ బెజవాడ గోపాల రెడ్డి ఇరవై రెండు నెలలు మాత్రమే ఆ పదవిలో ఉండిపోయారు. ఆంధ్ర ప్రదేశ్ నిర్మాణం జరిగినప్పుడు శ్రీ నీలం సంజీవరెడ్డితో పోటీచేసి ఓడిపోయారు.

1952 ఎన్నికల తర్వాత హైదరాబాద్ ముఖ్యమంత్రి పదవి స్వీకరించిన డా॥ బూర్గుల రామకృష్ణారావు 1957 ఎన్నికలవరకు కొనసాగలేదు. ఆయన సారధ్యం వహించిన రాష్ట్రం 1956 లో మూడు ముక్కలై ఆయా భాషా ప్రయుక్త రాష్ట్రాలలో కలిసి పోయింది.

రెండు పర్యాయాలు ముఖ్యమంత్రిగా పనిచేసిన శ్రీ నీలం సంజీవరెడ్డి మొదటిసారి అ. భా. కాంగ్రెసు అధ్యక్షపదవి స్వీకరించడానికి, రెండవసారి సుప్రీంకోర్టు తీర్పులో తనపై జరిగిన విమర్శదృష్ట్యా రాజీనామా చేసారు. మొదటిసారి మూడు సంవత్సరాల రెండు మాసాలు, రెండవసారి రెండు సంవత్స రాల రెండు మాసాలు మాత్రమే పదవిలో ఉండగలిగారు.

ఇకపోతే శ్రీ దామోదరం సంజీవయ్య ముఖ్యమంత్రిగా పనిచేసింది ఇరవై ఆరు నెలలే.

రెండవసారి శ్రీ సంజీవరెడ్డి పదవినుంచి విరమించిన పిమ్మట ముఖ్య మంత్రిగా వచ్చిన కాసు బ్రహ్మానందరెడ్డి 1964 నుంచి 1971 వరకు ఆ పద విలో కొనసాగినా కేంద్రనాయకత్వం సూచనపై ఆయన రాజీనామా చేయవలసి వచ్చింది. ఐదేళ్ళకు మించి పదవిలో ఉన్నది ఒక్క బ్రహ్మానందరెడ్డి మాత్రమే. అయితే, ఆయనైనా 1962 సాధారణ ఎన్నికల తర్వాత పదవిలోకి వచ్చి, 1967 ఎన్నికల తర్వాత కొనసాగినా, తిరిగి 1972 ఎన్నికలవరకు నిలవక అంతకు ముందుగానే 1971 సెప్టెంబరులో నిష్క్రమించవలసి వచ్చింది.

శ్రీ పి. వి. నరసింహారావు పదిహేను నెలలు మాత్రమే పదవిలో కొన సాగినారు.

రాష్ట్రపతి పాలన తర్వాత 1973 డిసంబర్‌లో పదవిలోకి వచ్చిన జలగం వెంగళరావు నాలుగు సంవత్సరాల మూడు మాసాలు ఆ పదవిలో ఉండి పోయి 1978 సాధారణ ఎన్నికలలో తనపార్టీ ఓడిపోవడం వలన ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేయవలసి వచ్చింది.

ఆంధ్రప్రదేశ్ రాజకీయాలలోని అస్థిరత్వ పరిస్థితులే తెలుగు నాయకత్వంలోని అస్థిరత్వానికి మూలకారణం.

——

* మాజీ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, ఆయన మంత్రివర్గ సహచరులు కొందరిపై వచ్చిన ఆరోపణలు నిరాధారమైనవని విమద్‌లాల్ కమీషన్ తన తుది నివేదికలో 1978 డిసంబర్ 18న నిర్ధారించినది.

మూడు ఆరోపణలపై మొదటి నివేదికను 1978 మే 31వ తేదీన ప్రభుత్వానికి సమర్పించినది. ఎట్టి అధికార పదవిలేని, ప్రయివేటు వ్యక్తి అయిన సంజయ్‌గాంధీకి రాష్ట్రంలో 1977 డిసంబర్ 26 తేదీన "రాచమర్యాదలతో స్వాగతం" ఇచ్చినందుకు నివేదికలో కమీషన్ వెంగళరావును అభిశంసించింది. వెంగళరావు చర్య పరిపాలనా సంబంధమైన 'అనౌచిత్యం' క్రిందికి వస్తుందని కమీషన్ నిర్ణయించింది.

కమీషన్ నివేదిక దృష్ట్యా 1977 జులై 22న వెంగళరావు తన శాసనసభ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి, రాజకీయాలనుంచి విరమించినట్లు ప్రకటించారు.

* 1974 జూన్ 7న బి.వి. సుబ్బారెడ్డి, 1974 జూలై 27న శ్రీ నూకల రామచంద్రారెడ్డి, 1976 అక్టోబర్ 14న శ్రీ ఎస్. వెంకట్రామారెడ్డి, మరణించారు.

* పరిశ్రమల మంత్రి శ్రీ బసిరెడ్డి 1976 ఆగష్టు 12న రాజీనామా చేసారు.

సవరణ

* 117 పేజీ-3వ పంక్తిలో 16వేలు స్థానంలో 10వేలు అని గమనించాలి.
* 118 పేజీ-23వ పంక్తిలో 'దశాబ్దం' బదులు 'శతాబ్దం' అని గమనించవలెను.

——

# రాష్ట్ర రథసారథి డాక్టర్ చెన్నారెడ్డి

"మేలు కిన్నెర మేళవించీ—
రాలు కరగగ రాగమెత్తీ
పాలతీయని బాలభారత—
పదము పాడర తమ్ముడా!
సమరసమ్ముల నాట్యమాడగ—
చివురు పలుకుల చెవులు విందుగ
కవిత లల్లిన కాంత హృదయము—
గారవింపవె చెల్లెలా!"

ఎన్నికల్లో ఇందిరా కాంగ్రెసుకు పూర్తిమెజారటీ లభించడం వలన ఆపార్టీ రాష్ట్రశాఖ అధ్యక్షులు ఇందిరా కాంగ్రెసు శాసనసభా పార్టీ నాయకులుగా ఎన్నికైన డాక్టర్ మర్రి చెన్నారెడ్డి 1978 మార్చి 6వ తేదీన రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవీ స్వీకార ప్రమాణం చేసారు.

డా॥ చెన్నారెడ్డి మంత్రివర్గం:— డా॥ చెన్నారెడ్డి (ముఖ్యమంత్రి) శ్రీయుతులు వీరమాచనేని వెంకట నారాయణ, కందుల ఓబులరెడ్డి, వడ్డే నాగేశ్వరరావు, సి.దాస్, కె బి. నరసప్ప, బి. రామ్‌దేవ్, ఎ. మదన్‌మోహన్, ఎం. బాగారెడ్డి, జి. రాజారామ్, పి. గంగారెడ్డి, ఎస్. జనార్ధనరెడ్డి, జి.వి. సుధాకరరావు, వై. వెంకట్రావు, భవనం వెంకట్రామారెడ్డి, ఎం. ఎం. హాషిం, జి. వెంకటస్వామి, ఎస్. అమరనాథరెడ్డి, ఎం. మాణిక్‌రావు, శ్రీమతి రోడామిస్త్రీ, టి. హయగ్రీవాచారి, పి. బి. చౌధరి (క్యాబినేట్ మంత్రులు) కె.వి.ఆర్.ఎస్. పద్మనాభరాజు, పరకాల శేషావతారం ఎం. పి.వి.ప్రసాదరావు, కోనేరి రంగారావు, ఎన్. భాస్కర్‌రావు, ఎ. వీరప్ప, ఎ. వెంగళరెడ్డి, అహమది షరీఫ్, గోకా రామస్వామి, నిజామ్‌అలీ, ఎన్. వెంకటరెడ్డి (సహాయ మంత్రులు) శ్రీమతి టి. సత్యవతి, బి. కృష్ణ,

రవీంద్రనాయక్, కె ఇ. కృష్ణమూర్తి, నీలం చార్లస్, రసపుత్ర నాగభూషణం (పార్లమెంటరీ కార్యదర్శులు)

డాక్టర్ చెన్నారెడ్డి మంత్రివర్గంలో 11 మంది వెనుకబడిన తరగతులకు, ఐదుగురు షెడ్యూల్డు కులాలకు, ఇద్దరు షెడ్యూల్డు తరగతులకు చెందినవారు. మంత్రులలో ముగ్గురు ముస్లింలు ఒక మహిళ కూడా ఉన్నారు. బలహీన వర్గాలకు చెందిన 83 మంది ఇందిరా కాంగ్రెస్ సభ్యులలోనూ 21 మందికి మంత్రివర్గంలో స్థానం లభించింది.

ఈ మంత్రివర్గంలో 19 మంది ప్రప్రథమంగా మంత్రులైనారు. ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలవారికి 3 : 2 నిష్పత్తిలో- అంటే ఆంధ్రప్రాంతం వారికి ఐదింట మూడు వంతులు, తెలంగాణా ప్రాంతంవారికి రెండువంతుల చొప్పున మంత్రి పదవు లివ్వబడ్డాయి. ముఖ్యమంత్రితో 33 మంది సభ్యులుగల మంత్రి వర్గం మొత్తము శాసనసభ్యుల సంఖ్యలో పదకొండో శాతం ఉన్నది. ఆంధ్ర ప్రదేశ్ విధానసభ స్పీకర్‌గా దివికొండయ్య చౌధరి, డిప్యూటీ స్పీకర్‌గా జనతా పార్టీ అభ్యర్థి కె. ప్రభాకరరెడ్డి పోటీలేకుండా ఎన్నికైనారు.

ప్రజాస్వామ్య సంప్రదాయాలను పటిష్ఠం చేయాలనే ఉద్దేశ్యంతో ముఖ్య మంత్రి డిప్యూటీస్పీకర్ పదవిని ప్రతిపక్షాలకు ఇచ్చారు. విధానపరిషత్ మాజీ సభ్యుడుగాను, మాజీ మంత్రిగానూ ప్రభాకరరెడ్డికి విశేషానుభవం ఉన్నది.

విధానసభలో ప్రతిపక్ష నాయకుడుగా ఎన్నికైన గౌతు లచ్చన్న (జనతా)కు మంత్రి హోదా కల్పించబడింది.

## పెద్దల మరణం

విధానపరిషత్ చైర్మన్ నివర్తి వెంకటసుబ్బయ్య 1978 మార్చి 28న గుండె ఆగి ఆకస్మికంగా మరణించారు.

నివర్తి వెంకటసుబ్బయ్య సిసలైన గాంధేయవాది. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు. మహాత్మాగాంధీ, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు సహచరుడు. 'స్వరాజ్య' పత్రిక ఉపసంపాధకుడుగాను, అటుతర్వాత 'హిందూ' పత్రిక విలేఖరిగా పనిచేసారు.

బీహార్ మాజీ గవర్నర్, లోక్‌సభ మాజీ స్పీకర్ ఎం. అనంతశయనం అయ్యంగార్ మార్చి 19న కన్నుమూసారు. ఆయన వయస్సు 87 సంవత్సరాలు.

అయ్యంగార్ రెండుసార్లు కారాగార శిక్ష అనుభవించారు. 1934 లోనే ఆయన కేంద్ర శాసనసభకు ఎన్నికయ్యారు. అనంతరం 1962లో లోక్‌సభ స్పీకర్‌గా ఎన్నికయ్యారు. ఇటీవలి కాలంవరకు ఆయన కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం అధ్యక్షులుగా ఉన్నారు.

ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు, లోక్‌సభ మాజీసభ్యులు బద్దం ఎల్లా రెడ్డి 1978 డిసంబర్ 26న మరణించారు. హైదరాబాద్ సంస్థాన స్వాతంత్ర్య పోరాటంలో ఆయన తొలి సత్యాగ్రహి. ఆంధ్ర మహాసభ పూర్వాధ్యక్షుడు.

## కార్యశూరుడైన ముఖ్యమంత్రి

డాక్టర్ చెన్నారెడ్డి కార్యశూరుడుగా పేరు తెచ్చుకొన్న నాయకుడు. అభివృద్ధి సంక్షేమ విషయాలలో ఆయనకు పట్టుదల మెండు. ప్రజా సంక్షేమ దృష్ట్యా ఫలానా పని జరగాలంటే జరిగి తీరవలసినదే. ప్రజా సంక్షేమానికి అడ్డు పుల్లలు వేసే ధోరణి, జాప్యం, 'చేస్తాం, చూస్తాం' మొదలైనవి ఆయనకు గిట్టవు. స్తబ్దత, మందకొడితనం, సోమరితనం ఇత్యాదివి ఆయన తత్వానికి సరిపడవు. ఆయన కార్యోత్సాహం అటువంటిది. ప్రజల గోడు విన్న తర్వాత బహిరంగ సభలలో తాను చేసిన వాగ్దానాలను, ప్రకటనలను ప్రభుత్వ ఉత్తరువులుగా పరిగణించాలని శాసించటం ఆయన ఉత్సాహాతిశయానికి తార్కాణం. రథచక్రాలు ఎప్పుడూ కదలుతూ ఉండాలి. కానీ భారత పరిపాలనా వ్యవస్థను ఇనుప చట్టాలతో బిగించి ఒక యంత్రంగా మార్చివేసారు బ్రిటిషు పాలకులు. ప్రపంచంలో ఇంతకంటే యాంత్రికమైన వ్యవస్థ లేదన్నాడు వైస్రాయ్ లార్డ్ కర్జన్.

ముఖ్యమంత్రి ఉత్తరువులు ఫర్మానాలు జారీచేయడం వంటివి కావు. ఎన్నో విషయాలు పరిశీలించి సంప్రదించిన మీదటే నిర్ణయాలు గైకొనడం జరుగుతున్నది. మనం చేయగలవాటి గురించే వాగ్దానాలు చేయాలి; వాగ్దానాలు చేసిన వాటిని నెరవేర్చాలనేది ముఖ్యమంత్రి అభిమతం.

## సర్వస్వతంత్రం—అయితేనేం?

ముఖ్యమంత్రి తత్త్వం సర్వ స్వతంత్రం. అయితేనేం? ముఖ్యమైన అనేక సందర్భాలలో ఆయన ప్రతిపక్ష నాయకుల సలహాలను తీసుకొని వాటిని సాధ్యమైనంత వరకు అమలు పరచడానికి ప్రయత్నిస్తున్నారు. రాజకీయాలలో నిరంతరం నిలకడగల విధానం అనుసరించడం గొప్పగుణమని చెప్పక తప్పదు. కానీ అప్పుడప్పుడు కొద్దికొద్దిగా సమాధాన పడటంతో అది మరింత రాణిస్తుంది. వివేకవంతమైన ఈ చర్యను ముఖ్యమంత్రి పాటించి తమ వ్యక్తిత్వాన్ని పెంచుకొంటున్నారు.

రాజకీయ ప్రత్యర్థులగురించి చెడుగానీ, ద్వేషంతోగానీ మాట్లాడటంలో డా॥ చెన్నారెడ్డికి విశ్వాసం లేదు. ఆయన కాంగ్రెసు (ఐ) లెజిస్లేచర్ పార్టీ నాయకుడుగా ఎన్నికైనప్పుడు ముఖ్యమంత్రి పదవి స్వీకరించే ముందు తన పూర్వపు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు నివాసగృహానికి వెళ్ళి ఆయనను కలుసుకున్నారు. అందరి శుభాకాంక్షలతో పని చేయాలన్నదే ఆయన అభిమతం. సికింద్రాబాద్, సిద్ధిపేట నియోజక వర్గాలనుంచి లోక్‌సభకు జరిగిన ఉప ఎన్నికలలో కాంగ్రెస్ (ఐ) అభ్యర్థులకు మద్దతు ఇవ్వాలని కాంగ్రెసుపార్టీ చేసిన నిర్ణయాన్ని అందుకు కారకులైన శ్రీ బ్రహ్మానందరెడ్డి అభిప్రాయానికి తాను చాలా విలువ ఇస్తున్నట్లు ముఖ్యమంత్రి ప్రకటించారు.

## లోక్ సభలో ప్రధాన ప్రతిపక్షంగా మారిన కాంగ్రెసు (ఐ)

శ్రీమతి రాధాబాయి ఆనందరావు, శ్రీయుతులు ఎన్. బి. పి. పట్టాభిరామారావు, బి. రాజగోపాలరావు, ఎం. సత్యనారాయణరావు, జె. కొండలరావు, జి. ఎస్. రెడ్డి, ఎం. ఎస్. సంజీవరావు, కె. కృష్ణమూర్తి ఇందిరా కాంగ్రెస్‌లో చేరిపోవడంతో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన 24 మంది లోకసభ్యులు కాంగ్రెసు (ఐ) పక్షాన నిలిచారు. ప్రస్తుత లోక్‌సభలో కాంగ్రెసు (ఐ) కి కాంగ్రెసు పార్టీకంటే స్వల్పమెజారిటీ ఏర్పడి శ్రీ స్టీఫెన్స్‌కు 1978 ఏప్రిల్ 12 వ తేదీనుండి ప్రతిపక్ష నాయకుని హోదా లభించింది. శ్రీ వై. బి. చవాన్ (కాంగ్రెస్) సంవత్సరంపైగా ప్రతిపక్షనాయకునిగా వ్యవహరించారు.

కాంగ్రెసు (ఐ) జనవరిలో కాంగ్రెసునుండి విడిపోయింది. అప్పటినుండి

లోక్‌సభలో రెండవ ప్రతిపక్షంగా వ్యవహరించింది. మార్చి నెలలో రాజ్యసభ ద్వైవార్షిక ఎన్నికల అనంతరం కాంగ్రెసు సభ్యులు పెక్కుమంది కాంగ్రెసు (ఐ) లో చేరారు.

## రామగుండం సూపర్ థర్మల్ కేంద్రం

ప్రధాని శ్రీ మురార్జీ దేశాయి 1978 నవంబరు 14 న రామగుండంలో 870 కోట్ల రూపాయల వ్యయంతో నిర్మించనున్న సూపర్ థర్మల్ కేంద్రానికి శంఖుస్థాపన చేశారు. నిర్మాణంలో ఉన్నప్పుడు ఇది 15 వేల మందికి ఉద్యోగాలు కల్పిస్తుంది.

జాతీయ థర్మల్ విద్యుచ్ఛక్తి నిర్మించే విద్యుత్కేంద్రాలలో మూడవదైన రామగుండం సూపర్ థర్మల్ విద్యుత్కేంద్రం మొదటి దశలో 1100 మెగావాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తుంది.

ఈ ప్రాజెక్టు ఉత్పత్తిచేసే విద్యుత్‌లో ఆంధ్రప్రదేశ్‌కు 17 శాతం (ఈ రాష్ట్రంలో ప్రాజెక్టు ఉంది గనుక మరో పదిశాతం వెరసి ఆంధ్రప్రదేశ్‌వాటా 27 శాతం) కర్నాటకకు 16 శాతం, తమిళనాడుకు 22 శాతం, కేరళకు 11 శాతం, గోవాకు 9 శాతం ఇవ్వాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఇవన్నీ కాకుండా 15 శాతం అత్యవసర పరిస్థితుల కోసం అట్టే పెట్టాలని కూడా కేంద్రం వాంఛిస్తున్నది.

## విశాఖ ఉక్కు కర్మాగారం

సరికొత్త పరిజ్ఞానంతో విశాఖవద్ద ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణానికి 1978 డిసంబర్‌లో కేంద్ర ప్రభుత్వం అనుమతించింది. సెప్టెంబరులో విశాఖ ఉక్కు ఫ్యాక్టరీ స్థలాన్ని సందర్శించిన కేంద్ర ఉక్కు మంత్రి బిజూ పట్నాయక్, చిట్ట చివరికి ఈ ఫ్యాక్టరీ నిర్మాణానికి మొదటిదశలో 850 నుండి 900 కోట్ల రూపాయల వరకు వ్యయమవుతుందని ఇప్పటి అంచనా. దీని నిర్మాణాని కయ్యే వ్యయంలో సగానికిసగం సోవియట్ యూనియన్ మిగతా సగం కేంద్రప్రభుత్వం భరిస్తుంది. నీరు, విద్యుత్ సరఫరాతోపాటు ఫ్యాక్టరీలోపల పరిసరాల్లో అవసరమైన పారిశ్రామిక సదుపాయాలను రాష్ట్ర ప్రభుత్వం సమకూరుస్తుంది.

ఒక దశాబ్దం కిందట కేంద్ర ఉక్కుమంత్రిగా ఉన్నప్పుడు డా॥ చెన్నా రెడ్డి విశాఖ ఉక్కు కర్మాగార నిర్మాణం ప్రతిపాదన చేసారు. బ్రహ్మానందరెడ్డి నుంచి వెంగళరావు వరకు దీర్ఘకాలిక ఉద్యమంగా ప్రయత్నించారు డా॥ చెన్నా రెడ్డి ముఖ్యమంత్రి అయిన తర్వాత యీ కృషి ఫలించింది.

## గోదావరీ జలాల పంపిణీ

గోదావరీ జలాల పంపిణీపై ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా ముఖ్యమంత్రులు 1978 డిసెంబర్ 15న హైదరాబాద్‌లో ఒక నిర్ణయానికి వచ్చారు. దీనివలన యీ రెండు రాష్ట్రాలమధ్య దశాబ్దంగా నలుగుతూ ఉన్న కొన్ని వివాదాలు పరిష్కారమైనాయి. ఈ ఒప్పందంతో గోదావరీ నదిపై పోలవరం వద్ద బ్యారేజి ఎత్తును 150 అడుగులు పెంచాలన్న రాష్ట్ర ప్రభుత్వ సంకల్పానికి అవరోధం తొలగిపోయింది. దానివల్ల గోదావరీ జలాలను కృష్ణానదికి మళ్ళించుకునే సౌలభ్యం ఆంధ్రప్రదేశ్‌కు లభించింది. అయితే ఆంధ్రప్రదేశ్, ఒరిస్సాల మధ్య 22 గ్రామాల విషయంలో వివాదాలు సుప్రీంకోర్టు పరిశీలనలో ఉన్నందున అవి ఇంకా పరిష్కారం కాలేదు.

## పేద రైతులకు శిస్తురద్దు

చెన్నారెడ్డి ప్రభుత్వం 1978 నవంబరు 25వ తేదీన ఒక ఆర్డినెన్స్‌ను జారీచేసింది. ఐదు ఎకరాల ఖుష్కీ, లేక రెండున్నర ఎకరాల తరీ భూములు లేదా దానికి సమానమైన తరీ ఖుష్కీ భూముల పట్టేదార్లను భూమిశిస్తు చెల్లింపు నుంచి మినహాయించినట్లు యీ ఆర్డినెన్స్ ప్రకటించింది.

1979 జనవరి 4న విడుదలచేసిన ఆర్డినెన్స్‌లో కౌల్దార్ల రక్షణచట్టం గడువును ప్రభుత్వం పొడిగించింది. భూస్వాములు కోర్టు డిక్రీ తెచ్చుకొన్నప్పటికీ, వారు భూములను సేద్యం చేస్తున్న కౌల్దార్లను బేదఖల్ చేయడానికి వీలు లేని విధంగా ఈ ఆర్డినెన్స్ రక్షణ కల్పిస్తుంది. పైగా కౌల్దార్ల స్వాధీనంలో ఉన్న భూమిని ఎట్టి డిక్రీ ఆధారంగా విక్రయించడానికి, కొనుగోలు చేయడానికి వీలులేదు.

ఈ ఆర్డినెన్స్ 1978 అక్టోబర్ 8వ తేదీనుండి అమలులోనికి వచ్చినట్లు పరిగణన కొచ్చింది.

శ్రీమతి శారదాముఖర్జీ స్థానంలో కె.సి. అబ్రహాం 1978 ఆగష్టు 14 నుంచి రాష్ట్ర గవర్నరుగా నియమితులైనారు.

## ఇందిరాగాంధీకి జైలుశిక్ష-ప్రశాంతంగా నిరసనలు

పూర్వపు లోక్‌సభ ఆదేశం మేరకు సంజయ్‌గాంధీ మారుతీ లిమిటెడ్ చిన్నకార్ల కంపెనీకి చెందిన సమాచారం సేకరించ యత్నించిన పరిశ్రమల శాఖ అధికారులను బెదిరించి, వేధించి, ఆటంకపరచడం ద్వారా శ్రీమతి గాంధీ, ఆమె ప్రైవేటు సెక్రటరీగా ఉండిన ధావన్, కేంద్ర నేర పరిశోధక విభాగం మాజీ డైరెక్టర్ డి. సేన్‌లు లోక్‌సభా హక్కులకు భంగం కలిగించారని సభాహక్కుల కమిటీ 1978 నవంబర్ 21వ తేదీన పేర్కొన్నది.

సభాహక్కులను ఉల్లంఘించిన నేరానికి లోక్‌సభ 1978 డిసంబర్ 19న సభ ప్రోరోగ్ అయ్యేదాకా శ్రీమతి గాంధీకి జైలుశిక్ష విధించింది. వారం రోజుల నిర్బంధం అనంతరం ఆమె 26వ తేదీన జైలునుంచి విడుదలయ్యారు.

శ్రీమతి గాంధీకి జైలుశిక్ష విధించినందుకూ, లోక్‌సభనుంచి బహిష్కరించినందుకూ దేశవ్యాప్తంగా అల్లరులు జరిగాయి. ఆంధ్రప్రదేశ్‌లో రెండువేల మంది అరెస్టయ్యారు. డిసంబర్ 20వ తేదీన జంటనగరాలలోను జరిగిన బంద్ ప్రశాంతంగానే ముగిసింది.

## దైవికంగా బ్రతికిబైటపడ్డ ముఖ్యమంత్రి

1978 డిసంబరు 17న ముఖ్యమంత్రి డా॥ చెన్నారెడ్డి ప్రయాణంచేస్తున్న ఇండియన్ ఎయిర్‌లైన్స్‌కు చెందిన బోయింగ్-737 విమానం బేగంపేట విమానాశ్రయంలో కూలిపోయింది. ముఖ్యమంత్రి ఆయనతోపాటు ప్రయాణం చేస్తున్న 120 మంది ప్రయాణికులు దైవికంగా సురక్షితంగా బయటపడ్డారు. ఈ దుర్ఘటననుంచి తప్పించుకొన్న ముఖ్యమంత్రిని అభినందిస్తూ అనేకమంది దేశ నాయకులు సందేశాలుపంపారు. రాష్ట్రంలోని ముఖ్యమైన దేవాలయాలలో ప్రత్యేక పూజలు జరిగాయి.

## ఎన్నికల్లో జనతాకు తిరిగి పరాజయం

గత లోక్‌సభ ఎన్నికలలో సికిందరాబాద్ నుంచి ఎన్నికైన ఎం.ఎం. హాషిం, సిద్ధిపేటనుంచి ఎన్నికైన జి. వెంకటస్వామి రాష్ట్ర మంత్రివర్గంలో చేరి

పోవడం వలన, సత్తుపల్లి శాసనసభ నియోజకవర్గం నుంచి ఎన్నికైన మాజీ ముఖ్యమంత్రి జలగం వెంగళరావు శాసన సభ్యత్వానికి రాజీనామా వలన, నిడుమోలు నియోజకవర్గం నుంచి శాసనసభకు ఎన్నికైన ప్రముఖ మార్క్సిస్టు నాయకుడు గుంటూరు బాపనయ్యా మరణం వలన ఈ నియోజకవర్గాలలో 1978 జనవరి 7న ఉప ఎన్నికలు జరిగినవి. స్వర్గీయ గుంటూరు బాపనయ్య పట్ల గౌరవ సూచకంగా ఆయన సతీమణి శ్రీమతి సూర్యావతికి వ్యతిరేకంగా పోటీ చేయరాదని కాంగ్రెస్ (ఐ)తో సహా తక్కిన పార్టీలన్నీ నిశ్చయించాయి. శ్రీమతి సూర్యావతి 42,250 ఓట్లతో గెలుపొందగా మిగితావారు డిపాజిట్లు కోల్పోయారు.

సత్తుపల్లి నియోజకవర్గంలో జనతాపార్టీ ఇండిపెండెంటు అభ్యర్థి సత్యంను బలపరిచింది. ఇది వెంగళరావుకు కంచుకోటగా ప్రసిద్ధి. ఈ ఎన్నికల సమయంలో వెంగళరావు తటస్థాన్ని అవలంబించారు. ఖమ్మం జిల్లాకు చెందిన ఇద్దరు ప్రముఖ నాయకులు జలగం కొండలరావు, శీలం సిద్ధారెడ్డి కాంగ్రెస్ (ఐ) అభ్యర్థి జె. వెంకటేశ్వరరావును బలపరిచారు. ఆయన 48,602 ఓట్లతో విజయం సాధించారు. సత్తుపల్లి నియోజకవర్గంలో విజయం చేకూరిన ఫలితంగా కాంగ్రెసు (ఐ)కి అదనంగా మరొక అసెంబ్లీ స్థానం లభించింది.

సికిందరాబాద్ లోక్‌సభ నియోజకవర్గంలో కాంగ్రెస్ (ఐ) అభ్యర్థి పి. శివశంకర్ తన సమీప జనతాపార్టీ ప్రత్యర్థి శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మపై సుమారు 20 వేల ఓట్ల మెజారిటీతో విజయం సాధించారు.

సిద్దిపేట (రిజర్వుడు) లోక్‌సభ నియోజకవర్గంలో కాంగ్రెస్ (ఐ) అభ్యర్థి ఎన్. ఎల్లయ్య లక్షా 74 వేల ఓట్ల మెజారిటీతో ఘన విజయం సాధించారు.

1979 జనవరి నెలలో షష్టిపూర్తి జరుపుకొన్నారు డా॥ చెన్నారెడ్డి.

'వెలిగి పోవుత చైతన్య విజయకాంతి
తొలిగి పోవుత దారిద్ర్య దురిత శక్తి
మంత్రి మర్రి చెన్నారెడ్డి తంత్ర దీక్ష
తెలుగు జాతికి మకుటమై నిలుచుగాత !'

నడుస్తున్న చరిత్రకు చివరి పత్రం లేదు. వర్తమాన రూపకంలో భరత వాక్యం ఉండదు.

# ఉపకరించు గ్రంథములు

I ఇంగ్లీషు :


1. Memoriers of Hyderabad Freedom struggle :
   - Swami Ramananda Tirtha.
2. Commemoration Volume of Swami Ramananda Tirtha.
3. Sardar Patel Correspondence Vol. VII :
   - Edited by Durga Dass.
4. Mission with Mountbatten : Ailen Campbell Johnson.
5. Ruler to Raj Pramukh, NizamVII : Publisheb by the Finencial Advisor to H E H the Nizam.
6. Accession to Extinction : D. R. Manekar.
7. Thanks giving : Sadath Ali Khan.
8. Conflicts & Crisis-Political India : E.M.S. Nambroodipad.
9. The indomitable Sardar : K.L. Punjali
10. The end of an era : K.M. Munshi.
11. The freedom struggle in Hyderabad Vol. IV :
    - Edited by N. Ramesan.
12. India from curzon to Nehru & After : Durga Dass.
13. Report of Royel Commission on jagir administration and reforms of H E H the Nizam's Govt. (1347 Fasli).
14. Hyderabad State Souvenir, HRH The prince of wales visit (1922)
15. A memorir-Sir Salarjung, G.C.S.I. : Syed Hussian Bilgrami (1883)
16. The Historic Telangana struggle : C. Rajeshwar Rao.
17. Communists in Congress-Kumara Mangalam's Thesis :
    - Satish Singh.
18. Jawaharlal Nehru : Frank Moraes (Jaica)
19. The New Dimensions of pcace : Chester Bowles (Penhant Edition)
20. Telangana Peoples struggle and its lessons : P. Sundarayya.
21. Regionalism in India-A case study of Telangana: G'R.S. Rao
22. Outlines of South Indian History with special reference to Karnataka : M.N. Venkata Ramanappa.
23. Telangana : K.V. Narayana Rao.

24. Freedom at Mid Night : Larry collins anb Dominique Lapierrye.
25. The politics of Leadership in an Indian State : – N. Bhaskara Rao.
26. Fubulous Mogul : Karaka.
27. My reminiscences of Sardar Patal : V. Shankar.

II తెలుగు :

28. తెలుగువాణి : ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక.
29. మాడపాటి హనుమంతరావు షష్ఠిపూర్తి సంచిక
30. బూర్గుల రామకృష్ణరావు షష్ఠిపూర్తి సంచిక : 'స్రవంతి' ఏప్రిల్ 1959.
31. పి.వి. నరసింహారావు అభినందన సంచిక : జనధర్మ ప్రచురణ
32. సమకాలీన చరిత్ర ప్రత్యేకసంచిక : 'ప్రసారిత' జులై-సెప్టెంబరు 1973
33. తెలుగు వెలుగుల శీర్షికలు : ఆంధ్రసచిత్ర వారపత్రిక (9-9-1959 నుంచి 15-3-1961 వరకు)
34. స్వీయ చరిత్ర : కొండా వెంకటరంగారెడ్డి
35. వీర తెలంగాణా : రావి నారాయణరెడ్డి
36. బ్రహ్మనందయాత్ర : కపిల కాశీపతి
37. నా జీవితకథ నవ్యాంధ్రము : అయ్యదేవర కాళేశ్వరరావు.
38. టంగుటూరి ప్రకాశం జీవితచరిత్ర : ఎమెస్కో ప్రచురణ
39. యాభై సంవత్సరాల హైదరాబాద్ : మందుముల నరసింగరావు
40. తెలంగాణా పోరాటం : ఆదిరాజు వెంకటేశ్వరరావు బి.ఎస్.ఎన్. రామచంద్రరావు
41. ఆంధ్రప్రదేశ్ రాజకీయ పరిణామ చరిత్ర : ఎన్. ఇన్నయ్య.
42. తెలంగాణాలో జాతీయోద్యమాలు : దేవులపల్లి రామానుజరావు
43. తెలుగు వెలుగు, వెంగళరావు నాయకత్వాన రాష్ట్ర ప్రగతి : (రాష్ట్ర పంచాయతీ రాజ్ పరిషత్తు)
44. 'ఆంధ్ర జనత' స్వాతంత్ర్య రజతోత్సవ సంచిక.

III ఉర్దూ :

45. తుజుక్ మహబూబియా : గులాం సమ్దాన్ ఖాన్ గోహర్ (1901)
46. స్టార్ డైరెక్టరీ ముమ్‌లకతె హైదరాబాద్ : స్టార్ ప్రెస్ అలహాబాద్ (1939)
47. నవాబ్ బహాదుర్ యార్‌జంగ్ : గులాం మహమ్మద్
48. తారిక్ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ : ఇత్తెహాద్ ప్రచురణ
49. ఆరజీ హుకూమత్ మె మేరీ షిర్కత్ : జి. రామాచారి
50. యాదోంకీ బరాత్ : జోష్ మలియాబాదీ
51. తారిక్ తరక్కీ ముమ్‌లకత్ అసఫియా : ఖాజా హమీద్ అహమద్ (1348 ఫ.)
52. అర్‌మఘాన్ హర్సానీ-హయాతె ఉశ్మానీ : యాకూబ్ అలీ హర్సానీ (1935)
53. యాద్‌గార్ సిల్వర్ జుబ్లీ ఆసఫ్‌జా 7 2 సంపుటాలు : మహమ్మద్ ఫాజిల్ సంకలనం
54. హైదరాబాద్‌లో 30 సం॥రాల రాజకీయ పోరాటం : కృష్ణస్వామి ముదిరాజ్

---